# డిపీ ది కిడ్

# 'రుచి అయిన కాపుదల' లో

రెడ్ ఇండియన్లు కోటను దాడిచేసారు!

డిపీ ది కిడ్ తయారు




ఫిరంగుల్ని రట్టించారు










ఇండియన్స్ విభ్రాంతులయ్యారు!



డిపీస్ లెమన్ మరియు ఆంరెజి స్క్వాష్, ఎదిరించే ఇండియన్స్‌లో కలవరం లేపాయి!



ఇండియన్స్ సంధికి తలపడ్డారు




యుద్ధం ఆయిపోయింది; యిది యిక సరదాసమయం!










అవునర్రా! డిపీస్ అన్నారంటే చాలు—నోరూరించినట్టే! దారికే అన్ని స్క్వాష్‌లు, సిరప్‌లకన్న మరెంతో మజా రుచిగల వాటిని తయారు చేస్తారు డిపీస్. లెమన్, ఆరెంజి, మేంగో స్క్వాష్‌లు, లెమన్ బార్లీ వాటర్, లైమ్ కార్డియల్, పైనాపిల్ క్రష్. రాజాదనాన్నిచ్చే రోజ్ సిరప్. డిపీస్ జాతికి చెందిన మిగతావన్నీను. మరి ఆ ఇండియన్స్ ఏదైనా మంచిది చూసారంటే చాలు, వెంటనే పట్టేస్తారు.

## డిపీస్ అసలైన పళ్ళరుచిగలది- ఎంతో తాజాగా, రసమొలికేలా

daCunha-Dip-43 TL

*భర్త కన్నా భార్య పెద్దదైతే ?*

'హిందూ శాస్త్ర ప్రకారం కుటుంబంలో పురుషుడు సర్వాధికారి' అంటూ పూర్వంలో భార్య వయసుకన్నా భర్త వయసు పది సంవత్స రాలైనా ఎక్కువుండేదని - పురుషాధిక్యతను చాటే సంప్రదాయాన్ని కాకాని ప్రమదగారు సమర్థించడం నాకు నచ్చలేదు.

వారన్నట్టు మానసికంగా స్త్రీ త్వరగా ఎదిగినా, శారీరకంగా ఎదుగుతుందనడం సరికాదు. శారీర కంగా ఎదగడమంటే దాంపత్యానికి అర్హురాలవు తుందనడమనుకుంటాను. అయితే లైంగికపరంగా ఆమెకు చైతన్యం అంకురించే వయస్సు 25 సం॥ల తర్వాతే. కాని పురుషుడికి సామర్థ్యం చాలా ముందుగానే వచ్చేస్తుంది. ఈ ప్రకృతి లిలా ఉన్నప్పుడు పాతికేళ్ళ యువకుడికీ, పదహారేళ్ళ అమ్మాయితో వివాహం జరిగితే ఓ దశాబ్దం తిరిగే సరికి అతగాడికి 35, ఆవిడకి 26 వస్తాయి. అది అతడి లైంగిక సామర్థ్యం తగ్గుముఖం పట్టేకాలం. కాని ఆమెలో అది లైంగిక చైతన్యమంకురించే కాలం. అంతకుముందు ఆమెకి సుఖమంటే ఏమిటో తెలియదు. తెలిసిం తర్వాత అది లభించదు!

మనువు అందుకే 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అని శాసనం చేస్తూ భర్తృ స్వామ్య వ్యవస్థ నేర్పరచాడు. ఇలా నానా చాకిరీల్లో స్త్రీని ముంచేసి, విశ్రాంతి లేకుండా చేసి, జవసత్వాలుడిగేలా, చైతన్యం సన్నగిల్లేలా చేయాలన్నాడు.

స్త్రీ స్వాతంత్ర్యాన్ని గుర్తించిన మనమీనాడు భర్తృస్వామ్య వ్యవస్థకు ప్రాముఖ్యం లేకుండా చేశాం. అలా పురుషాధిక్యతను చాటే ఆచారాలూ, స్త్రీ సుఖాన్ని వమ్ముచేసే సంప్రదాయాలూ తొలగి పోవాల్సిన రోజులివి.

పురాణాల్లో కూడా పురుషునికన్నా స్త్రీ వయస్సు ఎక్కువున్న సంఘటనలెన్నో ఉన్నాయి. ఉదాహర ణకు సీతారాముల జంట చాలు. పాతిక సంవత్స రాల ప్రౌఢ పద్దెనిమిదేళ్ళ యువకుడూగల జంట సుఖంగా ఉండగలదనేది చేదుగా కనపడ్డా అది నిజం.

జయ వరంగల్

*పిల్లలు కలగక పోవడానికి కొన్ని కారణాలు!*

డాక్టర్‌గారు వ్రాసిన "పిల్లలు లేకపోవటానికి కొన్ని కారణాలు" సమగ్రంగా పరిచయం చేయ లేదనుకుంటాను.

పురుష వీర్యంలో శుక్లకణాలు లేకపోవడానికి మరికొన్ని ముఖ్యమైన కారణాలు వున్నాయి.

బాల్యంలో గవద బిళ్ళలు, ఇన్‌ఫ్లుయంజా, చికెన్‌పాక్స్, స్మాల్‌పాక్స్ వంటి వైరస్ వ్యాధు లతో బాధపడిన వారిలోను, సుఖవ్యాధులతో బాధ పడినవారిలోను, యురెథ్రైటిస్, ఎపిడిడిమైటిస్ వంటి వ్యాధులవలన కూడా శుక్లాణువులు లేకుండా పోవచ్చును.

స్త్రీలలో ఇంకా కొన్ని కారణాలవలన సంతానో త్పత్తి చేయగల శక్తి లేకుండాపోవటం జరుగ వచ్చును.

గర్భాశయంలో 'ఎసిడిటీ' ఎక్కువగా ఉండటం వలన శుక్లకణాలు నశించి గర్భధారణ జరుగదు.

కణితలు (ట్యూమర్స్) ఏర్పడటం, గర్భకోశపు క్షయవ్యాధి, సుఖవ్యాధులు, డయబిటీస్ వ్యాధుల వలన కూడా గర్భధారణకు అవరోధం కలుగ వచ్చును.

ఋతుస్రావ సమయంలోనే కాక, ప్రసవమయిన తరువాత కూడా సూక్ష్మజీవులవలన ట్యూబులలో అవరోధం ఏర్పడి గర్భధారణ జరుగకపోవచ్చును.

సమగ్రంగా తెలుపకపోవటం వలననే డాక్టర్ గారు "కొన్ని కారణాలు" అని వ్రాశారనుకుం టాను.

ఇలాంటి విజ్ఞానాత్మకమైన శీర్షికలవలన మన సమాజంలో ప్రబలి వున్న మూఢ విశ్వాసాలు తొలగిపోగలవు.

తులసీమూర్తి హైదరాబాదు


# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 5 సంచిక : 9

మార్చి : 1980

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026




ఈ 'అభిప్రాయాలు' పేజీలలో ప్రచురింపబడే ప్రతి లేఖకూ

**పారితోషికం పది రూపాయలు**

*వివాహాలు-లాంఛనాలు*

సంఘాన్నిపట్టి పీడిస్తున్న దురాచారం వర కట్నం అని అందరం అనుకుంటాము. కాని దాని కంటె ప్రమాదకరమైనదీ, కనిపించనిదీ పెళ్ళిళ్లలో జరిగే లాంఛనాల కార్యక్రమం. వీటి పేరిట ఎంత ఖర్చవుతుందో కూడా అంచనా వేయలేము. కట్నం అక్కరలేదుగానీ లాంఛనాలు ఘనంగా జరపండి అంటూ కొందరు కట్నం కంటె అధికంగా వీటి పేరిట ఆడపెళ్లివారివద్ద నుంచి స్వీకరిస్తున్నారు. దీనితో ఆడపిల్ల తండ్రి ఈ లాంఛనాలకంటే ఆ కట్నమే ఎంతో ముందే నిర్ణయించుకోవడం మేలు అని అనుకొనే స్థితికి వస్తున్నాడు. ఇంక కట్నం తీసుకొని కూడా లాంఛనాలు జరిపించుకొనే ఘనులూ ఉన్నారు. ఏ సందర్భంలో ఏమిటేమిటి పెట్టాలో, ఎలాంటివి, ఎంత ఖరీదులో పెట్టాలో కూడా పెద్ద లిస్టు ఇస్తారు. ఇలా ఈ లాంఛనాల మూలంగా చాలా దుబారా అవుతోంది. మగ పెళ్ళి వారు అనగానే ఏదో దేవలోకం నుంచి దిగి వచ్చి నట్లు భావించుకొని, తాము కోరే గొంతెమ్మ కోరికలన్నిటినీ ఆడపెళ్ళివారు చచ్చినట్లు ఎలాగో ఓలాగ తీర్చాలి అనుకుంటారు.

ఈ 'లాంఛనాల' కార్యక్రమాన్ని గమనిస్తే 'ఇచ్చినమ్మ వాయనం పుచ్చుకొన్నమ్మ వాయనం'లా అనిపిస్తుంది. ఆయా సందర్భాలలో ఇరు పక్షాలవారూ కూడా లాంఛనాలు జరుపుకో

వాలి. అలాంటివి మానేస్తే ఇరువురికీ కూడా ఆ డబ్బు ఇంకోదానికి ఖర్చు పెట్టుకొనేందుకు అవకాశం ఉందికదా: ముఖ్యమైన కార్యక్రమాలు తప్ప మిగిలిన తంతులన్నీ వివాహాలలో రద్దు చేస్తే లాంఛనాలు కూడా రద్దవుతాయి, కాలం కలిసి వస్తుంది. ఈ లాంఛనాల పేరిట ఆడపెళ్ళివారిని మగపెళ్ళివారు పీడిస్తున్నారు. ఇంకా కొందరు మగ పెళ్ళివారు పెట్టవలసినవన్నీ లిస్టులు రాసి ఇచ్చి, తాము పెట్టవలసినవాటిని మాకు ఆనవాయితీ లేదని ఒక ముక్కలో తేల్చి పారేస్తారు. ఆ మాట ఆడ పెళ్ళివారు అనడానికి వీలులేదు. మగపిల్లాడి పెళ్ళిలో హోదా చెలాయించి ఆడపెళ్ళివారిని ఇబ్బందులు పెట్టేవాళ్ళు, తమ పిల్ల పెళ్ళిలో అలాంటి ఇబ్బందులుపడవలసివస్తే ఎంత బాధ పడతారో, లేకపడ్డారో గుర్తుంచుకొంటే ఇలాంటివి కాస్త నిరోధించవచ్చు. ముఖ్యంగా ఈ లాంఛనాల కార్యక్రమాలలో స్త్రీలే ప్రముఖపాత్ర వహిస్తారు కనుక వారు ఒకసారి ఆత్మపరిశీలన చేసుకొని, సంస్కారయుతంగా ప్రవర్తిస్తే వివాహం అంటే ఆడపెళ్ళివారు భయపడే రోజులు పోయి ఆనందంగా జరిపే రోజు ఎంతో దూరంలో ఉండదు.

బి. రమణి ఏలూరు

### ఆచారాలు ఎందుకు ఆచరించాలి?

మన పూర్వీకులు శుచి, శుభ్రతకోసం "పండుగలు" అనే వంకతో కొన్నిరకాల పనులను కొన్ని కొన్ని రోజులలో చేయమని సూచించారు. కానీ కొందరు వీటికి పాప, పుణ్యాలు అంటగట్టి మసి పూసి మారేడుకాయ చేసినట్లుగా తయారుచేసారు. దీని వలన చాలామంది అసలు ఈ పండుగలు ఆచరించడానికిగల అసలు కారణాలు మరచిపోయి, ఆ పాప, పుణ్యాలు అనే మాటలు పట్టుకొని వాటిని అర్థం చేసుకోకుండా గుడ్డిగా ఆచరిస్తూ, నేటి యువతరాన్ని కూడా ఆచరించమంటున్నారు.

ఉదాహరణకు కొందరు అనారోగ్యం బాధ పడుతున్నాసరే పుణ్యం పేరుతో వరుసగా శనివారమనీ, ఏకాదశి అనీ, కార్తిక సోమవారమనీ ఇలా వరుసగా తలంటుకోవటాలూ, స్నానాలూ, ఉపవాసాలూ వగైరాలు చేస్తూ ఉంటారు. వీరు తమ పిల్లలను కూడా అలా చేయమంటారు. ఎందుకు అని అడిగితే 'ఏమో మన పెద్దలు ఎందుకో పెట్టారు. మనం వాటిని ఆచరించాలి. లేకుంటే మహాపాపం చుట్టుకుంటుంది' అంటూంటారు అర్థం లేకుండా.

ఈ అర్థం లేని మూఢాచారాలు ఎందుకు ఆచరించాలి? (ఉదా:-శనివారం నాడే ఎందుకు తలంటుకోవాలి?) అనే ప్రశ్నలు యువతరం మనస్సుల్లో పీడిస్తూ ఉంది, ఈ ఆచారాల ఆచరణలో గల "మంచి" (అంటే వారానికి ఒక్క రోజయినా తలంటుకోవటం మంచిది అనే ఆరోగ్య సూత్రాన్ని) మరచిపోయి మొండిగా తయారవుతారు. దాంతో యువతరానికీ, పెద్దతరానికీ మధ్య అభిప్రాయ బేధాలు అవతరిస్తాయి.

కాబట్టి పెద్దలు (ప్రత్యేకం తల్లులు) తమ పిల్లలను ఈ మన పురాతన సాంప్రదాయాలను మూఢంగా ఆచరించమనకుండా, వాటిలోని మంచిని (పాప పుణ్యాల మాట ఎత్తకుండా) సశాస్త్రీయంగా ఆలోచించి, అవి ఎంతవరకూ ప్రస్తుత పరిస్థితులలో ఆచరణయోగ్యమో తెలుసుకుని వాటిలో ఉన్న మంచి, శుభ్రతలను విడమరచి చెపితే యువతరం వాటిని ఎందుకు ఆచరించదు? అప్పుడు యువతరానికీ, పెద్దలకూ మధ్య అభిప్రాయబేధాలు ఎందుకు వస్తాయి?

కాళ్ళకూరి అన్నపూర్ణ అమలాపురం

### స్త్రీలు - రాజకీయాలు

మన భారతావనిలో రాజకీయరంగాన్ని పరిశీలిస్తే అందులో పాల్గొనే స్త్రీల సంఖ్య చాలా తక్కువనే సంగతి స్పష్టమవుతుంది. పురుషులతో సరిసమానంగా కాకపోయినా కనీసం చెప్పుకోదగ్గ సంఖ్యలో కూడా స్త్రీలు రాజకీయరంగంలో లేకపోవడం విచారించవలసిన విషయమే. ఫలానా రాష్ట్రానికి ఒక వనితే గవర్నరు అనో లేదా దేశ ప్రధాని వనితేగదా అని అనుకొని తృప్తిపడటంలో అర్థం లేదు. రాజకీయ రంగంలో పాల్గొనటం మాట అటుంచి అసలు మనదేశ స్త్రీలలో రాజకీయ పరిజ్ఞానము, రాజకీయ చైతన్యము రాజకీయ స్పృహ చాలా తక్కువనే విషయము గమనార్హము. చదువుకున్నవారు కూడా చాలామంది దినపత్రికా పఠనంలో రాజకీయాలకు ప్రాధాన్యమివ్వక ఏవో కాలక్షేపం వార్తలు, సినిమాలు మొదలైన వాణిజ్యపరమైన ప్రకటనలు చూసి పత్రికను మూసివేస్తారు. చదువుకున్న వారి సంగతే ఇట్లా ఉంటే ఇక చదువురాని వారి సంగతేమిటి? ఇకపోతే చాలామంది 'దేశంలో ఏం జరిగితే నాకేమిటి? ఒకవేళ తెలుసుకున్నా నేనొక్కదాన్ని చేయగలిగిందేమిటి?' అనే భావనలో ఉంటారు. ఇది చాలా తప్పు. ఎవరికి వారు ఇలా అనుకోబట్టే మనం వెనుకబడి ఉన్నాము. రాజకీయాలను క్షుణ్ణంగా అర్థం చేసుకున్నప్పుడేకదా సరియైన ప్రభుత్వాన్ని ఎన్నుకోడానికి గాని తద్వారా మంచి పాలన జరగటానికిగాని అవకాశ మేర్పడేది. అందులోనూ మనది ప్రజాస్వామ్య దేశము. అంటే మనది ప్రజల యొక్క, ప్రజల చేత, ప్రజల కొరకు నడపబడే ప్రభుత్వ యంత్రాంగమన్న మాట. దీన్నిబట్టే ప్రజాస్వామ్య ప్రభుత్వ నిర్వహణలో ప్రజల పాత్ర ఎంత విశిష్టమైనదో అర్థమవుతుంది. కాబట్టి మనం రాజకీయ రంగానికి ప్రాముఖ్యానిచ్చి, మన రాజకీయ హక్కులను సద్వినియోగపరచుకొని వీలయినంత వరకు రాజకీయాలలో పాల్గొనాలి. రాజకీయ చైతన్యము కలగడానికి విద్య ఎంతో అవసరం. అయితే చదువురాని స్త్రీలలో సైతము రాజకీయ చైతన్యము కల్గించినప్పుడే మనం అభివృద్ధి సాధించగలము. మహిళా మండలులు ఈ విషయంలో చొరవ తీసుకుని చదువురాని స్త్రీలకు కూడా ఈ విషయాన్ని సరిగ్గా బోధపరచి వాటి ఆవశ్యకత తెలియజేసి వారిని రాజకీయంగా చైతన్యవంతులుగా తీర్చి దిద్దాలి. మొత్తం మీద 'ఈ దేశం నాది. ఈ దేశంలోని అన్ని రంగాల అభివృద్ధిలో నా పాత్ర కూడా ఎంతో వుంది. రాజకీయ స్పృహ కల్గి ఉండటం నా కర్తవ్యం' అన్న భావన స్త్రీలలో కలగాలి. అప్పుడే భారతావనికిగాని, భారతీయ వనితకుగాని పురోగతి శీఘ్రతరమయ్యేది. అలాంటి రోజు త్వరలో వస్తుందని ఆశిద్దాం.

కె. శ్యామల హైద్రాబాదు

### పొరపాటు

వనిత మాటల కొలువు - 56 (ఫిబ్రవరి సంచిక)లో ఆధారాలు నిలువులోని '19. ఒక పక్షి విప్పుతుంది' అన్న ఆధారానికి గళ్ళలో వుండవలసిన 19 సంఖ్య పొరపాటున అచ్చు కాలేదు. ఆ సంఖ్య 8 అడ్డం వున్న గళ్ళలోని మూడో గడిలో వుండాలి. అక్కడ '19' అచ్చు కానందువల్ల, మాటల కొలువు సమాధానాల్లో దాన్ని తొలగిస్తున్నాము. పంపేవారు అక్కడ అక్షరం వేసి పంపకపోయినా, తెలుసుకుని పంపినా దాన్ని రైటుకిందనే పరిగణిస్తామని, పొరపాటుకు విచారిస్తూ-తెలియజేసుకుంటున్నాము. —వ. సం




ఇందిరాగాంధీ వికసిత వదనంతో ఉన్న ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది. 'ఈ ఎన్నికలలో వనితల విజయం' అన్న వ్యాసం ఈ పత్రికకే హైలైట్. 'న్యాయమే గెల్చింది' కథ అత్యద్భుతంగా ఉంది. 'శ్రీ కాళహస్తి' చాలావరకు అందరికి తెలిసిన పుణ్య క్షేత్రమైనా, కొన్ని తెలియని విషయాలు విపులంగా వివరించారు.

—కె. దుర్గాభవాని, మచిలీపట్టణము

ఫిబ్రవరి నెల వనితలో ప్రచురించిన విద్యార్థినుల సమస్యలు పెద్దలు చర్చ చాలా విజ్ఞాన వినోదాత్మకంగా ఉంది. ఈ చర్చలో పాల్గొన్న ప్రతి విద్యార్థినీ కూడా తమ, తమ అభిప్రాయాలను ఎంతో చక్కగా విశదీకరించారు. ఈ చర్చను ఎన్నికచేసి మంచి సారాంశాన్ని అందజేసిన మీకూ విన్నకోట సుశీలాదేవి గార్కి మా అభినందనలు.

—యం. పద్మావతి, సంపర

వనితా ప్రధాని ఇందిరాగాంధి ముఖచిత్రంగా వెలువడిన ఫిబ్రవరి సంచిక సింప్లీ సూపర్బ్. వనిత మాటల కొలువు-57లో నిలువులోని '19' గళ్ళలో ప్రింటు కాలేదు. మేమే వేసి పంపాము.

—డా॥ పద్మ రెడ్డి, కర్నూలు

[పొరపాటును ముందు పేజీలో దిద్దుకున్నాము.
—వ. సం.]

'మీ రచయిత్రితో మీరు' అన్న కొత్త శీర్షికను ప్రారంభిస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది.

—కందిగట్ల సావిత్రి, జనగామ

ఫిబ్రవరి నెల వంటల పోటీలో బొప్పాయి కోఫ్తా వంటకం ఏమీ బాగా లేదు.

—కోనాల మీనాక్షి, వెదురుపాకసావరం

మహా శివరాత్రి పర్వదిన సందర్భంగా బామ్మగారు తెలిపిన సంగ్రహ కథలు ఎన్నో విషయాలు తెలియజేసినవి. కాళహస్తీశ్వర క్షేత్ర మహాత్మ్యం కళ్ళకు కట్టినట్లు వర్ణించారు. సత్యవాడ సోదరీమణులు వ్రాసిన 'ఉగ్గు గిన్నె కథ' బాగానే ఉంది కానీ, వాస్తవానికి దూరంగా ఉంది. 'విద్యార్థినుల సమస్యలు-పెద్దలు' చర్చ బాగుంది.

—గుత్తికొండ సుధారాణి, వల్లమూడి అనసూయ, కొల్లూరు

పైలట్ మాలిని వ్యాసం చదివాక నిజంగా వనితలలో ఆమె చెప్పుకోదగ్గ వనిత అనిపించింది. ఈనెల చంద్రకాంతల ముగ్గు బహుమతి పొందిన ముగ్గులకన్నా బాగుంది. డా॥ సి. ఆనందారామంగారి 'న్యాయమే గెల్చింది' నేటి ఒక నటి జీవితానికి అద్దం పట్టినట్లు ఉంది. బామ్మగారి జవాబులు కొంచెం ఎక్కువగా ప్రచురించండి.

—వల్లభనేని బేబీ సరోజిని, పడాలి

క్రితంసారి ఒక సోదరి రవివర్మ తైలవర్ణ చిత్రం మత్స్యగంధి గురించి రాసారు - మగవారిని వుద్రేకపరిచేలా వుందని. మనమే అలా అంటే ఎలా? అది కళ. కేవలం మనం దానిని కళాదృష్టితోనే చూడాలి. చాలా నేచురల్‌గా వుంది. నేను ఫ్రేమ్ కట్టించాను కూడా!

—ఎస్. సత్యవతి, తణుకు

వనితలో తలనూనె ఇంకా అటువంటివి తయారు చేయటం గురించి రాస్తున్నారు. దయవుంచి ఒకసారి షండ్ల పొడి తయారు చేయటం గురించి తెలుపవలెను.

—ఎ. సత్యవతి, వినుకొండ

'ఇంట్లోకి రాకూడదు' అన్న వ్యాసాన్ని గురించి ఆళ్ళచెర్వు అన్నపూర్ణమ్మగారు రాసిన ఉత్తరం బాగున్నది. ఆరోగ్యరీత్యా వారు చెప్పినది నిజం. కాని ఇప్పుడు ఎవరూ పాటించటం లేదు.

—ఎస్. పార్వతిప్రసాద్, ఖమ్మం

'విద్యార్థినుల సమస్యలు – పెద్దలు' చాలా బావుంది. ఈ వ్యాసంవల్ల పెద్దలు, కొంతమంది అధ్యాపకులు విద్యార్థినుల సమస్యలను కొంతవరకు తెలుసుకొని, వాటిని పరిష్కరించడానికి గల మార్గాలు తెలుసుకోగలరు. 'అవసరమైతే కాన్పులు ఎలా నిర్వహించాలి?', 'పిల్లలు లేకపోవడానికి కొన్ని కారణాలు' అనే శీర్షికలు బావున్నాయి.

—యం. రుక్మిణిరెడ్డి, పుంగనూరు

పుట్టినరోజు శీర్షిక ఇంతటితో నిలిపివేస్తే బాగుంటుంది.

—కళ్యాణికుమార్‌బాబు, నిజామాబాద్

## వనిత మాటల కొలువు-55

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 ఊ | 13 ప | దే | 14 శ | 15 ము | | 2 వ | ల్వా |
| 3 మా | ని | | 4 ఏ | డి | | ని | |
| ప | | 16 వి | | | 5 ద్యో | త | 17 ము |
| 6 తి | 18 రు | గు | ద | 19 ల | | | ష్టి |
| | 7 అ | ము | | 8 హ | 20 స్తి | 21 ని | |
| 22 డి | | | 9 ర | రి | ఆ | వే | 23 ము |
| 10 గుం | ట | 24 న | క్క | | | 11 శ | ఖ |
| య | | 12 ము | సి | ప్వ | సి | ము | న |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారు ఇరవై ముగ్గురు. వారు :

1. కె. సరోజ, తణుకు 2. బి. రమా భుజంగరావు, శెట్టిపాలెం 3. వి. శ్రీమాతాగాంధి, భీమవరం 4. ఎమ్. హైమవతి, నందిగామ 5. వి. నళినీ జగదీష్, గుంటూరు 6. ఎం. మంగళ, గద్వాల్ 7. వి. పద్మ, భీమవరం 8. బి. లక్ష్మీరావు, దుర్గాపూర్ 9. బి. పద్మామోహన్, గూటీ 10. కె. జయలక్ష్మి, పెద్దకడబూరు 11. నాగపద్మ, అనంతపూర్ 12. జి. సుమిత్రాదేవి, కడప 13. యు. ఎస్. సుందరి, హైదరాబాదు 14. వి. కమలమ్మ, చాగలమర్రి 15. పి. విజయలక్ష్మి, విజయవాడ 16. జి. మోహనాంగి, టిట్లాఘర్ 17 పి. రాజరాజేశ్వరి, మంగళగిరి 18. వి. నిర్మల, మహేశ్ 19. సుహాసినీరావు, హైదరాబాదు 20. జి. లీలావతి, జంపని 21. డి. రమాదేవి, గోదూరు 22. ఎస్. విజయలక్ష్మి, మడమనూరు 23. ఎ. భారతీదేవి, తెనాలి

బహుమతి మొత్తం రూ 150 లను వీరికి సమానంగా పంచి అందజేస్తున్నాము.

# ప్రపంచం



జనవరి ఇరవైఒకటో తారీఖు నుంచి ఫిబ్రవరి ఎనిమిదో తారీఖువరకు డిల్లీలో 'యునిడో' తృతీయ మహాసభ సమావేశాలు జరిగాయి. నూటఇరవై అయిదు దేశాల నుంచి దాదాపు వెయ్యిమందికి పైగా ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొని తమ అభిప్రాయాలు తెలియజేశారు.

ప్రపంచ దేశాలను ఆర్థికంగా అభివృద్ధి చెందిన దేశాలు; అభివృద్ధి చెందుతున్న దేశాలు అని రెండు తరగతులుగా విభజించవచ్చు. 1960 సం॥ ప్రాంతాలలో ఈ రెండు తరగతుల దేశాల మధ్య పారిశ్రామికోత్పత్తి భేదాలు విపరీతంగా పెరిగిపోయాయి. అప్పుడే ఆ అగాధాన్ని తగ్గించడానికి కూడా ప్రయత్నాలు జరిగాయి. ఈ ప్రయత్నాల పర్యవసానంగానే 1967 సం॥ జనవరి ఒకటిన అంతర్జాతీయ పారిశ్రామిక అభివృద్ధి సంస్థ [యునైటెడ్ నేషన్స్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్] ఆవిర్భావం జరిగింది.

1975 సం॥ లిమాలోయునిడో ద్వితీయ సమావేశం జరిగింది. ఆ సమావేశంలో ఈ శతాబ్దాంతం లోపల ప్రపంచం మొత్తం మీద అయ్యే పారిశ్రామికోత్పత్తిలో కనీసం ఇరవైఅయిదు శాతం అభివృద్ధి చెందుతూన్న దేశాలలో జరగాలని ఒక తీర్మానం ప్రవేశపెట్టబడింది.

ఈ తీర్మానానికి అనుగుణంగా-యునిడో అనుబంధ సంస్థగా 1977 సం॥ ఇండస్ట్రియల్ అండ్ టెక్నలాజికల్ బ్యాంక్ ఏర్పడింది. సాంకేతిక పారిశ్రామికరంగాలలో అభివృద్ధి చెందిన దేశాల నుంచి పారిశ్రామిక వైజ్ఞానిక విషయాలను, సాంకేతిక పరికరాలను సేకరించి వర్థమాన దేశాలకు అందజేయడం బ్యాంక్ లక్ష్యం. ఈ బ్యాంక్ వివిధ దేశాల నుంచి నిధులను సేకరించి అభివృద్ధి చెందుతూన్న దేశాలకు అందజేస్తుంది.

ఇలా కొంత కృషి జరుగుతున్నప్పటికీ ఇవాళ వర్థమాన దేశాలు సాధించింది అందులో పదకొండు శాతం మాత్రమే. లిమా సమావేశ తీర్మాన లక్ష్యం అందుకోవాలంటే ఈ విషయంలో ఇంతకు రెండింతలు కృషి చేయాలి. అందుకు మొదట తగిన ఆర్థిక వనరులు కావాలి. అభివృద్ధి చెందుతూన్న దేశాలు ఎదుర్కొనే ప్రధమ సమస్య ఇది. ప్రత్యేక బ్యాంకులు ఆ దేశాలకు ఆర్థికసాయం చేయడానికి ముందుకు రావడం లేదు. అందువల్ల వర్ధమాన దేశాల పారిశ్రామికోత్పత్తికి ప్రత్యేక నిధులు ఏర్పాటు చెయ్యాలన్న ప్రతిపాదన తీసుకు రాబడింది. అయితే ఆర్థికంగా అభివృద్ధి చెందిన దేశాలు ఈ ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకించాయి. కొన్ని దేశాల అభివృద్ధికి మాత్రమే పరిమితమైన ఈ నిధి నిర్వహణకు చాలా ఖర్చవుతుంది. అందువల్ల ఇది అభిలషణీయం కాదు-అని ఆ ప్రతినిధులు వాదించారు. మండలాలవారీగా ఈ నిధి ఏర్పాటు చేసినట్లయితే ఆయా మండల దేశాల మధ్య ఆర్థిక, వాణిజ్య సంబంధాలు పెంపొందగలవని భారత దేశం సూచించింది.

ఒకవేళ ఆర్థిక నిధులను సమకూర్చుకుని పారిశ్రామికోత్పత్తిని పెంచినప్పటికీ-ఈ దేశాలలో తయారయ్యే వస్తుసామగ్రిని అంతర్జాతీయ వాణిజ్య రంగంలో సంపన్న దేశాలు కొనుగోలుకు సుముఖంగా వుండాలి. అయితే అభివృద్ధి చెందిన దేశాలన్నీ ఇవాళ తమ పారిశ్రామిక భద్రతకు అనుకూలమైన వాణిజ్య విధానాలనే అనుసరిస్తున్నాయి. అందువల్ల అనుదిన అంతర్జాతీయ వాణిజ్య రంగంలో వర్ధమాన దేశాలకు రకరకాల ఇబ్బందులు ఎదురవుతున్నాయి. ఇలాంటి చిక్కులను అధిగమిస్తేనే వర్ధమాన దేశాలు పారిశ్రామికరంగంలో ముందడుగు వేయగల్గుతాయి. అప్పుడే ఆర్థిక ప్రగతి సాధ్యమవుతుంది.

ఈ సంవత్సరం ఆఖర్లో జరగనున్న ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ సమావేశం - ప్రపంచ వ్యాప్తమైన పారిశ్రామిక ప్రణాళిక రూపొందించనున్నది. ఆ ప్రణాళికరూపం తీర్చిదిద్దడానికి ఢిల్లీ యునిడో తృతీయ సమావేశ ఆలోచనలు ఉపయోగకరంగా వుండగలవని ఆశించవచ్చు.

*

ఆఫ్ఘనిస్థాన్‌లో అగ్రరాజ్యాల సైనికజోక్యం వల్ల అంతర్జాతీయ రాజకీయరంగంలో ఆశ్చర్యకరమైన పరిణామాలు ఏర్పడుతున్నాయి. ఆఫ్ఘన్‌లో జోక్యం చేసుకున్న రష్యా మీద చైనా ప్రతీకార చర్యలు తీసుకుంటుందని పీకింగ్‌లోని పాశ్చాత్య వర్గాలు తెలియజేశాయి. రష్యాపై ప్రతీకార చర్యగా పెద్ద కమ్యూనిస్టు దేశమైన చైనా మరో కమ్యూనిస్టు దేశమైన రష్యాతో కత్తిగట్టి అమెరికాతో చేతులు కలుపుతోంది. అమెరికా రక్షణమంత్రి హెరాల్డ్ బ్రౌన్ ఇటీవల చైనా పర్యటన చేశారు. మరుసటి వారమే చైనా విదేశాంగమంత్రి హువాంగ్‌హువా పాకిస్థాన్ పర్యటన జరిపి ఆయుధాల సరఫరా విషయంలో మంతనాలు జరిపివచ్చారు.

కొంతకాలం క్రితమే అణ్వస్త్రాల నిర్మాణానికి పాకిస్థాన్ ప్రయత్నిస్తోందన్న వార్తలు వెలువడ్డాయి. నిప్పుకు గాలి తోడయినట్టు ప్రస్తుతం - అమెరికా చైనాలు పోటీపడి ఆయుధాలు సరఫరా చేస్తున్నాయి. భారత ఉపఖండంలో మరింత ఆందోళన కల్గించే విషయం ఇది. ఈ విషయం మీద భారతదేశం చైనాకు తీవ్రమైన నిరసన తెలియజేసింది కూడా.

ఇటీవల ఇండియా - ఫ్రాన్స్ దేశాల మధ్య జరిగిన చర్చలలో ఆఫ్ఘనిస్థాన్ పరిణామాలు కూడా చోటు చేసుకున్నాయి. చర్చల అనంతరం ఉభయ దేశాలు సంయుక్తంగా వెలువరించిన ప్రకటనలో-ఆయుధాల సేకరణను, ఒక దేశం నుంచి మరో దేశానికి ఆయుధాల సరఫరాను ఖండించాయి.

ఆసియాఖండంలో మన దేశం లాగా ఐరోపా అగ్రరాజ్యాలలో ఫ్రాన్స్ ఒకటి. అది పెట్టుబడిదారీ రాజ్యమే అయినా అమెరికా, రష్యా దేశాల రెంటి మీదా కొంత పలుకుబడిగల దేశం. అంతర్జాతీయ రంగంలో కీలకపాత్ర వహించే-ఇండియా - ఫ్రాన్స్ దేశాల సాన్నిహిత్యం - ప్రపంచశాంతి పరిరక్షణలో ప్రముఖపాత్ర వహించగలదని రాజకీయ పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. □



# వంగ వధువు

ముఖచిత్రం:

ముచ్చటగా అలంకరించుకుని ముఖ పత్రం మీద దర్శనం ఇస్తున్నది – వంగ వధువు. వంగ రాష్ట్రీయులు కూడా, తక్కిన రాష్ట్రీయుల్లాగే, వివాహాలకు ప్రాముఖ్యత ఇస్తారు. ప్రతి వారి జీవితంలోనూ వివాహం, విడివడని జీవితబంధం గనక, దానికా ప్రాధాన్యత ఎప్పుడూ వుంటుంది.



చాలా వివాహాలు అక్కడ కూడా పెద్దవాళ్ళు ఏర్పాటు చేసినవే! ప్రేమ వివాహాలు కూడా బాగానే జరుగుతూ వుంటాయి. పెద్దవాళ్ళు ఏర్పాటు చేసిన వివాహాలు అంటే, సంప్రదాయ ప్రకారం, ఆచార



వ్యవహారాల ప్రకారం–జరిగే వివాహాలు. మనలాగే అక్కడ కూడా పెళ్ళిళ్ల పేరయ్యలుంటారు. వాళ్లే సంబంధాల గురించి అక్కడా ఇక్కడా చెబుతూ వివాహాలు నిర్ణయింపజేస్తారు.

ఒక విశేషం వుంది! తక్కిన ప్రాంతాల్లో విజృంభణలో వుండి, వీరవిహారం చేస్తున్నట్టుగా, 'కట్నపిశాచి' అక్కడ అంతగా దమన నాట్యం చెయ్యడం లేదు! తొలి నుంచి కూడా అక్కడ కట్నాల సమస్యలు పెద్దగా లేవు. అయితే, రాను రాను తక్కిన వాళ్ళను చూసి, అక్కడా కొంత కట్నం ప్రసక్తి బయల్దేరింది. కట్నం పేరుతో "ఇంత" ఇవ్వాలన్న నిబంధన లేకపోయినా, వస్తురూపంలో, స్వర్ణరూపంలో వారికి వీరూ, వీరికి వారూ ఇచ్చి పుచ్చుకోడాలు మాత్రం వున్నాయి. అయితే, వీటికీ నిబంధనలు లేవు. అంతా ఐచ్ఛికమే.

వివాహం చెయ్యడానికి పెద్దలు నిశ్చయించుకున్న తర్వాత, నిశ్చితార్థం వంటిది, అక్కడా జరుగుతుంది. రెండు పక్షాలవారూ కానుకలూ అవీ ఇచ్చుకొని, వివాహానికి తేదీ నిర్ణయం చేసుకుంటారు. ఈ తతంగంలో పండితుల ఆదేశం ప్రకారం స్త్రీలు "ఉలు ధ్వని" చేస్తారు. అంటే, నాలుకను ఆడిస్తూ ఒక రకమైన ధ్వనిని పుట్టించి, అందరూ ఏక కంఠంతో ఆ ధ్వనిని అనుకరిస్తారు. ఈ ధ్వనితోపాటే, 'శంఖనాదం' కూడా చేస్తారు. శంఖనాదానికి బెంగాలీ వారి వివాహాల్లో ముఖ్యమైన స్థానం వుంది. (ముఖచిత్రం మీద వధువుకు వెనకగా శంఖనాదం చేసే స్త్రీని కనిపింప చెయ్యడం–అందుకే)

పెళ్ళినాడు–తెల్లవారు ఝామునే తంతు ఆరంభమవుతుంది. తొలి కార్యక్రమం పేరు – 'దధి మంగళ్'. వధూవరులిద్దరికీ, వారి వారి ఇళ్ళలో తీపి వంటకాలు, పెరుగూ, కొత్త బట్టలూ ఇస్తారు. వధూవరులు ఈ మిఠాయిలు అవీ తిన్న తర్వాత, వివాహం అయేంతవరకూ ఉపవాసం వుండాలి.

ఈ తతంగం అయిపోయిన తర్వాత, వధువును 'శీతల్ పాతి' (ఒక ప్రత్యేకమైన చాప) మీద కూర్చోబెడతారు. తర్వాత 'మంగళ్‌ఘట్' అన్న కార్యక్రమం ఆరంభమవుతుంది. ముత్తైదువలందరూ కలిసి, పిల్లలతో దగ్గర్లో వున్న నదికో, చెరువుకో వెళ్తారు. బిందెలకి అలంకారాలు చేసి, ఊదువత్తులు దీపాలూ వెలిగించి, పళ్లాలలో పెట్టుకొని బయల్దేరి, 'గంగ పూజ' చేసి, వచ్చేటప్పుడు బిందెలతో నీళ్ళు తెస్తారు.

వంగ దేశీయుల్లో ప్రతి పండగకీ విధిగా–కీర్తిశేషులైన తమ పెద్దలకు పూజలు చేస్తారు. ఆ విధానం వివాహ కార్యంలోనూ ప్రముఖంగా

కనిపిస్తుంది. వివాహంలో జరిగే ఈ తంతుకు 'నందీముఖ్' అంటారు.

నందీముఖ్ అయిపోయిన తర్వాత, వధూవరులకు ఆవనూనె, పసుపూ కలిపి నలుగుపెట్టించి, శిరః స్నానాలు చేయిస్తారు. ఈ సందర్భంలో పెద్ద చేప, మిఠాయి, పెరుగు, తమలపాకులూ వక్కలూ ఒకరికి ఒకరు ఇచ్చుకుంటారు. ఈలోగా మంట పాలంకరణలూ, అతిథులకు భోజనాలూ జరుగుతాయి.

కల్యాణమంటపంలో ఎక్కడో ఒక చోట ప్రముఖంగా కనిపించేలా, సీతకోక చిలుక చిత్రాన్నో, బొమ్మనో పెడతారు. వారి వైవాహిక జీవితం కలకాలం సుఖంగా, శాంతియుతంగా సాగాలని వాంఛించడానికి 'సీతాకోక చిలుక' ఒక సంకేతం.

సాయంకాలం వధూవరులిద్దర్నీ పట్టువస్త్రాలతో అలంకరిస్తారు. వధువు తరఫున బాధ్యతగల వారెవరైనా మరి కొంతమంది పెద్దలతో వరుడింటికి వెళ్లి,





అతన్ని ఆహ్వానిస్తారు. వధువు తరఫున పెళ్లి పెద్ద — 'ఉలుధ్వని' 'శంఖనాదం' జరుగుతూ వుండగా, వరుణ్ణి తీసుకు వస్తారు. ఇంటికొచ్చాక, వధువు తల్లి 'వరాసన్' దగ్గరకు తీసుకెళ్ళి కూర్చోబెడుతుంది. ముహూర్త సమయానికి ముందు వధువు తండ్రి, వరుని పీఠం దగ్గరకు తీసుకు రావలసిందిగా, వరుని తండ్రిని కోరతాడు. వంగ దేశీయులు కూడా కళ్యాణమంటపాన్ని బాగా అలంకరిస్తారు. పైన షామియానా వేస్తారు. అరటి చెట్లు అటూ ఇటూ కడతారు. ముగ్గులు వేస్తారు. మామిడి తోరణాలు కడతారు. దీపాలు వెలిగిస్తారు.

వరుడు పెళ్ళి పీట మీద కూర్చున్న తర్వాత, మంత్రాలు చదవడం ఆరంభిస్తారు. వధువు తండ్రి ఇచ్చిన వస్త్రాలు ధరించవలసిందని, వరుణ్ణి కోరతారు. ఈ ఘట్టం చాలా తమాషాగా వుంటుంది. ఈ కార్యక్రమాన్ని నవ్వులతోనూ, సరదాగానూ మంగలి నిర్వహిస్తాడు. కొత్త బట్టలు కట్టుకున్న తర్వాత, వరుడు మళ్ళీ పీటలమీద కూచుంటాడు; కళ్లకి తమలపాకులు గంతల్లాగా కట్టుకుని వున్న వధువును ముత్తైదువులు పీట మీద కూచోపెట్టి తీసుకొస్తారు. ఏడుసార్లు వరుడి చుట్టూ ప్రదక్షిణం చేయిస్తారు. దీన్నే 'సాత్ పాకె బాంధా' అంటారు. మన వివాహాల్లోలాగే, వారు కూడా వధూవరులిద్దరి మధ్య తెర కడతారు. శుభ ఘడియ రాగానే తెర తొలగించి, ఒకర్నొకరు చూసుకునేలా చేస్తారు. తర్వాత మూడుసార్లు మాలలు వేసుకుంటారు. అప్పుడే కన్యాదాత, వధువు చేతిని తీసుకుని, వరుడికి వప్పగిస్తాడు. ఈ తంతు అయిపోయిన తర్వాత, వధువు తన పేరుతో వున్న తండ్రికి చెందిన నామాన్ని (మన ఇంటిపేరు లాంటిది) వదిలిపెట్టి, భర్తకి చెందిన పేరును తన పేరుతో కలుపుకుంటుంది.

పెళ్లి తర్వాత మనకున్న 'బంతులాట' లాంటి ఆటల్లాంటివి వాళ్ళకీ వున్నాయి. ముత్తైదువులందరూ చుట్టూ కూచుని, వధూవరులిద్దర్ని నవ్విస్తూ కవ్విస్తూ ఆటలు ఆడింపజేస్తారు.

తర్వాత వాళ్ళిద్దర్నీ 'వాసేర్ ఘర్'కు తీసుకెళ్తారు. ఆ గదిలో ఆ రాత్రి వధువు తెల్లవార్లూ జాగారం చేస్తూ గడపాలి!

ఉదయం మళ్లీ తంతు ఆరంభం అవుతుంది. ఇది అయిన తర్వాత, వధూవరులిద్దరూ పెద్ద వాళ్లందరికీ మొక్కి, వాళ్ల ఆశీర్వచనాలు పొందుతారు. విందు భోజనాల తర్వాత 'అప్పగింతలు' జరుగుతాయి. వధువు తన తలిదండ్రుల్నీ, తోడబుట్టిన వాళ్ళనీ వదిలిపెట్టి అత్తింటికి పోతున్నందుకు కళ్ళ నీళ్ళు పెట్టుకుంటుంది. వధువు దగ్గర బంధువులూ అలాగే కళ్ళనీళ్ళు పెట్టుకొని, ఆమెను సాగనంపుతారు!

అత్తవారిల్లు చేరగానే, వాకిట్లోనే అత్తగారు వధువుకు ఎదురొచ్చి, నగలూ అవీ ఇచ్చి కోడల్ని ఆహ్వానిస్తుంది. ఆ రాత్రి కూడా వధూవరులిద్దరూ వేర్వేరుగానే శయనిస్తారు. దీన్ని తక్కిన వాళ్ళందరూ 'కాళరాత్రి' వ్యాఖ్యానిస్తారు.

మర్నాడు ఉదయం వరుడి ఇంట కార్యక్రమం ఆరంభం అవుతుంది. వరుడి బంధువులూ, స్నేహితులూ అందరూ వచ్చి, వాళ్ళని ఆశీర్వదిస్తారు. అందరూ ఆనందంగా, విందు భోజనాలు ఆరగిస్తారు. తొలిసారిగా - వధువు 'ఇంటి కోడలు'గా కొంతమంది పెద్దలకు తానే వడ్డన చేస్తుంది.

ఆ రాత్రి - వధూవరులిద్దరూ సుమనోహరమైన 'ఫూల్ సజ్జ' మీద ఏక శయ్యాగతులవుతారు!

# పుట్టిన రోజులు

ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో- ఏడాది పిల్లల గ్రూపులో బి. హెచ్. వి. కాశ్యప్; రెండేళ్ల పిల్లల గ్రూపులో జె. ఆర్. గిరీష్ 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. ఈసారి మూడవ గ్రూపులో ఏమాత్రం సంతృప్తికరమైన ఫొటోలు రానందున ఏడాది, రెండేళ్ళ వారిని మాత్రం ఎన్నికచేయడం జరిగింది. మొత్తం అన్ని గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపించే మరో ముగ్గుర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. ఏప్రిల్ సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు - వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు గల కవరు జతపరచాలి.) మార్చి 7వ తేదీ లోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



జె. ఆర్. గిరీష్ (చింతామణి) పుట్టిన తేదీ: 22-3-78 తల్లి పేరు: జె. పరిమళ



బి. హెచ్. వి. కాశ్యప్ (గుణదల) పుట్టిన తేదీ: 13-3-79 తల్లి పేరు: బి. హెచ్. వి. యశోధర

పి. సిద్దార్థ (మద్రాసు) పుట్టిన తేదీ: 28-3-79 తల్లి పేరు: పి. సావిత్రి



కె. విక్రాంత్ (హైద్రాబాదు) పుట్టిన తేదీ 6-3-79 తల్లి పేరు: వై. బాలాంబ



సి. శ్రీలక్ష్మిరేఖ (మద్రాసు) పుట్టిన తేదీ: 9-3-79 తల్లి పేరు: సి. గీత



# గీతోపదేశం



మదురా కోట్స్‌వారు ఇటీవల అఖిల భారత ఏంకర్ హాండ్ ఎంబ్రాయిడరీ పోటీలను నిర్వహించారు. ఆ పోటీలలో ఫ్రీహాండ్ స్టిచ్, క్రాస్ స్టిచ్ విభాగాలలో కలిపి మొత్తం పదివేలమంది పాల్గొన్నారు. అందులో గెలుపొందిన అల్లికలతో మద్రాసులో మదురా కోట్స్‌వారు జనవరి 25 నుంచి 27 వరకూ ఒక ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఈ పోటీలో క్రాస్ స్టిచ్ విభాగంలో (పక్క పేజీలో వర్ణచిత్రం) 'గీతోపదేశం'కు ప్రథమ బహుమతి రూ. 10,000 లు లభించింది. ఈ అల్లిక చిత్రాన్ని రూపొందించి ప్రథమ బహుమతి గెల్చుకున్న వనిత–శ్రీమతి అల్లాడి రోహిణి. ఆమె పరిచయ వ్యాసాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాము

అసంఖ్యాకమైన తన బంధు బలగాన్ని యుద్ధ భూమిలో చూసిన అర్జునుడికి, వారితో పోరు సలపాలనేసరికి విరక్తి కలిగిన సన్నివేశం అది. అప్పుడు రథసారథి అయిన శ్రీకృష్ణుడు అర్జునుడికి గీతోపదేశం చేస్తున్న రమ్యమైన దృశ్యం అది.

ఆ మహత్తర దృశ్యాన్ని కన్నులకు కట్టినట్లుగా క్రాస్‌స్టిచ్ విధానంలో కాన్వాస్ మీద అల్లారు–శ్రీమతి అల్లాడి రోహిణి వెంకటనారాయణ. ఆ చిత్రాన్ని దూరం నుంచి చూసినవారు అది తైలవర్ణ చిత్రమనే భ్రమపడతారు. ముట్టుకుని చూస్తేగానీ అది దారాలతో కుట్టిందని తెలియనంత అద్భుతంగా వుందా వనితనం.

మదురా కోట్స్-ఏంకర్ వారు నిర్వహించిన పోటీలలో ప్రథమ బహుమతి (క్రాస్‌స్టిచ్) పొందిన అల్లిక చిత్రం అది. ఆ పోటీలలో ఫ్రీహాండ్, క్రాస్‌స్టిచ్ విభాగాలలో మొత్తం పదివేల మంది పాల్గొన్నారు. అందులో వివిధ బహుమతులు గెల్చుకున్న రెండు వందల చిత్రాలను మద్రాసులోని అవ్వై షణ్ముగం కలై అరంగంలో ప్రదర్శించారు. మదురా కోట్స్ నిర్వహించిన పోటీలలో శ్రీమతి రోహిణి పాల్గొనడం ఇదే ప్రథమం. ప్రథమ ప్రయత్నంలోనే ప్రథమ బహుమతి పొందడమన్నది చెప్పుకోదగ్గ విశేషమే!

శ్రీమతి రోహిణి నెల్లూరులో జన్మించారు. అక్కడే ఆమె విద్యాభ్యాసం కూడా జరిగింది. వివాహమయ్యాక మద్రాసులో స్థిరపడ్డారు. ఆమె భర్త శ్రీ అల్లాడి వెంకటనారాయణ వృత్తిరీత్యా న్యాయవాది అయినా, చిత్రకళపట్ల ఆసక్తిగలవారు. ఆయన ఫాబ్రిక్ పెయింట్ చేయడంలో సిద్ధహస్తులు. వారి కుమార్తె శ్రీమతి విమలా శ్రీరాం మోడి త్రెడ్ వారు నిర్వహించిన అల్లికల పోటీలో రెండవ బహుమతి పొందారు. ఆ పోటీలలోనే శ్రీమతి రోహిణి కూడా రెండు బహుమతులు పొందడం మరొక విశేషం!

శ్రీమతి రోహిణికి తన పదిహేనవ ఏట నుంచే కుట్లు, అల్లికలపట్ల ఉత్సాహం ఏర్పడింది. "ఇరవై ఐదేళ్ళుగా ఈ పని చేస్తున్నాను. ఇప్పుడు నేను చేసిన పనికి గుర్తింపు లభించింది" అన్నారామె. '72-73లో స్థానిక బాలాజీ ఫైన్ ఆర్ట్స్ నిర్వహించిన పోటీలలో ఆమె అల్లిన 'లాండ్‌స్కేప్' చిత్రానికి ప్రథమ బహుమతి లభించింది. ఆ చిత్రాన్ని ఆమె పదిహేను రోజులలో పూర్తి చేశారు. అదే ఆమె పొందిన మొట్టమొదటి బహుమతి!

"ఈ గీతోపదేశం చిత్రాన్ని పూర్తి చేయడానికి నాకు నలభై రోజులు పట్టింది. రోజుకు ఎనిమిది గంటలు కృషి చేశాను. మొదట 40 × 60 సెంటిమీటర్ల కొలతతో గీతోపదేశం దృశ్యాన్ని అందంగా స్కెచ్ గీసుకున్నాను. చిత్రాన్ని నా ఊహతో అందంగా తీర్చిదిద్ది ఎక్కడెక్కడ ఏ రంగు దారం ఉపయోగించాలో ముందుగానే నిర్ణయించుకుని ఒక ప్రణాళిక రూపొందించుకున్నాను. సహజ సిద్ధమైన ప్రకృతి వర్ణాలు రావాలన్న లక్ష్యంతో – రథ చక్రాలు, మేఘ సమూహాలు, జెండాపై కపిరాజు, క్రిందపడే నీడ మొదలైన వాటికి నా ఊహాశక్తితో నలభై నాలుగు ఏంకర్ వారి రంగుదారాలు ఉపయోగించాను.

ఇక భగవద్గీతలోని అంశాన్నే ఎంచుకోవడానికి గల కారణం—మా నాన్నగారు కీ. శే. మామిడిపూడి రామకృష్ణయ్యగారు వాల్మీకి రామాయణం, శ్రీమద్భగవద్గీత తెనిగించారు. ఆయనకి భగవద్గీత అన్నా, రామాయణమన్నా ఎంతో ఇష్టం. ఆ ప్రభావం నా మీద పడింది. నేను చిన్నప్పటి నుంచీ కృష్ణుడు అర్జునుడికి గీతోపదేశం చేసిన దృశ్యం ఊహించుకుంటూ వుండేదాన్ని. ఆ ఆలోచనలు నాలో చిరకాలంగా వుండడంవల్ల ఈ చిత్రాన్ని తయారు చేశాను. అప్పటి ఆలోచనలు ఇప్పుడు సహకరించాయి కూడా" అన్నారు శ్రీమతి రోహిణి.

ఆమెకు ఎంబ్రాయిడరీలోనే కాక ఫాబ్రిక్ పెయింట్ చేయడంలోనూ, గృహాలంకరణలోనూ కూడా ప్రవేశముంది. చీరల మీద అందంగా పూసలు కుట్టడంలో ఆమెది అందెవేసిన చేయి.

వంటపని హోమ్ వర్క్‌గానూ, కుట్టుపని క్లాస్ వర్క్‌గానూ భావించే శ్రీమతి రోహిణి ఇంత వరకూ 22 అల్లిక చిత్రాలను రూపొందించారు. మరో నాలుగైదు నెలల్లో 30 చిత్రాలు పూర్తి చేసి ఒక ప్రదర్శన ఏర్పాటు చేయాలనుకుంటున్నారు.

"మన పురాణ గాథలలోని ప్రముఖ ఘట్టాలను క్రాస్ స్టిచ్ విధానంలో ఎంబ్రాయిడరీ చేసి ఒక ప్రదర్శన ఏర్పాటు చేయాలన్నది నా జీవిత ధ్యేయం" అని చెప్పారు శ్రీమతి రోహిణి. □

# ఉగాది పర్వ ప్రాశస్త్యము

"ఉడు" అనగా నక్షత్రము. "గమనం" అనగా నడక అని అర్థము. "ఉడు" పదములోని 'ఉ' అక్షరము, "గమనం" పదములోని 'గ' అక్షరమును గ్రహింపగా "ఉగ" అయినదని భావించబడుచున్నది. 'ఉగ' అనగా 'నక్షత్రపు నడక.' నక్షత్రాలగమనం ఆరంభమైన-అనగా సృష్టి ఆరంభమైన కాలము యొక్క 'ఆది' 'ఉగాది' అయినది. ఈ విధముగా 'ఉగాది' పర్వనామధేయానికి సార్థకత చేకూరినది.

ఉగాది పండుగకు సంబంధించిన పురాణ గాథలు కొన్ని కానవచ్చుచున్నవి. వీనివలన ఈ ఉగాది పర్వ ప్రాశస్త్యం సుబోధకం కాగలదు.

## మత్స్యావతార గాథ

దుష్టశిక్షణార్థం, శిష్టరక్షణార్థం దశావతారముల నెత్తిన శ్రీ మహావిష్ణువు, వేదములను దొంగిలించిన సోమకుడను రాక్షసుని బారినుండి వేదములను తెచ్చి బ్రహ్మదేవున కప్పగించుటకై మత్స్యాకృతి ధరించిన గాథ ఎల్లరకూ విదితమే. చైత్ర శుద్ధ పాడ్యమినాడే విష్ణువు ఈ మత్స్యావతారధారి యయ్యెనని పురాణ విదితము. శ్రీ మహావిష్ణువు స్మృత్యర్థం చైత్ర శుద్ధ పాడ్యమినాడే యుగాది పర్వం జరుపబడుట ఆచారమయ్యెనని భావించబడుచున్నది. ఈ మత్స్యావతార గాథ వలన ఉగాదిపర్వానికి ఐహిక, ఆముష్మిక ప్రాధాన్యత కూడా జోడించబడినది.

## బ్రహ్మసృష్టి కథ

'చతుర్వర్గచింతామణి' యను వ్రతఖండములో ఉగాది పుట్టుకకు ఆధారమైన బ్రహ్మసృష్టి గాథ వివరించబడినది :

చైత్రే మాసి జగద్బ్రహ్మ ససర్జ ప్రథమే హని
శుక్లపక్షే సమగ్రంతు తదా సూర్యోదయేసతి.

సృష్టికర్త చతుర్ముఖ బ్రహ్మ చైత్ర శుద్ధ పాడ్యమినాటి అరుణోదయవేళ జగత్తును సమగ్రంగా సృజించెను. జగత్తు కాలక్రమేణా నాలుగు యుగాలుగా విభజించబడినది. అవి కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు. మనం ఇప్పుడు కలియుగంలో ఉంటున్నాము. కలియుగం చైత్ర శుద్ధ పాడ్యమినాడే ఆరంభమైనదనుటకు నిదర్శనములనేకములున్నందున కలియుగానికి ఆది (యుగాది) చైత్ర శుద్ధ పాడ్యమి కనుక ఆ రోజు మనకు పర్వదినముగా నెన్నదగినదని ఊహించబడుచున్నది.

## ఇంద్రధ్వజ గాథ

పూర్వము వసురాజు అనే పురువంశానికి చెందిన రాజు ఒకసారి వేటకోసం అడవికి వెళ్ళి ప్రకృతి శోభలో దైవత్వాన్ని సందర్శించి ఒక చోట ఆసీనుడై ధ్యాననిమగ్నుడయ్యెనట. దేవతల రాజయిన దేవేంద్రుడు అతనికి సాక్షాత్కరించి, అతని తపోనిష్ఠకు సంతుష్టుడై గగన సంచారానికుపకరించు ఒక విమానమును, ఎన్నటికీ వాడని ఒక కుసుమహారమును బహూకరించెనట. ఆ సుందర విమానము, పూలహారముల మూలమున యుద్ధములలో విజేయుడవు కాగలవని దేవేంద్రుడు వసురాజుకు తెలిపి అంతర్ధానమయ్యెనట. ఆ అపూర్వ వస్తువులతో వసురాజు చైత్ర శుద్ధ పాడ్యమినాడు తిరిగి తన నగరప్రవేశం గావించెనట. తమ ప్రభువునకింతటి అసామాన్య వస్తువులు లభించినందులకు పురప్రజలు ఆనందంతో, కృతజ్ఞతా సూచకంగా ఇంద్రుని గూర్చి పెద్ద ఉత్సవాలు జరిపిరట. నాటినుండి యేటేటా చైత్ర శుద్ధ పాడ్యమికి పండుగ జరుపుకొనుట, ఇంద్రధ్వజపూజ, ధ్వజారోహణము వాడుకలోనికివచ్చినదని - ఒక ఐతిహ్యముగలదు. నేటికినీ ఈ ధ్వజారోహణ ఆచారం మహారాష్ట్ర, కర్ణాటకలలో విరివిగానూ, మన ఆంధ్రులలో కొన్ని ప్రాంతాలలోనూ ఆచారముగా నిర్వర్తించబడుచున్నది.

## విక్రమార్కుని గాథ

నర్మదా, కావేరీనది మధ్యస్థ ప్రాంతమంతటినీ సామ్రాజ్యంగా పాలించి, శకులనోడించి శకారి బిరుదాంకితుడైన యోధాగ్రణి చక్రవర్తి విక్రమార్కుడు పట్టాభిషిక్తుడైన శుభదినం చైత్ర శుక్ల పాడ్యమి. ఆనాడే విక్రమార్కశకం ఆరంభమైనది. ఈ మహనీయుని తేజఃస్మరణార్థం ఘనంగా యేటేటా ఉత్సవాలు జరిగేవి. అదే 'ఉగాది' యని కొందరు చరిత్రకారుల భావన. విక్రమార్క పట్టాభిషేకమనేది చారిత్రాత్మక విషయం. దీనికి ప్రతివాదమేదియు లేదు. అయితే ఇది ధర్మశాస్త్రాలకు సంబంధించినదిగాదు.

## రామాయణ గాథ

రామాయణమున చైత్రము పన్నెండవ మాసముగా పరిగణించబడియున్నది. శ్రీరాముడు చైత్ర శుద్ధ నవమినాడు జన్మించినట్లు బాలకాండలో లిఖించబడి యున్నది. అనగా రామాయణ కాలమానము ప్రకారము వైశాఖమాస ప్రారంభమందు జన్మించినాడని తెలియుచున్నది. దీనిని బట్టి వైశాఖమాసారంభమే రామాయణ కాలమున యుగాదిగా ఆచరించబడుచుండినదని తెలియుచున్నది.

## ఉగాది కార్యక్రమ విధానము

ఉగాదినాటి కార్యక్రమ విధానమును "ధర్మసింధుకారుడు" ఈ విధంగా తెలిపియున్నాడు :

'తైలాభ్యంగనం, సంకల్పాదౌనూతనవత్సర
నామకీర్తనాద్యారంభం...
ప్రతి గృహం, ధ్వజారోహణం, నింబపత్రా
శనం, వత్సరాదిఫలశ్రవణం...'

ఉగాదినాటి ఉషోదయం తైలాభ్యంగనం, నూతన సంవత్సరాది దేవతస్తోత్రం, ధ్వజారోహణం, నింబకుసుమభక్షణం, పంచాంగ శ్రవణం మున్నగు పంచకృత్యాలు విధిగా నిర్వర్తించవలెననిభావం.

నేడు మనం 'సిద్ధార్థి'నామ సంవత్సరానికి వీడ్కోలు చెప్పి "రౌద్రి"నామ సంవత్సరానికి స్వాగతం పలుకుతున్నాం. ఈ నవీనవత్సరం తనలో ఏఏ విశేషాలని ఇముడ్చుకొని వచ్చిందో, మరి ఏ సంభ్రమాశ్చర్యాలను నింపుకొని వచ్చిందో వేచియుండి చూడవలసిందే!

"లోకాస్సమస్తా సుఖినోభవంతు" □

—జి. లక్ష్మీకాంతం



# ఉగాది ఆచారాల్లో ఆరోగ్య రహస్యాలు

హైందవుల పండుగల్లో ముఖ్యమైనది ఉగాది పండుగ. ఇది తొలిపర్వం కూడా. 'యుగాది' అన్న పదం నుండి 'ఉగాది' వచ్చిందని చెబుతారు. సంవత్సరానికి తొలి రోజు గనక 'సంవత్సరాది' అని కూడా 'ఉగాది' పిలువబడుతున్నది.

చైత్రశుద్ధ పాడ్యమి రోజున వసంతలక్ష్మితో చెట్టాపట్టా లేసుకుని వస్తుంది మన ఉగాది పండుగ. చైత్రమాసాన్ని మధుమాసమని కూడా అంటారు. ఆ మధుర రస ప్రభావం వల్లనేమో వృక్షలతాదులన్నీ చిగిర్చి పుష్పిస్తాయి. సృష్టి అంతటా ఏదో క్రొత్తదనం గోచరిస్తుంది.

ఈ క్రొత్తదనాన్ని సాదరంగా ఆహ్వానిస్తామీ రోజున. పాతదనానికీ, గతానికీ వీడ్కోలు చెప్పి క్రొత్త సంవత్సరమంతా శుభప్రదం కావాలని కోరుకుంటాము. అలా అందరి జీవితాల కాలమూ శుభప్రదంగావడానికే మన పూర్వులు ఎన్నో సదాచారాలను ఏర్పరచారు. అవి శుష్క సంప్రదాయాలు కావు. తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉంటే ఆ ఆచారాల్లో ఉన్న ప్రయోజనకర అంశాలూ, అర్థాలూ ఎన్నింటినో మనం గమనించగలం.

సంవత్సరాదికి గోడలకు వెల్ల వేయించడం, శ్రద్ధాసక్తుల్తో గృహాలనూ, గృహాంగణాలనూ పరిశుభ్రపరచి ఆవు పేడతో కళ్ళాపు జల్లి ముగ్గులు పెట్టడం....ఇవన్నీ ఆరోగ్యరీత్యా అవసరమైనవే నని మనకు తెలుసు.

కాగా – పండుగనాడు ప్రాతఃకాలాన్నే అభ్యంగస్నానం చేయడం తప్పనిసరికదా! ఒక్క ఈ అభ్యంగ స్నానంలోనే ఎన్నో ఆరోగ్య విలువలు గోచరిస్తాయి.

అభ్యంగ స్నానం దేహ దుర్గంధాన్నీ, మలినాలనూ పోగొడుతుంది. దేహపుష్టినీ, కాంతినీ, మృదుత్వాన్నీ, తేలికపరిచే గుణాన్నీ కలిగిస్తుంది. దుస్వప్నాలను రాకుండా చేస్తుంది. గజ్జి, చిడుము, సర్పి, దద్దుర్లు మొదలయిన చర్మ రోగాలను పోగొడుతుంది. చెవుల్లో చమురు పోసుకుంటాము గనుక తద్వారా శిరఃపార్శ్వ కర్ణ శూలలు తగ్గుతాయి. అరిపాదాలకు చమురు మర్దించబడటంతో నేత్రాలకు చల్లదనం చేకూరుతుంది. కళ్ళల్లో చమురు పోస్తాము గనుక దంత వ్యాధులు దూరమవుతాయి - పళ్ళు మంచి దార్ఢ్యతను సంతరించుకుంటాయి. కొన్ని ప్రాంతాల ప్రజలు మామిడి, జువ్వి, నేరేడు, అత్తి, మర్రి పట్టల్ని నీళ్ళలో నానబెట్టి, ఆ నీళ్ళతో అభ్యంగ స్నానమాచరిస్తారు. ఈ అయిదు వృక్షాల పట్టల్ని నానబెట్టిన నీటితో స్నానం చేస్తే కళ్ళూ, మెదడూ ఆరోగ్యవంతమవుతాయంటారు.

సంవత్సరాది రోజున వేప చిగుళ్ళను తినాలని శాస్త్రాలు చెబుతున్నాయి.

'నింబపత్రం స్మృత్యం నేత్రం' అని భావప్రకాశ ఆయుర్వేద గ్రంథం పేర్కొన్నది. వేపాకు నేత్రాలకు చాలా మేలు కలిగిస్తుందని, కుష్ఠురోగాన్నీ, అరుచినీ కూడా వేపాకు పోగొడుతుందనీ చెబుతారు.

శతాయుస్సుకూ, వజ్రం లాంటి శరీరం కలుగడానికీ, అన్ని సంపదలూ కలిగి సర్వరోగాలూ దూరమవడానికీగాను వేప చిగుళ్ళను తినాలంటున్నదీ శ్లోకం –

'శతాయుర్వజ్ర దేహాయ సర్వసంపత్కరాయచ
సర్వారిష్ట వినాశాయ నింబకందళ భక్షణం' అని!

మనం వేప చిగుళ్ళకు బదులు వేప పువ్వును చేరుస్తున్నాము ఉగాది పచ్చట్లో!

'పారిభద్రస్య పత్రాణి కోమలాని విశేషతః....
కృత్వాభక్షయేద్రోగ శాంతయే'

అనే శ్లోకం వేపపూత పొడిలో ఉప్పు, మిరియాలు, జీలకర్ర, వాము, ఇంగువ కలిపి చేసిన పచ్చడి సర్వారోగాలనూ శాంతింపజేయగలదని తెలుపుతూ ఉంది.

వేపపూవులోగానీ, ఆకుల్లోగానీ చర్మ రోగాలను పోగొట్టే గుణం ఉంది. ఇవి ఏవైనా చేదుగా ఉంటాయి కదా — ఆ చేదులో వాత లక్షణాలను వృద్ధిపరిచే గుణముంది. కనుక వాత లక్షణాల్ని పోగొట్టేందుగ్గాను మనం ఉగాది పచ్చట్లో క్రొత్త బెల్లాన్ని కలుపుతున్నాము. బెల్లం అటు వాత గుణాన్ని తీసేస్తుంది. ఇటు చక్కని జీర్ణశక్తినీ కలిగిస్తుంది. అయితే బెల్లం తియ్యగా ఉంటుంది గనక, ఆ మధుర రసం కఫాన్ని ప్రకోపింపజేయవచ్చు. దానికి విరుగుడుగా మిరియాల పొడిని చేర్చుతున్నాము. ఈ మిశ్రమం త్రిదోషహరంగా పని చేస్తుంది.

అన్ని ఆరోగ్య గుణాలూ కలిగిన 'ఉగాది పచ్చడి' – 'జీవితం పూలబాట కాదు - పూల వెంట ముళ్ళలాగా, వెన్నెల వెంట చీకటిలాగా సుఖ దుఃఖ సమ్మిశ్రితం జీవితం....గనుక అన్ని రకాల అనుభవాలనూ సమాన దృక్పథంతో స్వీకరించాలి' అనే సందేశాన్ని ఇస్తుంది.

—డాక్టర్ లక్ష్మి ఎన్. ఎమ్. శ్రీరామ్



# స్త్రీల అందానికి పైమెట్టు

# ఐటెక్స్

## తిలకం బొట్టు

ఆకర్షణీయమైన అనేక రంగుల్లో. మేలైన
సువాసన ద్రవ్యాలతో. మృదువైన చర్మానికి
ఎలాంటి హాని కలుగని విధంగా
తయారు చేయబడుతోంది.

ఐటెక్స్ (MATT FINISH) తిలకం
స్త్రీల సొగసుకు ప్రియతమ తిలకం




ARAVIND LABORATORIES MADRAS-600 033

CREATIVE AD SER 203





# కొత్త రోజులు

**వేదుల శకుంతల**

సాయంత్రం ఐదుగంటలు అయింది. మంగమ్మ గారు వీధి వాకిట్లో కూర్చుంది. ఆవిడ ఒడిలో ఏణ్ణర్థం పాప మగతగా పడుకుని వుంది. వీధిలో కొందరు పిల్లలు ఆడుకుంటున్నారు. అందులో ఐదేళ్ళ 'సుజన' కూడా వుంది!

మంగమ్మగారు తెగ చికాకు పడుతున్నారు. మాటిమాటికి ఒళ్ళో వున్న పాపని విసురుగా లాగి పడుకోబెట్టుకుంటున్నారు. క్షణానికోసారి వీధి చివరకి దృష్టి మరల్చి 'ఇంకా రావటం లేదు' అన్నట్టుగా ముఖం ముడుస్తూ-గొణుక్కుంటున్నారు.

ఆవిడ మనసిక్కడ లేదు! గంట క్రితమే, ఇరుగుపొరుగు స్నేహితులంతా కలిసి, ఆ రోజు కమ్యూనిటీ హాలులో ఉపన్యసించబోతున్న — బాబాగారి సన్నిధికి వెళ్ళారు. తను వెళ్ళలేక పోయింది!

'ఈపాటికి హాలంతా కిటకిటలాడిపోతూ వుంటుంది. వారి గంభీర ఉపన్యాసం ప్రారంభమయే వుంటుంది!! పక్కింటి కామేశ్వరమ్మ - చివరింటి అన్నపూర్ణ - నాల్గో ఇంటి వరాలూ, ఎంత బాగా వింటున్నారో! ప్చ్! దేనికైనా అదృష్టం వుండాలి. మొన్నటికి మొన్న అంతే - "వదినగారూ, శివాలయంలో పురాణం చెప్తున్నారు - మేము వెళ్తున్నాం మీరు వస్తారా?'' అని అడిగింది శేషమ్మ. 'అయ్యో నాకంత భాగ్యమా తల్లీ? మీరు వెళ్ళి రండి!' అని పంపేసింది.

'ఖర్మ! ఖర్మ! కాక? ఈ వయస్సులో కృష్ణా రామా అంటూ కాలక్షేపం చేసుకోవలసింది పోయి....ఇల్లు పట్టుకుని కూర్చోవలసివస్తోంది. ఆ 'మహారాణీ' పది గంటలకల్లా....అబ్బాయితో పాటు వెళ్ళిపోతుంది. ఈ పసిదాన్ని పెట్టుకుని తను ఇంట్లో పడివుండాలి! స్కూలు నుంచి వచ్చే పిల్లలకి అన్నాలు పెట్టి వాళ్ళ అవసరాలన్నీ చూస్తూ ఇంటి కాపలా కాయాలి! ఏనాడో తను పిల్లల్ని పెంచింది! ఇప్పుడు ఇంత వయస్సు వచ్చాక మళ్ళీ చిన్నపిల్లల ఆలనా పాలనా చూడాలంటే ఎంత చికాకు? ఎప్పుడూ కూపస్థ మండూకం లాగా ఈ నాలుగోడల మధ్య బ్రతకాల్సిందే తప్ప బయటి కెళ్ళే యోగ్యత వుందా? ఏమిటో పెద్ద వయస్సులో అన్నీ బాధలే! ఓ పుణ్యమా? పురుషార్థమా!

కన్న తల్లి ఆ తీరున పోతే, ముసలి పీనుగని నేనా పిల్లల్ని చూసుకోడం? ముక్కు తుడిచి, మూతి కడిగి నిద్రపుచ్చి, నానా అవస్థపడాలి. ఏమిటి నాకి ఇరకాటం? లాభం లేదు. ఇక అబ్బాయితో చెప్పాల్సిందే! నా జీవితం ఇలాగే వెళ్ళమారిపోతే ఏమిటి బ్రతుక్కి అర్థం? జన్మంతా చాకిరీలతోటే. సరిపోయేట్టుంది!' ఆలోచనల్లోనుంచి బయట పడ్డారు మంగమ్మగారు.

"అయ్యో! అయ్యో! బామ్మగారూ, సుజన పడిపోయింది, మోకాలు గీరుకుపోయి రక్తం వస్తోంది!" పిల్లలంతా గోలగోలగా అరుస్తున్నారు.

"అమ్మయ్యో! ఆ డ్రైనేజి మూత మీద పడిందండీ? ఆ మూత గీసుకుపోయింది."

"బాబోయ్ తలకే గనుక తగిలితేనా ఇంకేం లేదు!" అందరిలోకి పెద్దగా వున్న పిల్ల గుండెల మీద చేయి వేసుకుని కళ్ళింతింతచేసి భయపెట్టింది.

ఒడిలో వున్న పాపని ఒక్క ఊపున బుజాన్న వేసుకుని, మెట్లుదిగి సుజన దగ్గరకి వచ్చారు మంగమ్మగారు.

పిల్లలంతా కలిపి లేవనెత్తిన సుజన, తగిలిన దెబ్బ బాధకన్నా కారుతున్న రక్తాన్ని చూసుకుని 'బోర్'మని ఏడ్పుస్థాయి పెంచింది! పిల్లల అరుపులు విని ఎదురింటి ఇల్లాలు బయటికి వచ్చింది!

"రామ! రామ! ఈ పిల్లలతో చచ్చిపోతున్నాను. ఈ చంటిదానికి జ్వరం! ఇప్పుడేమో ఇది పడి దెబ్బతగిలించుకుంది. వాళ్ళమ్మ ఇంకా రాలేదు. నాకెక్కడిసంతమ్మా ఇదంతా?"

సుజనని రెక్కపట్టుకుని గుంజుతూ ఎదురింటావిడతో, చెప్పుకుపోతున్నారు మంగమ్మగారు-"ఇదిగో జానకమ్మా రోజూ ఈ గొడవలతో పడలేకపోతున్నాననుకో! నాకే అసలు ఓపికలేదు. వీళ్ళనెక్కడ కనిపెట్టుకుని చూడగలను? చెట్టు చచ్చేకాలానికి కుక్కమూతి పిందెలాగా ఈ పెద్ద వయస్సులో ఓ సత్కాలక్షేపం లేకుండా ఈ పితలాటకం ఏమిటి చెప్పు! ఛ! ఇంకా నా బ్రతుకు అడక్కు తల్లీ! రాక్షసి పిల్లలతో పడలేను."

"అయ్యో బామ్మగారూ....రక్తం అంతా కారిపోతోంది. బాబోయ్ సుజనకి ఇంక రక్తం వుండదేమో!" ఓ పిల్ల గోల పెట్టింది. జానకమ్మ గబగబా వాళ్ళదగ్గరికి వచ్చి "ముందు దాని సంగతి చూడండి మంగమ్మగారూ....ఆ చంటిదాన్ని ఇలా ఇవ్వండి" అంటూ ఆవిడ చంకలో పాపని అందుకుంది.

ఎవరో వెళ్ళి చెంబుతో నీళ్ళు తెచ్చారు.

సుజన నెత్తిన మొట్టి-కాలు సరిగా లాగి చెంబుడు నీళ్ళతో ఆ దెబ్బని కడగటమనే పని పూర్తిచేస్తూ "వీళ్ళ ఆటలు తగలెయ్య! ఓ చోట నెమ్మదిగా కూర్చుని ఆడుకోరాదూ? ఈ దూకటాలు, పరిగెత్తటాలు ఎందుకు? వీళ్ళమ్మా నాన్నా వచ్చేక నాకు నిష్ఠూరాలు తప్ప, పొద్దస్తమానం చూస్తున్నదేమన్నా కనిపిస్తుందా?" అంటూ విసుక్కున్నారు ఆవిడ.

సుజన ఏడుపు ఆగటంలేదు. జానకమ్మ చేతిలో చంటి పాప నిలవటం లేదు. బామ్మ దగ్గరకి పోతానని జారిపోతోంది! సుజనని ఓ చేత్తో, చంటిదాన్ని మరో చేత్తో అందుకుంటూ "ఇంకా ఆ అంట్ల వెధవ ఎక్కడున్నాడో? వాడు, ఎప్పుడు పెంటకుప్పలు, మట్టి దిబ్బల మీదే ఏడుస్తాడు" అంటూ ఎనిమిదేళ్ళ గోపిని కూడా తలుచుకుంటూ వీధి గుమ్మం ఎక్కేరు మంగమ్మగారు.

సుజన కాలునుంచి ఇంకా రక్తం కారుతూనే వుంది. చంకలో పిల్ల జ్వర భారంతో మూల్గుతోంది. మధ్య మధ్య అక్క ఏడుపు వింటోంది. ఆ సమయంలోనే పక్క వీధిలో బంతి ఆడుకుంటున్న గోపికి ఎవరో చెప్తే పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"ఏమిటీ బామ్మా? చెల్లాయికి దెబ్బ తగిలిందా?" పిల్లలమధ్యనుంచి చోటు చేసుకుంటూ రొప్పుతూ ఆడుగుతున్న గోపిని చూసి, "వచ్చావా? ఎక్కడేడేవ్వు ఇంతసేపూ? చెల్లాయిని ఆడించుకోవాలని తెలియదూ? చూడు ఎంత దెబ్బ తగిలిందో?"

"ఆ! పాపం! నేనేం చేసేనూ? నేను పడేసేనా? నువ్వు చూడకూడదూ?" తల ఎగరేస్తూ అడిగేడు.

"అన్నావూ? అంటావురా? నువ్వు అంటావని నాకు తెల్సు. వింటున్నావా జానకమ్మా? వేలెడంత లేడు ఎలా నిగ్గతీస్తున్నాడో చూసేవా?"

"అబ్బ ఊరుకోండి మంగమ్మగారూ చిన్నపిల్లాడు ఏదో అంటాడు. వాడి మాటలు లెక్కేమిటి? ముందు దానికేదైనా మందు రాయండి" గోపీ రివ్వున దూసుకెళ్ళి అలమారలో మందు ట్యూబ్ అందుకొచ్చాడు గచ్చకాయంత ముద్ద తీసి దెబ్బ చుట్టూ పట్టించేడు. డ్రాయర్ లాగి అందులో ఉతికి మడతపెట్టి వుంచిన సుజన రిబ్బెను తెచ్చి జానకమ్మ వారిస్తున్నా ఆగకుండా చుట్టేసేడు.

మెల్లమెల్లగా ఒక్కొక్కరే వెళ్ళిపోయేరు.

సుజన ఏడుపు మానినా వెక్కిళ్ళు తగ్గలేదు! కుర్చీలో కూర్చుని కాలువైపు చూసుకుంటూ, కళ్ళు ఒత్తుకుంది! బామ్మ కసరడం వల్ల గోపీ బయటికెళ్ళకుండా ఇంట్లోనే వుండిపోయేడు.

చంటిపిల్లని మెల్లగా పడుకోబెట్టి జోగొట్టున్నారు, మంగమ్మగారు. సంధ్య చీకట్లు పరుచుకుంటున్నాయి!

పావు తక్కువ ఆరు అవుతున్నప్పుడు ముందుగా, మధుమూర్తి వచ్చాడు ఆఫీసునుంచి.

సుజన మళ్ళీ ఏడుపు అందుకుంది!

మంగమ్మగారు విషయం వివరించబోతూ వుండగా గోపీ కూడా కలగచేసుకున్నాడు. ఒకరి మాట ఒకరికి పొత్తకుండా చెప్తున్నారు.

మధుమూర్తి ఓసారి సుజనని దగ్గరికి తీసుకుని ఓదార్చి తర్వాత చంటిదాని జ్వరం సంగతి అడిగి డ్రస్సు విప్పుకుంటున్నప్పుడు మంగమ్మగారు మొదలెట్టేరు.

"ఒరే మధూ! వచ్చేవారంలో నేను విజయవాడ వెళ్తానురా! నన్ను పంపించు!"

"ఇప్పుడు ఆ సంగతెందుకమ్మా?" చిన్నగా నవ్వేడు.

"ఒరే! నువ్వు ఇలా ప్రతిసారీ నా మాట తేలిగ్గా తీసేయకురా! అమ్మాయిని చూడాలని ఎన్నాళ్ళనుంచో మనసు పీకుతోంది! ఎప్పటికప్పుడే వాయిదా వేస్తున్నావు! ఈ సారి మాత్రం తప్పదు. రేపే దానికో ఉత్తరం ముక్క రాసిపారేస్తాను. నువ్వు పంపిస్తావా సరేసరి లేకుంటే దాన్నే వచ్చి తీసుకెళ్ళమని రాస్తాను" అంత నిక్కచ్చిగా చెప్తున్న తల్లి వైపు వింతగా ఒకింత కలతగా చూసేడు మధుమూర్తి.

పుట్టి బుద్దెరిగినప్పట్నుంచీ, తల్లి పట్టుదల, పంతం తెల్సున్నా తండ్రి పోయినప్పట్నుంచీ అతి జాగ్రత్తగా చూసుకుంటూ కావల్సిన సదుపాయాలన్నీ చూస్తూ కాలక్షేపం చేసుకువస్తున్నాడు. అయినా, అప్పుడప్పుడు ఈ రకమైన బెదిరింపులు, పంతాలు తప్పటం లేదు. సమయ సందర్భాలు గుర్తించకుండా, బొత్తిగా పిల్లలు పేచీలు పెట్టినట్టు వుండే తల్లి ధోరణికి అతి కష్టంమీద నిగ్రహించు

కుంటూ వుంటాడు మధు! "సరేలేమ్మా! పై వారంలో అంటున్నావు గదా? చూస్తాలే!" షర్టు స్టాండ్ మీద పడేసి బాతురూమ్ వైపు వెళ్తుంటే గుమ్మంలో అడుగుపెట్టింది, సుధ!

ఒడిలిపోయిన తోటకూర కాడలా నీర్సంగా, నిస్త్రాణగా వుంది సుధ! ఓ క్షణం జాలిగా చూసి, గబగబా బాత్‌రూమ్‌కి వెళ్ళిపోయాడు మధు.

అమ్మని చూడగానే సుజన మళ్ళీ మొదలెట్టింది ఏడుపు! ఈ సారి మంగమ్మగారు ఏం కల్పించుకో లేదు! గోపీయే గడగడా జరిగిందంతా చెప్పేసేడు.

అసలే అలసటగా వుంది. చిన్నదాని జ్వరం ఎలా వుందో అనుకుంటూ వచ్చింది. ఇప్పుడు సుజన దెబ్బ కూడా తగిలించుకుంది! లేని ఓపిక తెచ్చుకుని సుజనని దగ్గరికి తీసుకుని "ఫర్వా లేదమ్మా" తగ్గిపోతుందని బుజ్జగించింది. తర్వాత చంటిదాని ఒంటిమీద చేయివేసి చూసి "ఏమైనా ఏడ్చిందా అత్తయ్యగారూ?" అని అడిగింది. మంగమ్మగారు ముఖం పక్కకి తిప్పుకుని "ఎందు కమ్మా ఆ అడగటం? ఏడ్పించినా, నవ్వించినా తప్పదుకదా? నువ్వేమో ఉద్యోగస్తురాలివాయే! పిల్లల్ని చూసుకుందుకు నీకెలా తీరుతుందీ?" అనేసి పక్కగదిలోకి వెళ్ళిపోయేరు.

ఆమె నుంచి అంతకన్నా మృదువుగా సమా ధానం ఆశించని సుధ – పేలవంగా నవ్వుకుని మెల్లగా పనిలోకి ప్రవేశించింది.

యాంత్రికంగా వంట ముగించి, అందరికీ పెట్టి, చంటిపిల్లకి మందుపోసి పడుకోబెట్టి - రాత్రి పది గంటలవుతుండగా పక్క మీద మేను వాల్చింది సుధ!

తను ఉద్యోగస్తురాలు! నిజమే. కానీ ఏమిటి సుఖం? ఇంటి పని తప్పిందా? ఇంటా బయటా చేస్తుంటే....ఎప్పుడో రావల్సిన వృద్ధాప్యం— ముందే వచ్చేస్తున్నట్టుంది! అలసిపోతున్న శరీరం కనీసపు సరదాలకీ, కోరికలకీ దూరమవుతోంది! ఈ వయస్సులో వికసించవలసిన మనసు ముకు ళించుకు పోతోంది! పోనీ బాంక్ బాలెన్స్ ఏమైనా వుందా అంటే....పిచ్చి! వేడినీళ్ళకి చల్లనీళ్ళు తోడనే గదా తను ఈ జాబులో చేరిందీ? ఆర్థిక స్థితిగతులు చక్కబదేవరకు బ్యాంక్‌లో డిపాజిట్ తప్ప – (అది తప్పదు గనుక) వుండదు. కడుపు నిండా అన్నం తినడానికి కూడా టైముండదు ఒక్కోసారి! ఆదరా బాదరా నాల్గు మెతుకులు





# పూసలతో హంసతూలికాతల్పం

శ్రీమతి వి. శేషకుమారి లేసులతోనూ, ఊలు దారాలతోనూ అనేక కుట్లు, అల్లికలు చేశారు. పూసలతో దాదాపు ముప్పైరకాల అలంకరణ వస్తువులు తయారు చేశారు. ఇక్కడ పూసలతో హంసతూలికాతల్పం ఎలా చెయ్యవచ్చునో తెలియ జేస్తున్నారు.

కావలసిన వస్తువులు : ఆరంజిరంగు పూసలు-50 గ్రాములు; తెలుపురంగు పూసలు–50 గ్రా॥; ఎరుపురంగు పూసలు-5 గ్రా॥; ప్లాస్టిక్ వైరు (పూసలు గుచ్చడానికి). పైన ఉదహరించిన రంగు పూసలతోనే చెయ్యాలని లేదు. ఎవరికి నచ్చిన రంగు పూసలు వారు ఉపయోగించ వచ్చును.

1. మొదట నాలుగు హంసలు తయారు చేసుకోవడానికి గాను ఎనిమిది హంసల బేస్‌లు చిత్రంలో చూపినట్లుగా అల్లుకోవాలి.

మొదటి బేస్‌లో ఆరంజిరంగు పూసలతో 5 పూసల చొప్పున 1 వరుస, 6 పూసల చొప్పున 2వ వరుస, 7 పూసల చొప్పున 3వ వరుస, 8 పూసల చొప్పున 4వ వరుస, 9 పూసల చొప్పున 5వ వరుస అల్లి ఆ పైన దిశమార్చి అడ్డంగా చిత్రంలో చూపిన విధంగా అల్లుకుంటూ రావాలి. ఇలా అల్లేటప్పుడు హంస ఆకారాన్ని జాగ్రత్తగా చూసుకుంటూ ఆ ఆకారానికి తగ్గట్టుగా అడ్డు అల్లిక పూసలని తగ్గించుకుంటూ, పెంచు కుంటూ అల్లుకురావాలి. ఇలా 8 హంస ఆకారపు చాపలని అల్లుకుని, ఒక్కొక్క హంసకు 2 చాపల చొప్పున వేర్వేరుగా వుంచి, ఆ రెండింటి మధ్య దూది, అట్ట, సిగరెట్ పెట్టిల్లో వుండే 'సిల్వర్.' కాగితాన్ని దూర్చి, ఆ రెండు చాపలని అటూ, ఇటూ పెట్టి వాటిని అతికితే ఒక హంస తయా రవుతుంది. ఇలాగే 4 హంసలు తయారు చేసి వుంచుకోవాలి. ఇక ఇప్పుడు ఈ నాలుగు హంసల లోనూ రెండు హంసల మూతులను తెలుపురంగు పూశలతో కలపాలి. ఇప్పుడు రెండు హంసల జతలు తయారవుతాయి. వీటిని విడిగా ఒక ప్రక్కన పెట్టుకోవాలి.

2. ఇప్పుడు 1 సెంటిమీటరు పొడవుతోనూ 6 సెంటిమీటర్ల వెడల్పుతోనూ చిత్రంలో చూపిన విధంగా దీర్ఘచతురస్రపు బేస్ అల్లుకోవాలి. ఆ బేస్‌ని హంస కాళ్ల ఆకారంలో అల్లిన అల్లికల పూసలతో కలిపితే హంస తూలికా తల్పానికి కావలసిన తలవైపు, కాళ్ళవైపు ఆధారాలు ఏర్పడతాయి.

3. ఆ తరువాత 6 సెంటిమీటర్ల పొడవు తోనూ, 9 సెంటిమీటర్ల వెడల్పుతోనూ దీర్ఘచతు రస్రపు చాపలు రెండు అల్లుకోవాలి. ఆరంజిరంగు పూసలతో వరుసకి 17 చొప్పున 24 వరుసలు అల్లుకుంటూ రావాలి. అలా అల్లేటప్పుడు మనకి కావలసిన డిజైను అందంగా తెలుపురంగు పూసలతో అల్లుకోవాలి. అలాంటి చాపలు రెండు అల్లిన తర్వాత వాటి రెండింటి మధ్య దూది, అట్ట, సిల్వర్‌పేపర్ పెట్టి ఆ రెండు చాపలను కలిపి అల్లికచేస్తే మంచం ఉపరితలం తయా రవుతుంది.

4. ముందుగా తయారు చేసి వుంచుకున్న హంసల బేస్‌లు, హంసలని మంచం బేస్‌కి తల వైపున జాయింట్ చెయ్యాలి. అదే విధంగా మరో హంసల బేస్‌ని కాళ్ళవైపు జాయింట్ చేస్తే హంసతూలికాతల్పం తయారవుతుంది. ఎరుపు రంగు పూసలతో మంచం బార్డర్ చుట్టూరా అల్లు కుంటే అందంగా వుంటుంది. □

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

కేర్‌ఫ్రీ మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునిక యువతికి చేదోడు.

కేర్‌ఫ్రీ ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్, ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, కేర్‌ఫ్రీ ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపుకోగలదు. కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క కేర్‌ఫ్రీ మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకలు పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

కేర్‌ఫ్రీతో మీరు హాయియైన భావన పొందగలరు, నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

కేర్‌ఫ్రీ వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్యకరమైనదిగూడా.

కేర్‌ఫ్రీ ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిసుంది.

Johnson & Johnson

కొరికి, ఆఫీసుకి పరిగెత్తుంది! మళ్ళీ ఇల్లు చేరుకునే సరికి జీవచ్ఛవంలా తయారవుతుంది!

ఈ ఉద్యోగంవల్ల తను అనుభవిస్తున్న ఆనందం ఏమిటి? కన్నపిల్లల్ని సరిగా చూసుకోలేక పోతోంది. మధ్యాహ్నం పూట కాస్సేపు నిద్ర పోడం అనేది తల్చుకోడానికే వీలవదు! సాయంత్రం పూట కులాసాగా కూర్చుని కబుర్లు చెప్పుకునే అదృష్టం లేనేలేదు! ఈ మధ్య కాలంలో సినిమా చూసిన గుర్తులేదు!

ఇదేనా తన సుఖం? నిజానికి ఈ ఉద్యోగం వదిలేస్తే తను ఎంతో హాయిగా వుండొచ్చును! అత్తగారి సణుగుళ్లు, గొణుగుళ్లు — విసుర్లు పడక్కర్లేదు! కానీ - అప్పుడు భర్త ఎంత కష్ట పడాలో... తనకు తెలుసు! సంసారం ఎంత గడ్డుగా తయారవుతుందో ఊహించగలదు!! అందుకే తను ఉద్యోగం చేయడానికే నిశ్చయించుకుంది!— తల తిప్పి పక్క మంచంలో నిద్రపోతున్న భర్త వైపు అభిమానంగా చూసింది.

పగలంతా పడిన శ్రమని గుర్తు చేసుకుని, గతంలోపడిన అవస్థలతో బేరీజు వేసుకుని-ఏ వైపు బరువు ఎక్కువవుందో తెలిసేక ఉద్యోగం చేయడానికే, అత్తగారి నిరసనలు, మూతి విరుపులు భరించడానికే, సిద్ధపడుతున్నట్టు-దీర్ఘంగా నిట్టూర్చుకుని నిద్రపోతున్న భర్తని పిల్లల్నీ ఆప్యాయంగా చూసుకుని, పడుకోడం సుధ నిత్యకృత్యాల్లో-తప్పని సరై పోయింది!

సరిగ్గా ఆ సమయంలోనే — పక్క గదిలో మంగమ్మగారు, పక్కమీద పడుకోబోతూ, మరోసారి గట్టిగా అనుకున్నారు—'వృద్ధాప్యంలో నిశ్చింతగా బ్రతకాలి. నాకెందుకీ జంఝాటాలన్నీ! కోడలు ఊరు పట్టుకుని తిరిగితే, అత్త ఇంట్లో పిల్లల్ని కనిపెట్టుకుని వుండాలా? ఏం మాయదారి కాలం? భర్త బ్రతికి వున్న రోజుల్లో తనెంత దర్జాగా బ్రతికింది? ఎంత హాయిగా తిరిగేది? ఇల్లు ఎప్పుడూ ఎంత సందడిగా వుండేది? ఏమిటో ఈనాటికి తన స్థితి ఇలా దిగజారింది! జైలు జీవితంలా అయిపోయింది! తోటి వాళ్ళలా—ఓ గుడికీ, గోపురానికీ, పురాణానికి, పూజకీ వెళ్ళడానికేనా వీలు లేదు! ఛ! ఎందుకొచ్చిన అవస్థ? తేరగా వున్నాననీ ముసలి ఏనుగుననీ-వీళ్ళు నన్నిలా బంధించేస్తున్నారు! ఇంక ఊర్కోను. ఎలాగైనా అమ్మాయి దగ్గరికి వెళ్ళిపోతాను. అప్పుడు ఏం చేస్తారో చూడాలి! కోడలుపిల్ల ఉద్యోగం చేస్తుందో మానుతుందో తెలుస్తుంది! అత్తంటే ఇంత అలుసా?'

*

మర్నాడు మధ్యాహ్నం - మంగమ్మగారు చంటిపిల్లనీ, సుజననీ, హాల్లో కూర్చోబెట్టుకుని, తీరుబడిగా అమ్మాయికి రాయబోయే ఉత్తరాన్ని గురించి ఆలోచిస్తున్నారు! తనిక్కడ ఎంత ఇబ్బంది పడుతున్నదీ వాళ్ళు తనని ఎంత చులకనగా, తేలికగా చూస్తున్నదీ అన్నీ వివరంగా రాయాలనుకుని — ఎక్కడ్నించి ఎలా మొదలు పెట్టాలా అని యోచిస్తున్నారు. సుజనకి నిన్నటి దెబ్బ వాచి కాలు నొప్పి చేసి స్కూలుకి వెళ్ళలేక ఇంట్లోనే వుండి పోయింది.

చంటిదానికి తోడు పెద్దపిల్లని కూడా చూసుకోవలసి వచ్చిందని, ఆవిడకి తెగ విసుగ్గా వుంది. అసలు ఆరోజు బాబాగారి ఉపన్యాస వివరాలన్నీ వరాలమ్మ దగ్గరికి వెళ్ళి తెల్సుకోవాలనుకున్నారు. చంటిపిల్లనైతే ఎలాగో చంకనేసుకుని వెళ్ళచ్చును. కానీ సుజనని ఎలా తీసుకెళ్ళాలి? అందుకే ఆవిడ చాలా కోపంగా అసహనంగా వుంది. మనసంతా కుతకుతలాడిపోతోంది. తనకి ఇంట్లో బొత్తిగా గౌరవం లేకుండా పోతోందన్న భావం క్షణక్షణానికి పెరిగి పోతుంటే భరించుకోలేక తన 'దుస్థితి'నంతా కూతురికి ఉత్తరం ద్వారా తెలియపరచాలని, ఆలోచిస్తున్నారు.

ఆ సమయంలో పోష్టుమేను ఉత్తరం అందించి వెళ్ళేడు. కవరు మీద దస్తూరి చూడగానే, విజయవాడ నుంచి కూతురు రాసిందని గుర్తించి, మహదానందంతో గబగబా కవరు చింపేసి, చదవడం మొదలెట్టేరు, మంగమ్మగారు.

"అమ్మా!

చాలా రోజులకి ఉత్తరం రాస్తున్నాను గదూ? మీరంతా కులాసాగా వున్నారని తలుస్తాను.

ఈ మధ్య అనుకోకుండా రత్నం పిన్ని కనిపించింది. మొదట నమ్మలేకపోయాను....పిన్ని అవునా కాదా అని. నిజంగా ఎంత మారిపోయిందనుకున్నావ్? గంభీరంగా, నిండుకుండలా, దర్పంగా వుండే మనిషి, ఎంతో డీలా పడిపోయి-దైన్యంగా, ఉదాసీనంగా వుందమ్మా!

గుర్నాథం బాబాయ్ వున్నంత కాలం రత్నం పిన్ని హాయిగా బ్రతికింది....కొడుకు కోడలు కూడా బాగానే చూసేవారుట! బాబాయ్ పోయాక ఆ కోడలుకి అత్తగారంటే బొత్తిగా కిట్టటం లేదుట! ఎక్కడలేని పొదుపు పిన్ని దగ్గరే చూపిస్తుందిట! అసలే కరువు రోజులు...జీతాలు చాలటం లేదు ... ఈ ముసలి 'ఘటం' ఎంతకాలం వుంటుందో.... అన్నట్టుగా చాటుమాటుగా విసుక్కుంటుందిట! తమ స్వసుఖాలకి అత్తగారు అడ్డం అని వాపోతూ వుంటుందిట! నిజానికి గుర్నాథం బాబాయ్ ప్రతి పైసా కూడగట్టి కొడుకు కోసమే దాచాడు గదా? ఆడపిల్లకి సామాన్యమైన సంబంధాలే చేసి - ఉన్న

### లోకజ్ఞానం - సమాధానాలు

1. గ్రహమ్ బెల్—ఎ. వాట్సన్‌ల మధ్య జూన్ 3,1875నాడు బెల్ తయారుచేసిన టెలిఫోన్‌లో తొలిసారిగా సంభాషణ జరిగింది. మొట్టమొదటి టెలిఫోన్ ఎక్స్ఛేంజి అమెరికాలోని బోస్టన్ నగరంలో 1878 సంవత్సరంలో ప్రారంభించబడింది.
2. సింగపూర్‌లో అక్టోబర్ 21, 1943 నాడు రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో నేతాజీ ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని తాను ఏర్పాటు చేసినట్లుగా ప్రకటించారు.
3. ఫిబ్రవరి 9, 1931.
4. గోపాలకృష్ణ గోఖలే. 1905 లో స్థాపించారు.
5. హెన్రీ డ్యూరాన్ట్. (Henry Durrant).
6. ఆర్వి (మహారాష్ట్ర). ఈ కేంద్రానికి కీ. శే. డాక్టర్ విక్రమ్ సారాభాయ్ పేరిట విక్రమ్ ఎర్త్ అండ్ సాటిలైట్ స్టేషన్‌గా నామకరణం చేయబడింది.
7. ఏంజెల్ ఫాల్స్ (వెనిజులా). వెనిజులాలోని కారవో నదీ శాఖవద్ద నున్న ఈ జలపాతం ఎత్తు 964 మీటర్లు, ఈ జలపాతాన్ని 1935లో అమెరికన్ పైలట్ జిమ్మీ ఏంజెల్స్ కనుగొన్నాడు. అందువల్ల ఈ జలపాతాన్ని ఏంజెల్ ఫాల్స్ అని అంటున్నారు.
8. క్రిస్టోఫర్ కొలంబస్. 1492లో కనుగొన్నాడు.
9. బెల్‌గ్రేడ్, సోఫియా, టిరానా, సాన్‌జోస్, వెలింగ్టన్.
10. డబ్ల్యూ. కె. రోయిన్ట్‌జెన్ (W.k.Roentgen). జర్మన్ దేశస్థుడైన ఇతడు 1825 లో ఎక్స్‌రే విధానాన్ని కనిపెట్టాడు.

దంతా కొడుకు పేరనే రాసాడు! ఇప్పుడు ఆ కోడలు ఆ ఆస్తినంతా అనుభవిస్తూ.... పైగా ఏమంత మిగిల్చేరనీ? ఎంత మిగిల్చేరో అంతా తినేస్తూనే వున్నారని గొణుక్కుంటూ అత్తమ్మని కన్నెత్తైనా చూడదుట! పన్నెత్తి ఆప్యాయంగా పలకరించదుట!

"ఇంకా ఏం చెప్పనూ? నా బ్రతుకు ఇంత అధ్వాన్నమవుతుందనుకోలేదు" అంటూ పిన్ని చంటిపిల్లలా ఏడుస్తుంటే-నా మనస్సు విలవిల కొట్టుకుపోయింది! కడుపు తరుక్కుపోయింది!

"అమ్మా! నువ్వెంత అదృష్టవంతురాలివమ్మా? వదినలాంటి మంచి మనసున్న కోడలు ఎంత పుణ్యం చేసుకుంటే దొరకాలి? అన్నయ్య సంపాదన చాలదనీ - సంసారం గుట్టుగా సాఫీగా సాగిపోవాలనీ తను కూడా ఉద్యోగంలో చేరింది! అబ్బ! ఉద్యోగం చేస్తూ ఇల్లాలిగా ఇల్లు చక్కపెట్టుకుంటూ ఎంత కష్టపడుతోందమ్మా వదిన! సంసారాల్లో ఆర్థికచిక్కులు ఎదురవుతున్నప్పుడు ఇంట్లో కూర్చుని అత్తా కోడళ్ళు కీచులాడుకుంటు మగవాణ్ణి విసిగించి కలతలపాలు చేసే రోజులు మరిచిపోవాలి! ఒక గడ్డు సమస్యను ఎదుర్కోవాలంటే తగిన పరిష్కారమార్గం వెతకాలి! వదిన ఆ పనే చేస్తోంది! ఆమె చదువు సంస్కారం ఈనాటి యువతరానికి మార్గదర్శకం అని పదేపదే తలుచుకుంటున్నాను!

"నీకు, వదినకీ, అన్నయ్యకి నా నమస్కారాలు! పిల్లలకి నా దీవెనలు! ఆ! అన్నట్టు రత్నం పిన్ని నిన్ను అడిగేనని, చెప్పమన్నది! త్వరలోనే జవాబిస్తావ్ గదూ?

ఇట్లు మీ కుమార్తె
పద్మ

ఉత్తరం పూర్తిచేసి అలాగే కూర్చుండిపోయారు మంగమ్మ గారు. "బామ్మా ఎవరు రాసేరూ ఉత్తరం?" సుజన అడిగేసరికి, చటుక్కున తెప్పరిల్లి "అత్తయ్య రాసిందమ్మా కాలు నొప్పిగా వుందా? పడుకో" అంటు సుజనని చాపమీద పడుకోబెట్టింది! మళ్ళీ అమ్మాయి రాసిన సంగతులే మనసులో మెదిలేయి!

'రత్నం చాలా అవస్థలు పడుతోందా? ఆమె స్థితి ముందు తనదెంత మెరుగు? కొడుకుని అపురూపంగా చూసుకుని ఏరి కోరి కోడల్ని తెచ్చుకుంది! కానీ ఈనాడు ఆ కోడలే సాధిస్తోందా?

'కానీ మేము చేసిందేమిటీ? ఉన్నదేదో ఊడ్చి అమ్మాయి పెళ్ళికి, పురుడు పుణ్యాలకి ఖర్చు చేసి చేతులు దులుపుకున్నాం! అబ్బాయి ఉద్యోగం మాత్రం ఏమంత పెద్దది? నిజానికి వాడి ఒక్కడి సంపాదనతో ఈ సంసారం సవ్యంగా నడిచేదా? సుధ ఉద్యోగంలో చేరబట్టే గదా చింతలు లేకుండా గడిచిపోతోంది! ఈ చంటిదాని పురుడప్పుడు కూడా సెలవు ఎక్కువ పెట్టుకోకుండా వెంటనే జాయిన్ అయిపోయింది. మామూలుగా బాలింతరాలు ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటుందీ? తమ కాలంలో తను మూడో నెలదాకా నీళ్ళలో పని చేసిందా? కానీ సుధ నెలలోపునే పనిపాటలు మొదలెట్టింది. తను అప్పట్లో ఆ సంగతి అంతగా గుర్తించక-చంటిగుడ్డును తన మీద పారేసిందని విసుక్కునేది!

'పొద్దున్న పది గంటలకే వెళ్ళిపోతుందనీ పగలంతా, పిల్లలతో తను వేసారిపోతున్నాననీ తను విసుక్కుంటోందిగానీ ఉద్యోగం అన్నాక వేళకి వెళ్ళవద్దా? మగాడితోపాటు సంపాదిస్తున్నప్పుడు మగాడిలాగే బయటికి వెళ్ళాలి గదా? ఇన్నాళ్ళూ తను ఆ విషయం ఎందుకు ఆలోచించలేకపోయింది?

'అనాది నుంచి జీర్ణించుపోయిన కొన్ని భావాలు, అంత త్వరగా సమసిపోవు। చుట్టూ వున్నావాళ్లంతా 'అత్త'ల హోదాల్లో నిర్విచారంగా తిరగ్గల్గుతున్నారు. మరి తను అత్తేగదా? వాళ్ళకున్న స్వేచ్ఛ తనకి లేకపోయిందే అన్న బాధ తనకి కల్గుతోంది।

'నిజానికి పెద్దరికం పేరుతో వీళ్లంతా ఆ సభలు, ఉపన్యాసాలు విని ఆచరిస్తున్నదేముందీ? ఇదివరలో విన్నవే, మళ్ళీ మళ్ళీ వింటున్నారు. ఏ మహాత్ములు సందేశమిచ్చినా, ఏ దేవతా సందర్శనం చేసుకున్నా తెల్సుకునేది ఒకటే। సర్వత్రా భగవంతుడున్నాడనీ తాపత్రయాలుమాని తృప్తితో నిస్వార్థంతో పరుల మేలును కోరుతూ ముక్తిని పొందండనీ।

'రవ్వంత వివేకాన్ని పోగొట్టుకుని అజ్ఞానంగా మూర్ఖంగా ఆలోచిస్తోందా తను? అమ్మాయి ఉత్తరం చదివేవరకు తనకు తట్టనేలేదు। ఎప్పుడూ తనవైపు నుంచే సమర్థించుకుంటోందిగానీ సుధ వైపు నుంచి ఎప్పుడైనా ఆలోచించిందా?

'పిచ్చి పిల్ల। ఇల్లు వదిలి బయటికెళ్ళి – ఆఫీసులో పనితో అలిసివచ్చి ఏం దాచుకుంటోందీ? పాత బాకీలు జమకట్టడం, కొత్త అప్పులు చేసి ఇంట్లోకి కొన్ని అవసరాలు, చూడటమే సరిపోతోంది। అబ్బాయితో కలిసి సినీమాలకి షికార్లకి వెళ్ళేంత తీరుబడి కూడా లేదు। ఆస్తిపాస్తులేమీ లేవని దిగులుపడకుండా, అబ్బాయితోపాటు సంపాదించి నల్గురి సుఖం చూస్తున్న సుధ నిజంగా ఈ తరానికి మార్గదర్శి। అమ్మాయి చక్కగా రాసింది.'

'అత్తని సాధించే కోడళ్లు, కోడళ్ళని ఆరళ్లు పెట్టే అత్తలు; వున్నారంటే నవ సమాజంలో వుంటూ కూడా బూజుపట్టిన పాత బుద్ధులు వదులుకోలేకపోతున్నారన్నమాట। ఆ లెక్కలో తను కూడా అంతే। ఉహూ। వద్దు వద్దు అలా వుండకూడదు। మారుతున్న కాలంలో ఆధునిక సౌకర్యాలన్నీ అనుభవిస్తూ మళ్ళీ పాతకాలం నాటి ఛాందస భావాలు గుర్తుంచుకోకూడదు।

'ఇంకా నయం। వెర్రితనంగా నా ఊహలన్నీ అమ్మాయికి రాసి పోస్టు చేయించేను కాదు. అమ్మాయి నన్నెంతగా అసహ్యించుకునేదో? ఎంత అనర్థకం తప్పింది?'

మంగమ్మగారు ఆలోచనా స్రవంతి కొత్త పుంతల్లోకి మళ్లింది। పద్మ రాసిన ఉత్తరం ఆమెలో విజ్ఞతని తట్టిలేపింది। ఆ క్షణంలో మంగమ్మగారు ఇంతకాలంగా తన ప్రవర్తన ఎంత సంకుచితంగా వుందో తల్చుకుని సిగ్గుపడిపోయారు.

ఆ సిగ్గును దాచుకునే ప్రయత్నంలో అప్పుడే నిద్రలేచిన చంటిదాన్ని ఒడిలోకి తీసుకుని గుండెలకి హత్తుకున్నారు। మరి కాస్సేపటికి స్కూలు నుంచి ఇంటికి వచ్చిన గోపికి, నిద్రలేచిన సుజనకి అన్నాలు పెట్టేరు।

ఏ రోజు లేనిది ఆ రోజు కొడుకు, కోడలు ఇంటికి వచ్చేసరికి కాఫీ పెట్టి టిఫిను కూడా చేసేరు।

ఇంటికి వచ్చిన సుధ ఈ మార్పుకి కించిత్ ఆశ్చర్యపోయినా - ఆనందించకపోలేదు। 'అబ్బ, ఇవాళ ఎంత సుఖంగా వుందీ?' అనుకుంది. ఉత్తరం వచ్చిన సంగతే తప్ప వివరాలు చెప్పలేదు ఆవిడ। పిల్లల్ని గురించి సుధ అడగకపోయినా మంగమ్మగారే చెప్పారు। వంట చేస్తున్న సుధకి అదీ ఇదీ అందించేరు।।

'ఇవాళ అత్తగారి ధోరణి కొత్తగా వుంది సుమా?' అని పదేపదే అనుకుంది సుధ.

ఆ రాత్రి పనులన్నీ ముగించి పడుకున్న సుధ– 'పాపం। అత్తగారు ఇంట్లో పగలంతా విసుగెత్తిపోతున్నారు। నిజమే పెద్ద వయసు వచ్చాక విశ్రాంతి కావాలి। రేపు పష్టు మీద ఫెస్టివల్ లోను తీసుకుని ఆవిడ్ని ఏ యాత్రకైనా పంపించాలి। చంటిదాని కోసం ఓ పనిపిల్లని చూసుకుంటే - మళ్లీ అత్తగారు వచ్చేవరకు సరిపెట్టుకోవచ్చును। ఎన్నాళ్ళని ఆవిడ్ని ఇబ్బంది పెట్టనూ? రేపు కాతా కొట్లో జమ కట్టించి అత్తగారికో మంచి రగ్గు తీసుకోవాలి। ఆవిడకి కావల్సిన సదుపాయాలు శ్రద్ధగా చేయాలి। ఈ వయసులో ఆవిడ్ని సంతోషపెట్టాలి।' అనుకుంది.

ఆ రోజు సుధ తలంపులన్నీ కొత్త కొత్తగా సాగేయి। అంతేకాదు....పక్క గదిలో మంగమ్మగారు యోచనల్లో మరీ మరీ వింతలు కదిలేయి।—

సుధ ముఖం ఇవాళ ఎంత సంతోషంగా వుందీ? తనెంత దాచుకున్నా నాకు తెల్సిపోతూనే వుంది - ఆ కళ్లలో మెరుపు। పిచ్చిపిల్ల। చాలా అలసిపోతోంది। నా నుంచి గోరంత ఓదార్పు-కాస్తంత ఆదరింపు దొరికితే చాలు ...కొండెక్కనంత సంబరపడుతుంది। మళ్ళీ పండగ వస్తోంది. ఇంట్లో అన్నీ ఖర్చులే। ఈ నెలలో చిన్నదానికి జ్వరం వచ్చి మందులకి మాకులకి బాగానే వదిలింది। ఇంకేం మిగులుతుందీ? అయినా సరే సుధని ఓ మంచి చీర కొనుక్కోమంటాను। వాళ్ళిద్దరూ సినిమా కెళ్ళి ఎన్నాళ్ళైందో? రేపు ఆదివారం. వాళ్ళని వెళ్ళమంటాను. పిల్ల వెధవల్ని నా దగ్గరే వుంచుకుంటాను. వాళ్ళెందుకు? పానకంలో పుడకల్లాగ।।
అనుకుని, నవ్వుకున్నారు మంగమ్మగారు – దుప్పటి నిండుగా కప్పుకుంటూ। □



నంద్యాల (కిళాంబి) రాజకుమారి

శ్రీమతి నంద్యాల (కిళాంబి) రాజకుమారి భారతదేశమంతటా పలు నాట్య ప్రదర్శనలు ఇచ్చి పలువురి ప్రశంసలందుకున్నారు. ఆమె తల్లి దండ్రులు శ్రీ కిళాంబి కృష్ణమాచార్య, శ్రీమతి రుక్మిణిదేవి–ఇచ్చిన ప్రోత్సాహంతో తన ఐదవ ఏటనే గజ్జెకట్టి ఇప్పటివరకు దాదాపు 250 దాకా ప్రదర్శనలు ఇచ్చారు. కీ. శే. డాక్టర్ రాధాకృష్ణన్, ప్రెసిడెంట్ నీలం సంజీవరెడ్డి వంటి ప్రముఖుల ప్రశంసలు అందుకున్నారు. రాజకుమారి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ అధ్వర్యాన నిర్వహించబడిన అఖిలభారత కూచిపూడి నాట్య పోటీలలో ప్రథమ బహుమతి పొంది 'నాట్య విశారద' బిరుదాన్ని అందుకున్నారు. నాట్యంలో కేంద్రప్రభుత్వ స్కాలర్‌షిప్ పొందిన తొలి వనిత రాజకుమారే కావడం విశేషం.

శ్రీమతి రాజకుమారి కేవలం నాట్యకారిణి మాత్రమే కాక రచయిత్రి కూడా. ఆమె రచించిన 'అశ్వఘోషుడు', 'ఆచార్య నాగార్జున', 'స్వప్నవాసవదత్త' వంటి నాటకాలు, 'జీవితమే మధురం', 'భరతనాట్య విశిష్టత', 'ఆశాసౌధాలు'–ఇతర కథలు, గేయాలు వివిధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి. శ్రీమతి రాజకుమారి భర్త శ్రీ నంద్యాల హరినాథ్ విజయవాడ లయన్స్ క్లబ్ అధ్యక్షుడుగా, సంగీత, నాటకరంగాల అభివృద్ధికి పాటుబడిన వ్యక్తిగా పేర్కొనదగినవారు.

జాన్ డగ్లస్ హాన్స్‌ఫర్డ్ అనే అతను లండన్ నగరంలో పోస్ట్‌మాన్‌గా పన్జే స్తున్నాడు. అతన్ని ఒక రోజు లండన్ పోలీసులు 'ఆడపిల్లల కళ్ళజోళ్లు దొంగ తనం చేస్తున్నాడు' అన్న నేరం మీద అరెస్ట్ చేసి కోర్టులో హాజరుపరచారు. అత నింతవరకూ ముప్ఫై ఎనిమిది అమ్మా యిల కళ్ళజోళ్లు లాక్కున్నాట్ట. ఒక్కోసారి కళ్ళకి నల్లటి గంతలు కట్టుకుని కత్తితో బెదిరించి మరీ కళ్ళజోడు లాక్కునేవాట్ట! ఓసారైతే ఓ అమ్మాయి కళ్ళజోడు పట్ట పగలే వాళ్ళింట్లోకి జొరబడి మరీ లాక్కు న్నాట్ట. అతని మీద మరే ఆరోపణ లేక పోయేసరికి కోర్టువారు—'ఇలా ఎందుకు చేస్తున్నావు ఇతర విషయాల్లో మంచివాడా' అని అడిగార్ట. 'ఏమో నాకు తెలియదు. అయితే ఎందుకోగాని కళ్ళజోడు ధరించిన అందమైన అమ్మాయిలంటే నాకు ఓ విధ మైన ఇష్టం' అన్నాట్ట. కోర్టువారు అతనిది 'అదొకరకం మనస్తత్వం'గా భావించి మూడేళ్ళపాటు 'ఉద్యోగంలో వుండద్దు నాయనా చికిత్స చేయించుకో' అన్నార్ట. తీరా మనస్తత్వ శాస్త్రజ్ఞుడి దగ్గరకెళ్ళేసరికి అతగాడి 'పిచ్చి' పోవాలంటే కనీసం ఐదేళ్లు పడుతుందన్నాట్ట. పాపం జాన్ డగ్లస్ హాన్స్‌ఫర్డ్!

ఇంతకీ ఆ ముప్ఫై ఎనిమిది మంది అమ్మాయిలూ ఏమనుకుంటున్నారో తెలుసా– 'పోతే పోయింది వెధవ కళ్ళజోడు... నేను అందమైన అమ్మాయినన్న మాట!' అని మురిసిపోయారుట.

ఫ్రాన్స్ రాజధాని అయిన పారిస్ నగరంలో ఓ దంపతులున్నారు. వాళ్లిద్దరికీ మాటామాటా వచ్చి విడాకులు తీసుకుని విడిపోవడానికి నిశ్చయించుకున్నారు. అలా విడిపోవాలనుకోవడంలో వారికెలాటి భేదాభిప్రాయం రాలేదుగానీ ఓ విష యంలో మాత్రం ఇద్దరికీ మాచెడ్డ భేదాభిప్రాయం వచ్చేసింది. దాంతో కోర్టు కెక్కారు! ఇంతకీ గొడవేమిటీ అంటే వాళ్ళిద్దరూ కలిసి వున్నప్పుడు ముచ్చట గొలిపే ఒక చిన్నారి బొచ్చు కుక్కపిల్లని పెంచుకున్నారు. ఇప్పుడా కుక్కపిల్ల 'నాక్కావాలంటే నాక్కావాలని' కీచులాడుకున్నారు. అదీ సంగతి. వారి కథంతా విన్న న్యాయమూర్తి—కుక్కపిల్లని ఆ యువతికి అప్పగించి అతగాడు నెలలో రెండు వారాంతాలు (అంటే వారంలోని చివరి రోజులన్న మాట) వచ్చి కుక్కపిల్లని చూసిపోవచ్చని తీర్పు చెప్పాట్ట. ఆ కుక్కపిల్ల పుణ్యానైనా మాజీ భార్యాభర్తలు కలుసుకుంటూ వుంటే ఎప్పటికైనా మళ్ళీ ఒకటవుతారని ఆ జడ్జి గారి అభిప్రాయమో....ఏమో!!

మన దేశంలోగానివ్వండి–మరే దేశంలో చక్కాపోయాడు. అతను చేసిన ప్రచారం నైనా గానివ్వండి మగబుద్ధి మగ బుద్ధే అని తలకెక్కిన ఆ అమ్మాయి బంధువులు నిరూపించాడో 'మహానుభావుడు' ఈమధ్య రాబందుల్లా ఆ అమ్మాయిని, వారి కుటుం అమెరికాలోని డెట్రాయిట్ నగరంలో. బాన్నీ నానా మాటలతోనూ పొడిచి వెలివేసి అక్కడ అతగాడు అమెరికాలో స్థిరపడిన నట్లు చూడసాగారు. దాంతో దుఃఖమండిన ఒక సిసిలియన్ యువతిని వివాహం చేసు ఆ అమ్మాయి తరపువారు కోర్టు కెక్కారు. కున్నాడు. శోభనం రాత్రినాడు 'ఈ అమ్మాయి శ్రీ కోర్టువారు న్యాయంగా న్యాయ విచారణ మంచిదికాదు. అసలు 'కన్య' కానేకాదు' జరిపి సదరు పెళ్ళికొడుకు చేసిన పనికి అంటూ ఆ అమ్మాయి శీలంపై పెద్ద ఆ అమ్మాయికి అతగాడు ఇరవై లక్షల అభాండం మోపాడు. అంతటితో పూరు రూపాయలు నష్టపరిహారం చెల్లించాలని కున్నాడా....ఆ పిల్లని కాస్తా మామగారింటి తీర్పు ఇచ్చారు. ఇలాంటి న్యాయమూర్తులు ముంగిట్లో దిగవిడిచి తన దారిన తాను అన్ని దేశాల్లోనూ వుంటే ఎంత బాగుండును!

# సరిగతులూ సమాచారాలూ

బర్మింగ్‌హామ్‌లో ఆర్చీ బీస్లీ అనే అతను వున్నాడు. ఏభై ఏడేళ్ళవాడు. దిట్టంగా, ఆరోగ్యంగా వుంటాడు. "అయ్యా, ఏమిటండీ, మీ ఆరోగ్య రహస్యం?" అని ఎవరైనా అడిగినా, అడక్కపోయినా అతను గట్టిగానే చెబుతాట్ట. ఏమని? "నేను రోజూ ఒక బతికిన కప్పను తింటాను", అని! గత నలభైఆరు ఏళ్లగా అలా అతను రోజూ ఒక చిన్న సైజు కప్పను పట్టుకుని, దాన్ని అలాగే నోట్లో వేసుకుని మింగేస్తున్నాట్ట! ఇప్పటికి పదిహేను వేల కప్పల్ని మింగిన ఈ 'సజీవ మండూక భక్షకుడు' — తొలిరోజుల్లో కూడా తనకేమీ కడుపులో బాధ కలగలేదనీ, ఈ విధానమే తనను ఆరోగ్యంగా వుంచుతోందనీ, బ్రతికినంతకాలమూ కప్పల వేట మాననని అన్నాట్ట!

నూట తొమ్మిది సంవత్సరాల శ్రీమతి రమోనా ఆగ్డిన్ ఫెర్నాండజ్ అనే బామ్మగారు గత క్రిస్టమస్‌నాడు తన కుమార్తెను చూడడానికి స్పెయిన్ దేశంనుంచి బ్యూనస్ ఏరిస్ నగరానికి వచ్చిందిట. అంతలో వింతేముంది?— అనుకుంటున్నారా? అక్కడే ఉంది అసలు సంగతి. సరిగ్గా నలభై సంవత్సరాల తర్వాత ఇప్పుడు తన చివరి కుమార్తె డెబ్భై ఎనిమిదేళ్ళ మెర్సిడిస్‌ను కలుసుకుంటున్నారన్నమాట. అదీ స్పెయిన్ దేశపు రాజు జాన్ కార్లస్ దయవల్ల. ఆమధ్య రాజప్రాసాదంలో జరిగిన విందులో ఆమె రాజుగారికి తన కోర్కెను తెలియబరచిందిట. ఇకనేం - 'రాజు తలుచుకుంటే టిక్కెట్లకు కొదవా', అన్నట్లు వెంటనే జాన్ కార్లస్ మహారాజావారు మన బామ్మగారికి విమానం టిక్కెట్టు ఏర్పాటు చేశారు. బ్యూనస్ ఏరిస్ విమానాశ్రయంలో ఆమెకు స్వాగతం పలకడానికి ఆమె కుమార్తెతో పాటు ఎనిమిదిమంది మనమలు, పద్నాలుగుమంది ముని మనములు, ముగ్గురు ముని - ముని మనమలు ఇలా ఏభైమందిదాకా బంధువర్గం గుమిగూడారట. అంతమంది స్వజనులను ఒక్కసారిగా చూసేసరికి శ్రీమతి రమోనా ఆగ్డిన్ ఫెర్నాండజ్ బామ్మబామ్మగారు ఆనంద పరవశం చెందారట!



అనుకున్నది జరిగితే నీలాలు సమర్పిస్తామనో, నిలువుదోపిడి ఇస్తామనో, హుండీలో కానుక వేస్తామనో మొక్కుకోవడంలో ఆశ్చర్యం లేదు. కాని ఇటీవల జరిగిన ఎన్నికల పర్వంలో - తమిళనాడు శివకాశిలోని సాత్తూరు రోడ్డులో నివసించే జోసెఫ్ అనే ముప్పైనాలుగేళ్ళ వివాహిత యువకుడు ఓ వింత మొక్కు మొక్కుకున్నాడు. జోసెఫ్—అఖిల భారత అన్నా ద్రావిడ మున్నేట్ర కళగం (ఎ. ఐ. ఎ. డి. ఎమ్. కె) సభ్యుడు. ఈ ఎన్నికలలో తమ నియోజకవర్గంలో తమ పార్టీ సభ్యుడు గెలిస్తే స్థానిక చర్చిలోని 'మాత'కి తన ఎడమచేతిని మణికట్టు దాకా సమర్పించుకుంటానని మొక్కుకున్నాట్ట. ఎన్నికల ఫలితాలొచ్చాయి. ఈసారి ఎన్నికలలో ఎ. ఐ. ఎ. డి. ఎమ్. కె.కి మొత్తం మీద రెండు సీట్లు మాత్రమే దక్కాయి. చెప్పొచ్చేదేమిటంటే ఆ గెలుపొందిన ఇద్దరు అభ్యర్థులలో శివకాశిలో నిల్చున్న 'నల్లవన్' (అంటే మంచివాడు అని అర్థం) సౌందర్‌రాజన్ కూడా వున్నాడు. 'మంచివాడు' కాబట్టి జోసెఫ్ మాట నిలబెట్టటం కోసమే నెగ్గినట్లుగా నెగ్గాడు. దాంతో ఆడిన మాట తప్పని జోసెఫ్-చర్చికి వెళ్ళి తన మొక్కు తీర్చుకున్నాట్ట. మరీ మొండి చేత్తో రక్తం కారుతూ తిరిగితే ఇదేమిటని అనుమానం రాదూ? అంచేత ఆ 'ఖండిత హస్తం' కూడా తీసుకుని పోలీస్‌స్టేషన్ కెళ్ళి జరిగిన సంగతి జెప్పాట్ట. ఆ అపర 'సత్య హరిశ్చంద్ర శిబి చక్రవర్తి'ని పోలీసులు అసుపత్రిలో జేర్చి 'నీ చెయ్యి నువు కోసుకున్నా మా దర్యాప్తు మేం చెయ్యక మానం' అంటూ 'దర్యాప్తు' చేస్తున్నార్ట.

కొసమెరుపు: అయితే, ఇప్పుడా 'మంచివాడు' సౌంధరరాజన్ ప్రాభవంలో కాస్తున్న ప్రత్యర్థి పార్టీ అయిన డి. ఎం. కె. లో చేరిపోయాట్ట! మరి ఈ జోసెఫ్ మాటేమిటి? అతగాడి చెయ్యి మాటేమిటీ అని?

# స్త్రీకి స్వేచ్ఛ ఎప్పుడు?

## — 'జయ' —



డియర్ శాంతి,

నీ శ్రీవారు మీ పిల్లలు చదివే స్కూలు వార్షికోత్సవానికి వెళ్ళవద్దన్నారని వ్రాసిన విషయం నన్ను చాలా బాధించింది. స్కూలు వార్షికోత్సవానికి వెళ్ళటానికే యిష్టపడని శ్రీవారు నీకెంత స్వాతంత్ర్యం యిస్తున్నారో వూహించుకోగలను. అయినా నన్ను సంతోషపరిచిన విషయం—"నువ్వు నీ శ్రీవారి అధికారాన్ని, ఆధిక్యతను నిరసించటం." ఈ వర్గభేద దోపిడీ సమాజంలో మనకు జరుగుతున్న అన్యాయాల్ని మనం ఇప్పుడిప్పుడే గుర్తించి, వాటిని వ్యతిరేకిస్తున్నాం. అంటే క్రిందటి తరం స్త్రీకన్నా ఒక్క అరంగుళం మనం ముందున్నామన్నమాట.

సంఘ సంస్కర్తగా 'వితంతు వివాహాల్ని' ప్రోత్సహించిన వీరేశలింగంగారు రోడ్డు మీద నడిచి వెడుతుంటే రాళ్ళు విసిరేవారట. విచిత్రం ఏమిటంటే అలా రాళ్ళు విసిరిన వాళ్ళల్లో స్త్రీలు కూడా వున్నారుట. సతీ సహగమాన్ని నిరశించి బెంటింగ్ సహాయంతో దానికి వ్యతిరేకంగా చట్టాన్ని ప్రవేశపెట్టిన రాజా రామ్మోహన్‌రాయ్ తల్లి చేతనే వెలివేయబడ్డాడు. చలం రాసిన రచనల్ని పురుషులే కాకుండా చాలామంది స్త్రీలు కూడా వ్యతిరేకించారు. విచిత్రం చూశావా! వాళ్ళందరూ స్త్రీ సమస్యల పరిష్కారం కోసం కృషి చేసి వారిచేతే వ్యతిరేకించబడ్డారు. తన సమస్యలు, తన సమస్యా పరిష్కారాలు తెలుసుకోలేని అజ్ఞానంలో సాంప్రదాయపు మత్తులో సమాజపు పక్షపాత విలువలలో కూరుకుపోయి వుంది స్త్రీ. ఆ తరంలో స్త్రీ తన సమస్యలు పరిష్కారం చేసుకోవాలంటే గురజాడ రచించిన పూర్ణమ్మ లాగానో, కన్యకి లాగానో ఆత్మహత్య చేసుకోవాలి తప్ప మరే మార్గం లేదు.

ఈనాటి మహిళా సమాజాల సంఖ్య చూసి నువ్వు ఈనాడు మనం చాలావరకు ప్రగతి సాధించాం అనుకోవచ్చు. ఆ సమాజాల్ని స్థాపించింది, నడిపేదీ స్త్రీలే అయినా, వారి వెనుక వున్న పురుషుల చెయ్యి లేకపోతే ఆ సమాజాలు నడవవు చూశావా! స్త్రీలే కాకుండా మహిళా సమాజాలు సహితం పురుషులు మీద ఆధారపడివలసి వస్తోంది.

ఇవన్నీ ఆలోచిస్తే నాకొకటే అనిపిస్తోంది. అదేమిటంటే స్త్రీకి ఆర్థికంగా ఈ సమాజంలో ఒక సుస్థిరమయిన స్థానం లేదు. ఆమె తన ప్రతి అవసరానికి మగవారి మీద ఆధారపడి వుండాలి. అందుకే అతడు చులకనగా చూచినా, ఆ అసహ్యతని, ఎగతాళిని భరించగలగాలి తప్ప మార్గాంతరం లేదు.

నీకే గనుక ఒక స్థిరమయిన వుద్యోగం వుండి వుంటే నీ శ్రీవారు అలా ప్రవర్తించి వుండేవారు కాదు. తను గనుక విపరీతంగా ప్రవర్తిస్తే, తన ప్రవర్తనవల్ల విసిగి భార్య విడిపోయి (విడాకులు తీసుకుని) స్వతంత్రంగా బ్రతకగలదనే సత్యం అతన్ని నొక్కిపెట్టి వుంచుతుంది. దానితో అతను మర్యాదగా భార్య దగ్గర ప్రవర్తించటం నేర్చుకుంటాడు. బానిసత్వం నుంచి స్త్రీకి పరిష్కారం కావాలంటే ఆర్థికంగా ఆమె ఒక స్థానం సంపాదించుకోవాలి.

ఇట్లు
నీ స్నేహితురాలు
'మిసెస్ ఆనందం'

"ఏమిటోయ్ నీ వుత్తరం రాయటం యింకా అవలేదా" బూటు లేసులు బిగించుకుంటూ అడిగాడు ఆనందం.

"ఇదిగో అయిపోయింది. వచ్చేస్తున్నాను" కవరుపైన అడ్రసు రాస్తూ అన్నది భారతి.

ఆ రోజు మహిళామండలిలో తనిచ్చే వుపన్యాసం తాలూకు కాగితాలు బేగ్‌లో పెట్టుకుని "ఈ రోజు ఆలస్యం అయిపోయింది. ఈపాటికి కార్యక్రమం మొదలు పెట్టేసి వుంటారు" అనుకుంటూ కారు డోర్ తీసుకుని లోపల కూర్చుంది.

"ఇదేమిటి ఇటువైపు తీసుకు వెడుతున్నారు? నన్ను మహిళామండలి దగ్గర డ్రాప్ చేసి మీరు క్లబ్బుకి వెడతానన్నారు కదా ప్రొద్దుట." ఆశ్చర్యంగా భర్త మొహంలోకి చూస్తూ అన్నది.

"ప్రొద్దుట అలా అన్నాను. కాని సాయంత్రం రాధాకృష్ణ ఇంటిలో పార్టీ వుందని యిప్పుడు జ్ఞాపకం వచ్చింది." తాపీగా సిగరెట్టు అంటిస్తూ అన్నాడు ఆనందం.

"మరి నా కెందుకు చెప్పలేదు రాధాకృష్ణ ఇంటికి వెడుతున్నామని?" కోపంగా అన్నది.

"డియర్ కోప్పడకు. నీకెలాగు తెలుస్తుంది కదా అని చెప్పలేదు" నవ్వాడు ఆనందం.

"పార్టీకి వెళ్ళటం మీకిష్టమయితే మీరెళ్ళండి. యివాళ మహిళామండలిలో మీటింగ్ వుంది. నేను వెళ్ళాలి. నాకు పార్టీకన్నా మీటింగ్ ముఖ్యం" ఆమెలో పౌరుషం బుసలుకొడుతోంది.

"చూడు డియర్ నీకేది ముఖ్యమో, నువ్వెక్కడికి వెళ్ళాలో నాకు తెలుసు. అనవసరంగా వాదించకు." కారుని రాధాకృష్ణ యింటి ముందు ఆపుతూ చిరాగ్గా అన్నాడు ఆనందం.

పార్టీలోనే మిసెస్ వీరేశం, మహిళామండలి ప్రెసిడెంట్ కన్పించినా భారతి ఆశ్చర్యపోలేదు. బహుశ ఆమె కూడా తనలాగే వచ్చి వుండవచ్చు. తను శాంతికి ఏం రాసింది? ఆడదానికి ఆర్థికసుస్థిరత వుంటే చాలు స్వేచ్ఛ వస్తుంది అంది. కానీ తను వుద్యోగం చేస్తోంది. ఆర్థికసుస్థిరత పుష్కలంగా వుంది. కానీ తనకి స్వేచ్ఛ వుందా? ఆర్థికసుస్థిరతే కాదు మరేదో వుండాలి అది ఏమిటి? ఆలోచిస్తూ వుండిపోయింది భారతి మనస్సు.

డియర్ భారతి,

నువ్వు వ్రాసినట్టు స్త్రీకి ఆర్థికసుస్థిరత వుంటేనే సరిపోదు. సమాజం ఆమెని కాకుండా, ఆమె సమాజాన్ని బహిష్కరించే ధైర్యాన్ని పెంచుకోవాలి. ఆమెకి సాయం చెయ్యటానికి, ఈ పక్షపాత సమాజం నుండి ఆమెని రక్షించటానికి ఏ చలమో, ఏ వీరేశలింగమో, ఏ రాజారామ్మోహన్‌రాయో వస్తారనుకోవటం భ్రమ. ఒకవేళ వచ్చినా, వాళ్ళు ఏదయినా సమస్య పరిష్కారం చెయ్యటానికి ప్రయత్నించినా అది తాత్కాలికం మాత్రమే అవుతుంది–స్త్రీ ఎదగనంతవరకు — ఎదిగి సమస్యల్ని, సమాజాన్ని అర్థం చేసుకోనంతవరకు.

నువ్వు వుద్యోగం చేస్తున్నావు. నీకు నీ భర్తకి పడనప్పుడు, నువ్వు నీ భర్త ఆధిక్యతను భరించలేనప్పుడు విడాకులు తీసుకుని అతన్నించి విడిపోగలవా? ఒకవేళ విడిపోయినా, సమాజపు అవహేళనల్ని భరించలేక భర్త దగ్గర బానిసగా అతని ఆధిక్యతని, అధికారాన్ని భరించడమే మంచిదిగా, రక్షణగా, మెరుగ్గా వున్నట్టు తోస్తుంది.

"ఈ శతాబ్దపు స్త్రీ ముందుకు కదిలింది" అన్నావు. అది ఒట్టి భ్రమ మాత్రమే. నిజం చెప్పాలంటే ఈ స్త్రీ యింకా దిగజారిపోయింది. ఆదిమానవుల కాలంలో స్త్రీ భర్తతోపాటు సమానంగా వేటాడేది. యిద్దరూ కలిసి తమ పనుల్ని కలిసి చేసుకునేవారు. అప్పుడు వర్ణభేదం లేదు. పక్షపాత వైఖరిలేదు. అప్పటికన్నా స్త్రీ యిప్పుడే దిగజారిపోయింది. స్త్రీకి శత్రువు ఒక్క మగవాడే కాదు. ప్రకృతి, సమాజం ఆమెని కాటేయటానికి నిశ్శబ్దంగా కాచుకుని వున్నాయి.

ఒక స్త్రీ వేదికపై 'మహిళాస్వేచ్ఛ' మీద వుపన్యాసం యిస్తుండవచ్చు. కాని ఆమె ఆ వుపన్యాసం యివ్వటానికి భర్త అనుమతికోసం నాలుగు రోజులు బ్రతిమిలాడి వుండవచ్చు. మగవాడు అవసరమున్నా, లేకపోయినా తన ఆధిక్యత నిలుపుకోటానికి ప్రయత్నిస్తుంటాడు. అందుకే ముందు చూపుగా 'పతివ్రతల కథలు' వ్రాసి అవి స్త్రీలకి ప్రామాణిక గ్రంథాలుగా నిలిపాడు. సాంప్రదాయపు విలువలు, సమాజపు పరిధులు ఆమె చుట్టూ నిలిపాడు.

ఎక్కడయితే ఒక సంస్థగాని, ఒక మనిషిగానీ తన ఆధిక్యతను నిరూపించుకోటానికి, నిలబెట్టుకోటానికి ప్రయత్నిస్తుంటారో అక్కడే అసమానత, అల్లకల్లోలం వంటివి పుడతాయి. నీకు తెలుసు జర్మన్లు, జపానీయులు తమ ఆధిక్యత ప్రపంచంలో నిరూపించుకోటానికి ప్రయత్నించి ప్రపంచ యుద్ధాలు తెచ్చారు. అలాగే పురుషుడు ఆధిక్యతకోసం చేసే ప్రయత్నాలే ఈ అసమానతలకి నాంది. "ఎక్కడయితే ఈనాడు అణచే పరిస్థితి వుందో అక్కడ విప్లవశంఖారావం విన్పిస్తుంది" ఈనాడు స్త్రీ ఎంతగా అణచబడుతోందో అంతగానూ ఆమె లేస్తుంది. ఈ సంఘం ఆమెని కాకుండా ఆమె ఈ సంఘాన్ని వెలివేసి తన సమాన హక్కుల్ని స్వాధీనపర్చుకుంటుంది. ఆ రోజు కోసం, ఆ తరం స్త్రీకోసం మనం ఎదురు చూస్తూ వుందాం.

ఇట్లు
నీ స్నేహితురాలు
శాంతి

"సమాజాన్ని ఎదిరిద్దాం, ఆ తరం స్త్రీకోసం ఎదురుచూద్దాం" అన్న శాంతి ఈ కట్టుబాట్లని ఎదిరించి, కులాంతర వివాహం చేసుకువచ్చిన తన చెల్లెల్ని, భర్తని, సమాజాన్ని కాదని ఆదరించలేకపోయింది.

ఈ పరిస్థితి యింతేనా? ఇలా సాగుతూ వుండాల్సిందేనా? తన స్వేచ్ఛానుసారం వర్తించే రోజు ఆమెకి ఎప్పుడు వస్తుంది? యిన్ని రోజులు మరోతరం స్త్రీ కోసం ఎదురు చూసి, తీరా ఆమె వచ్చాక ఆమెని ఆహ్వానించి ఆదరించలేకపోయిన ఈమె ఎంత పరాధీన.

□

# ప్రశ్నలు జవాబులు




**ఉషారాణి, గుంతకల్**

షాల్‌కోసం డబుల్ మేటీ క్లాత్‌కి పోగులు తీసి, అవే పోగులతో పువ్వులు వేస్తున్నారని తెలిసినది. వేసే పద్ధతి మీకు తెలిస్తే వివరించగలరు.



డబుల్ మేటీ క్లాత్ షాల్ అందంగా వుంటుంది. పోగులు తీసి వుంటుంది కాబట్టి చాలా జాగ్రత్తగా ఉపయోగించుకోవాలి. షాల్‌కు 1½ మీ. గుడ్డ కావాలి. రెండు గళ్ళు వదలి రెండు గళ్ళు పోగులు తీయాలి. ఇవి తెగకుండా మొదలు, తుది బ్లేడ్‌తో కత్తిరించి పోగు లాగాలి. ఈ పోగుతోనే 4 పారలతో పెద్ద సూదితో పువ్వు కుట్టుకోవాలి. 2 గళ్ళంటే 8 పారల దారం వుంటుంది. నిలువు పోగుల పొడవుతో ఒక పువ్వు, అడ్డం పోగు పొడవుతో 2 పువ్వులకు సరిపోతాయి. గుడ్డంతా ఒకేమారు పోగు తీస్తే కలిసిపోయే ప్రమాదం వుంది. అందుకే కొంచెం తీసి, పువ్వులు కుట్టి మరికొంచెం పోగులు తీయాలి. పోగులు తీసిన తర్వాత చదరాలు వస్తాయి. 5 చదరపు గళ్ళలో ఒక పువ్వు వేయవచ్చు. ఒక పువ్వుకు 8 రేకులు వుంటాయి. ఒక్కొక్క రేకునకు 2 కుట్లు రావాలి. ఒక రేకు బొమ్మలో లాగ కుట్టుకొని, రెండవ మారు కూడా తిరిగి కుట్టుకొని, ఆ తర్వాత 2వ రేకునకు వెళ్ళాలి. మధ్య చదరం నుండి మొదలెట్టాలి. ముళ్ళు వెనకవైపున వుండాలి. ఇంకొక పువ్వు కుట్టుకొనేటప్పుడు మొదటి పువ్వు చివరి వరుస చదరాలు కలుపుకొని 5 వరసలు లెక్క తీసుకోవాలి. కొనలు ముందుగానే హెమ్ చేసుకోవచ్చు. లేదా ఫోటోలో లాగా పోగు కుట్టుకోవచ్చు. పువ్వులు కాకుండా వేరే డిజైన్ కావాలనుకొంటే నిలువు గీతలుగా పోగు కుట్టుకోవచ్చు. క్రాస్‌గా కుట్టుకోవచ్చు. బార్డర్‌కు మాత్రం పువ్వులు వేసి మధ్య భాగాన గీతలుగా, క్రాస్‌గా కుట్టుకోవచ్చు.



షాల్స్ మాట వచ్చింది కాబట్టి డెయిజీపువ్వుల షాల్ తెలియనివారికోసం చెబుతాను. బొమ్మలో చూపిన విధంగా డెయిజీ వీల్ కొనలకు ఒక్కొక్క దానికి 3 మార్లు వూల్ చుట్టుకొని ఆఖరున వూల్ సూదికి ఎక్కించి చుట్టూ గొలుసుకుట్టు వేసుకోవాలి. వీల్ నుండి తీస్తే పువ్వు చక్కగా తయారవుతుంది.

మనకెన్ని పువ్వులు కావాలో చూసుకొని ఒకదానికొకటి క్రోషియాతో కలుపుకోవాలి. ఇదెలా చేయాలో గత ఆగస్ట్ 'వనిత'లో చెప్పాను. పువ్వులకు ఒక రంగు, కలుపుకోటానికి ఇంకొక రంగు అయితే చాలా బాగుంటుంది. పువ్వులకు 2 రంగుల లోను బాగానే వుంటుంది. నలుపు, ఎరుపు, తెలుపుల కాంబినేషన్ చాలా బాగుంటుంది. అంతా అయిన తర్వాత చుట్టూ కుచ్చులు కుట్టాలి. ఇవి కూడా పూలన్నీ ఒకేమారు వేసుకోక కొన్ని వేసుకొని కలుపుకొని, తిరిగి మరికొన్ని వేసుకోవాలి. వీల్‌కు మధ్య నుండి మొదలెట్టి 6 మార్లు చుట్టుకోవాలి. కొసకు ముడివేసి సూదికి వూల్ ఎక్కించాలి. ఒక పువ్వుకు సుమారు 8 స్కేళ్ళ వూలు కావాలి.

## 'U' పిన్నుతో పువ్వులు

'U' ఆకారంలో వున్న పిన్నును తీసుకొని పువ్వులు అల్లుకొంటే చక్కగా వుంటాయి. బజారులో దొరికే ప్లాస్టిక్ పిన్నే కావాలని లేదు. ఇనుపకడ్డీని ఒక అంగుళం వెడల్పులో 'U' ఆకారంలో వంచి వూల్‌తో పువ్వులు అల్లుకొని, చీరలకు, పిల్లల లంగా, ఫ్రాకులకేగాక, టేబుల్ క్లాత్, డోర్‌కర్టెన్స్‌కు కూడ వేసి కుట్టుకోవచ్చు. పువ్వులు విడివిడిగా కాక పోయినా వీటిలోనే డిజైన్స్ ఏర్పాటు చేసుకొని అతకవచ్చు. పువ్వులాగ కాక పొట్టివే కావలసిన



పొడవులో అల్లుకొని ఆ కొన ఈ కొన కావలసిన గుడ్డ మీద వుంచి మిషన్‌తోగాని, చేతితోగాని కుట్టుకోవచ్చు. లేసు బార్డర్‌లాగ చక్కగా వుంటుంది. ఫోటోలో చూస్తే పువ్వులు అల్లే విధం తెలుస్తుంది.

U పిన్నుకు చుట్టూ ఒక రౌండ్ వూలువేసి ముడి వేయాలి. ముడి, మిగతా వూల్ మధ్యకు వుండేలా వుంచుకొని ఎడమవైపు పిన్నుపైన వచ్చిన వూలు గుండా క్రోషియాను పోనిచ్చి వూలులాగి అల్లాలి. 13వ నంబర్ ప్లాస్టిక్ సూది కావాలి. వూలును ఎడమవైపు నుండి పిన్ను పైగా తీసి పిన్నును త్రిప్పాలి. రింగులోనుండి సూదితీసి, తిరిగిపెట్టి ఎడమవైపు పైన వున్న వూలుగుండా సూదితో వూలు తీస్తే రెండు రింగులు వస్తాయి. వాటిగుండా తిరిగి వూలు తీయాలి తిరిగి ఎడమవైపు పిన్ను పైగా వూలును త్రిప్పాలి. ముందులాగానే తిరిగి అల్లాలి. ఊలు మాత్రం ప్రతిమారు ఎడమవైపు, పిన్ను మీదుగ తిప్పాలి. ఇలా సుమారు 25-30 కుట్లు అంటే – పిన్ను రెండు కొనల పైనా 25-30 మార్లు వూలు రావాలి. స్వెట్టర్ కుట్టే వూలు చేతి సూదికి వూలు ఎక్కించి పిన్ను ఒక వైపువున్న లూపుగుండా పోనిచ్చి పిన్ను నుండి వూలుతీసి బాగ లాగి ముడివేస్తే పువ్వులాగ వస్తుంది. తర్వాత రెండు దారం కొనలు కలిపి ముడివేయాలి. పెద్ద పువ్వు కావాలంటే పిన్ను మధ్య గ్యాప్ ఎక్కువగా వుండాలి. అప్పుడు 40-50 మార్లు అల్లుకోవాలి. పెద్ద పువ్వు కన్నా చిన్న పువ్వులయితేనే ముద్దుగా వుంటాయి. వీటితో షాల్ కూడ బాగుంటుంది.

## బాడ్మింటన్ స్టిచ్

ఫోటోలో చూపిన విధంగా రౌండ్‌గానే గాక రకరకాలుగా మనం కుట్టుకోవచ్చు. చీరలు, కర్టెన్లు, స్కర్ట్స్, ఫ్రాక్స్, పిల్లో కవర్స్....అన్నింటిమీదికి ఇది పనికి వస్తుంది. మామూలు ఎంబ్రాయిడరీ దారం రెండు పోరలతో తీసుకోవాలి. ఈ కుట్టుకు ఫ్రేమ్ తప్పనిసరి. ఫ్రేమ్ లేకపోతే సరిగ్గా రాదు. ముందు రెండుమార్లు బాగ లాగి కుట్టాలి. 1వ బొమ్మలో 1 దగ్గర క్రింది నుండి దారం పైకితీసి, 2 దగ్గర క్రిందికి వెళ్ళి పాయింట్ ఒక అంగుళం దూరంలో 3 దగ్గర పైకితీసి 4 దగ్గర క్రింది కెళ్ళాలి. ఇలాగ ఆ వరుస కుట్టాలి. తర్వాత 2వ బొమ్మలోలాగ అడ్డంగా కుట్టుకోవాలి ఈ రెండు మార్లు బాగ బిగించి కుట్టాలన్నమాట.




ఇప్పుడు కాస్త జాగ్రత్తగా పరిశీలించండి. 3వ బొమ్మలో చదరాల దగ్గర వున్న సున్నాలు గమనించండి. రెండు సున్నాల మధ్య నాలుగు భుజాలు వున్నాయి కద. సూదిలో దారం రెండు పోరలు తీసుకొని కుడివైపు భుజాలగుండా మొదట పైకి తీసికెళ్ళాలి. తర్వాత ఎడమ భుజాలగుండా








దిగాలన్నమాట. ఇలాగ అన్ని చదరాలకు రెండు వైపులా కుట్టుకొంటే అయిపోతుంది. ఈ చదరాలలో భుజాలకొనలు ఎలా వుంటాయి. అంటే....ఒక భుజానికి రెండుకొనలు అడుగున వుంటాయి, ఇంకొక భుజానికి కొనలు పైకి వుంటాయి. క్రింద వుండే సూది భుజం క్రింది నుండి వెళ్ళి భుజాన్ని పైకి లేవనెత్తాలి. పైకి వుండే, సూది పైనుండి వెళ్ళి భుజాన్ని అణగదొక్కాలి. కొంచెం కచ్‌వర్క్‌ను పోలి వుందికదూ; 4వ బొమ్మలో A నుండి మొదలెట్టి B వరకు ఎక్కాలి. C నుండి మొదలెట్టి D వరకు దిగాలి. ఫోటో చూస్తే కుట్టు ఎలా వుండేది తెలుస్తుంది. సిల్కుదారం పనికిరాదు. మామూలు దారంతోనే అందంగా వుంటుంది. పిల్లల లంగాలకు ఇలాంటి రౌండ్స్ 3, 2, 1 చొ॥న 5, 6 దగ్గర వేస్తే నిండుగా వుంటుంది. చాలా త్వరగా అయి పోతుంది. ఫ్రేమ్ ఉపయోగించడం మాత్రం మరచిపోకండి. అంతా అయిన తర్వాత చుట్టూ ఔట్ లైన్‌కు కాడకుట్టుగాని, గొలుసుకుట్టుగాని కుట్టాలి. అప్పుడే నిండుగా వుంటుంది. కుట్టు వెరైటీ కావాలనుకొనేవారు దీన్ని ఇష్టపడ్తారు.

వంటింటి శత్రువులు :




మన జనాభాకన్నా రోజురోజుకీ విపరీతంగా పెరిగిపోతున్నాయి బల్లి, దోమలు, ఈగలు వంటి కీటకాలు, పురుగులు తదితర ప్రాణులూ. ఇవన్నీ కూడా మనకి చికాకు కలిగిస్తూ హానికరంగానూ రోగకారకులుగానూ పరిణమిస్తున్నాయి. ఇవన్నీ ఎక్కువగా వంట ఇండ్లోనే మకాం ఏర్పాటుచేసుకుంటాయి—ఆహార పదార్థాలు అక్కడే వుంటాయి గనక; వాటికోసం వచ్చే క్రిమి కీటకాలు అక్కడే మసల్తూ వుంటాయి గనక. అందువల్లనే వీటిని 'వంటింటి శత్రువులు' అంటున్నాం. ఇలా మన ఇళ్లల్లో ఏ మాత్రం 'అద్దె' చెల్లించకుండా, పైపెచ్చు 'రోగం' తెచ్చిపెడతామని బెదిరిస్తూ జీవించే జీవులు చాలా వున్నాయి.

వాటి పుట్టు పూర్వోత్తరాలేమిటి? వాటిని ఎలా పోగొట్టవచ్చును? నిజంగా వాటిల్లో అన్నీ హానికరమేనా?.... లేక కొన్నిటి విషయంలో (ఉదా: బల్లి) మనం కేవలం లేనిపోని అనుమానాలతో భయపడుతూ హానికరం అనుకుంటున్నామా?— ఈ వివరాలన్నీ పాఠకులకు తెలియబరచడమే ఈ శీర్షిక ముఖ్యోద్దేశం.

ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో నివసించే బల్లులు 1500 రకాలదాకా వున్నాయిట! వీటన్నిటినీ ఒకచోట చూడగలిగితే - వివిధ సైజులలో, ఆకారాలతో, రంగులతో, అలవాట్లతో ఒకే జాతికి చెందిన బల్లులు ఇన్ని వున్నాయా అని ఆశ్చర్యం కలుగుతుంది. ఇవన్నీ కూడా 'లాసెర్టిలియా' అన్న జాతికి చెందినవి. వీటిల్లో కొన్ని రెండు మూడంగుళాల పొడవు నుంచి 10, 12 అడుగుల పొడవైన రాక్షస బల్లులవరకూ వున్నాయి. ఇవి శీతల ప్రాంతంలో తప్ప తక్కిన ప్రదేశాలన్నిటిలోనూ నివసిస్తాయి.

పాకుడు జంతువులు (Reptiles) అన్నిటిలాగే ఇవీ శీతల రక్తం కలవి. వీటిలో కొన్ని ఒకే సమయంలో 1 నుంచి 20 దాకా గ్రుడ్లు పెడతాయి. పాముల్లాగే వీటిమీద కూడా పొలుసుల్లా వుంటాయి. మధ్య మధ్యలో ఇవీ తమ చర్మం పైన గల పలచటి కోటింగ్‌ని విడిచి పెడుతూ వుంటాయి.

సాధారణంగా మనం ఇళ్లల్లో చూసేవి గెక్కో జాతికి చెందినబల్లులు. ఇవి ఉష్ణప్రదేశాలలో అధికంగా కనిపిస్తాయి. నున్నగా ఉండే గోడల మీద, పైకప్పు మీదా ఇవి తమ కాళ్ళ అడుగునగల ప్రత్యేకమైన ప్యాడ్స్ సహాయంతో తిరుగుతూ వుంటాయి. బల్లి మాంసాహారి. ఇళ్ళల్లో కనిపించే పురుగులు, కీటకాలను పట్టి తింటుంది.

## బల్లి శత్రువుల బారి నుంచి ఎలా తప్పించుకుంటుంది?

బల్లికి విచిత్రమైన అలవాటు వుంది. శత్రువు తనని వెనకనుంచి అటకాయించినప్పుడు వెంటనే అది తన తోకని విసర్జిస్తుంది. వెన్నెముకకి గల రెండు కీళ్ళనుంచి ఈ తోక విడివడుతుంది. ఇలా విసర్జింపబడిన తోక భాగం కొంతసేపటివరకూ ప్రాణం వున్నదానిలా కొట్టుకుంటుంది. ఇందువల్ల శత్రువు దృష్టి తోక మీదికి మళ్ళుతుంది. ఆ తోక ఆరగించడంలో శత్రువు నిమగ్నమై వుండగా బల్లి తప్పించుకుపోవడానికి అవకాశం లభిస్తుంది. అయితే అలా తోక పోగొట్టుకోవడంవల్ల బల్లికి కలిగే ప్రమాదం కాని నష్టంకానీ ఏమీ వుండదు. నిదానంగా దానికి మళ్లీ తోక పెరుగుతుంది.

## బల్లి మీద పడితే కీడు సంభవిస్తుందా?

బల్లి మీద పడితే కీడు సంభవించడం అన్నది కేవలం మూఢనమ్మకం మాత్రమే. బల్లి కుడికాలి మీద పడితే ఇలా అవుతుంది; బల్లి ఎడమ చెవి కొస మీద పడితే అలా జరుగుతుంది అని పంచాగ శాస్త్రజ్ఞులూ తదితరులూ ఘోషిస్తున్నారు. కాని అందులో నిజానిజాలు ఎవరూ పట్టించుకోవడం లేదు. కారణం అది అనాదిగా వస్తున్న ఆచారం. అందుకని ఈ దోషాలు పోగొట్టుకోవాలంటే కంచి వంటి ప్రదేశాల్లోని దేవాలయాల్లో బంగారు, వెండి బల్లులు వుంచి వాటిని ముట్టుకుంటేచాలు పోతాయి అంటున్నారు. అయితే ఒకటుంది. బల్లి మీద పడడం కాదు గానీ అది మూత్రవిసర్జన చేసిందంటే కొన్ని రసాయనిక పదార్థాల వల్ల ఆ ప్రాంతం వాచడం, ఉబ్బడం వంటివి జరుగుతాయి. అదేమంత ఘోర ప్రమాదం కాకపోయినా అలాంటప్పుడు వైద్యుడికి చూపించడం మంచిది.

## బల్లి విషతుల్యమా?

బల్లి విషపూరితమైనదని అనుకుంటాం గాని అది నిజం కాదు. ఇసుక ప్రాంతాలలో కనిపించే స్కింక్స్ అనే బల్లిలో వైద్యానికి ఉపయోగపడే పదార్థాలు వున్నాయట. అరబ్బులు నేటికీ మందుల తయారీలోనూ ఆహార పదార్థాలలోనూ బల్లులను ఉపయోగిస్తున్నారు.

బల్లి చచ్చిపడితే ఆ ఆహారం విషపూరితమనే అపోహ, మూఢ నమ్మకం మనలో పాదుకుపోయి

వున్నాయి. ఆ ఆహారం తిన్నవారికి ప్రాణాపాయం కలుగుతుందని కూడా ప్రచారంలో వుంది. కాని ఇది నిజం కాదని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. బల్లి పడిన ఆహారం తినడం వల్ల ఎటువంటి ప్రాణాపాయమూ కలగదనీ, మనుష్యులకి హాని కలిగించే ఎటువంటి విష పదార్థమూ బల్లిలో లేదనీ ఇది కేవలం అనుమానం మాత్రమేననీ అనాదిగా సంఘంలో పాదుకుపోయిన ఒక అర్థంలేని అపోహ అనీ - వారు చెబుతున్నారు.

అందుకే బల్లి చచ్చిపడిన ఆహారం తిన్నవారు ఆ విషయం తెలియకపోతే ఏమీ కారు. సుష్టుగా భోంచేసినవాళ్ళు కూడా ఆ తర్వాత హాయిగా వున్నా 'మీరు తిన్న ఆహారంలో బల్లిపడింది' అని చెబితేచాలు - గింగురెత్తిపోయి, వాంతులు చేసుకుంటారు. కొందరు భయంతో స్పృహ కోల్పోతారు కూడా. ప్రాణం పోతున్నదన్నంత హంగామా చేస్తారు మరికొందరు. ఇవన్నీ కూడా మానసిక భయాందోళనల వల్ల కలిగిన లక్షణాలే కానీ, బల్లి పడడం వల్ల కలిగిన లక్షణాలు కానే కాదని శాస్త్రజ్ఞుల వాదం.

ఈ విషయంపై ప్రముఖ వైద్యుల అభిప్రాయం ఇలా వుంది - "బల్లులలో విషతుల్యమైన జాతులు రెండే రెండు వున్నాయి. అవి హెలోడెర్మా, జిలామాన్‌స్టర్ జాతికి చెందినవి. ఇవి పశ్చిమ మెక్సికోలోని ఎడారుల్లోనూ, అమెరికాలోని మారుమూల ప్రాంతంలోనూ వున్నాయి. ఇటువంటి బల్లులు మన దేశంలో లేనేలేవు. అంచేత భారత దేశంలో వున్న బల్లులలో అది ఏ రకానికి చెందినదైనా విషపూరితం కాదు అని నిశ్చయంగా చెప్పవచ్చు."

కొన్ని దేశాలలో పాములను వండుకు తిన్నట్టే బల్లులను కూడా తింటారట! అందువల్ల బల్లి ఆహారంలో పడితే కంగారుపడకుండానూ, ఒకర్ని కంగారు పెట్టించకుండానూ వుంటే చాలు. ఒకవేళ అలా పడడం అంటూ జరిగితే పారిశుభ్రత దృష్ట్యా ఆ ఆహారం పారెయ్యండి. అలాగే బల్లి మీద పడితే వచ్చే నష్టమూ ఏమీ లేదు; కంగారు పడిపోయి కంచికి పరుగెత్తవలసిన అవసరమూ లేదు. అయితే ఒకటి వుంది - మన యిళ్లలో, వంటిళ్లలో ఇలాంటి జంతువులు సంచరించడం మొత్తానికి శ్రేయస్కరం కాదు. 'అవి మనకి హాని కలిగిస్తాయా లేదా' అన్న మాట అలా వుంచి, ఆహారం తయారయే వంటగదిలో ఇవి మసలడం మాత్రం మంచిదికాదు. □



# వైద్య విశేషాలు

'మలేరియా' జ్వరాన్ని నిరోధించడానికి ఉపయోగపడే వాక్సిన్‌ను హవాయ్‌లోని జాన్. ఎ. బెర్న్‌స్కూల్ ఆఫ్ మెడిసిన్‌లో పని చేస్తున్న భారతీయ వైద్య శాస్త్రజ్ఞుడు డా॥ వాసిమ్ ఎ. సిద్దికి కనుగొన్నారు. ఈ వాక్సిన్‌ను కోతులపై ప్రయోగించగా మంచి ఫలితాలు కనిపించడంతో, ఇప్పుడు దీన్ని మలేరియా రోగులపై ప్రయోగిస్తున్నారు. మలేరియా వాక్సిన్‌ను కనుగొనడం వైద్య శాస్త్రంలోనే ఒక విశేషమైన అంశంగా - వైద్య రంగంలోని ప్రముఖులు భావిస్తున్నారు.

*

కుటుంబనియంత్రణకు గుళిక (పిల్) కంటే శ్రేయస్కరమైన విధానం మరొకటి లేదని ఇటీవల ఢిల్లీలో జరిగిన అంతర్జాతీయ వైద్య శాస్త్రజ్ఞుల సదస్సులో - స్వీడన్‌లోని కరోలిన్‌స్కా ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన ప్రొ॥ ఇ. డిక్‌ఫాలుసీ ప్రకటించారు. ఈ కుటుంబనియంత్రణ గుళికవల్ల ఆరోగ్యానికి మరికొన్ని సమస్యలు ఏర్పడే ప్రమాదం వుందని కొందరు వైద్య పరిశోధకులు అంటున్నారే కాని, కచ్చితంగా ఆ విషయం నిర్ధారణ కాలేదని, ఇప్పుడున్న అన్ని సాధనాలలోను, ఇప్పటివరకు ఇదే కుటుంబనియంత్రణకు ఉత్తమమైన సాధనమని, ఆయన అభిప్రాయపడ్డారు. కుటుంబనియంత్రణకు స్త్రీలు, పురుషులు, ఉపయోగించడానికి అనువుగా వుండే 'వాక్సిన్' తయారు చేయడానికి ఇంకా పరిశోధనలు జరుగుతున్నాయని, ఆ పరిశోధనలు ఒక నిర్దుష్టమైన రూపాన్ని సంతరించుకోడానికి చాలాకాలం పడుతుందని ఆయన అన్నారు.

*

వక్షోజాల బిగువును సంరక్షించుకోడానికి చాలామంది వనితలు 'బ్రా' (సరీ) వేసుకుంటున్నారు. కానీ 'బ్రా' వేసుకోవడం వల్ల 'బ్రెస్ట్ కేన్సర్' వచ్చే ప్రమాదం వుందని అమెరికన్ వైద్య శాస్త్రజ్ఞుడు డా॥ జాన్ ఎమ్. డగ్లస్ (ఇంటర్నల్ మెడిసిన్ శాఖ, దక్షిణ కాలిఫోర్నియా పర్మినెంట్ మెడికల్ గ్రూప్, లాస్ ఏంజిలస్) ఇటీవల వెల్లడి చేశారు. ఈ విషయంలో ఆయన చేసిన ప్రయోగాలకు ప్రేరణ కల్పించింది స్వీడన్‌కు చెందిన అడామీ, రిమోబెక్స్ అనే ఇద్దరు వైద్య శాస్త్రజ్ఞులు! వారు ఒక నివేదికలో 'బ్రెస్ట్ కేన్సర్' రావడానికిగల అవకాశాలు వివరిస్తూ, ఇలా రాశారు. 1. ఆర్థికంగా తక్కువస్థాయిలో ఉన్న స్త్రీలకంటే, శ్రీమంతులైన స్త్రీలలోనే ఈ వ్యాధి ఎక్కువగా వుంది. 2. వక్షోజాలు చిన్నవిగా వున్నవారి కంటే, పెద్దవిగా వున్నవారికే 'బ్రెస్ట్ కేన్సర్' వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. 3. తైవాన్‌లో తల్లులు ఒక వక్షోజం ద్వారానే పిల్లలకు పాలిస్తారు. వాళ్ళల్లో కొందరికి పాలిస్తున్న వక్షోజంలో కాక, రెండవ వక్షోజంలో 'కేన్సర్' రావడానికి అవకాశాలు ఏర్పడ్డాయి. 4. వివాహితులైన స్త్రీలకంటే వివాహం పట్ల విముఖతతో బ్రహ్మచారిణులుగా స్థిరపడిన స్త్రీలకు 'బ్రెస్ట్ కాన్సర్' రావడానికి ఎక్కువ అవకాశాలు వున్నాయి! ఈ అంశాలను దృష్టిలో పెట్టుకుని డా॥ డగ్లస్ పలు వర్గాలకు చెందిన 550 మంది స్త్రీలను పరీక్ష చేసి, 'బ్రెస్ట్ కేన్సర్'కు సంబంధించి తాము తెలుసుకున్న కొన్ని అంశాలను ప్రకటించారు. వాటిలో ప్రధానమైనది 'బ్రెస్ట్ కేన్సర్'కు 'బ్రా'కు ఉన్న సంబంధం! ధనికవర్గానికి చెందిన స్త్రీలు, తమ దేహ సౌందర్యాన్ని కాపాడుకోవడంలో ఒక ముఖ్యాంశంగా-వక్షోజాల పొందిక కోసం, ఖరీదైన, బిగువైన 'బ్రా'లు ధరిస్తారని, అందువల్ల వక్షోజాలలోని గ్రంథులు అధిక వేడిమికి గురై, ఆ విధంగా 'కేన్సర్' రావడానికి అవకాశం వుందని, (మగవారు అతి బిగువైన లంగోటాలు వేసుకున్నా వృషణాలలో 'కేన్సర్' రావడానికి అవకాశం వుంది!) 'బ్రా'లు ఉపయోగించని పేద స్త్రీలకు ఆ అవకాశాలు తక్కువగా వున్నాయని, స్వీడన్ వైద్యశాస్త్రజ్ఞుల నివేదికను, తన పరిశోధనకు అన్వయించారు డా॥ డగ్లస్! అలాగే తైవాన్ వనితలు - ఒక వక్షోజం ద్వారానే శిశువుకు పాలు యివ్వడం వల్ల తరచుగా అది వేడిమికి గురికాక పోవడం, రెండవ వక్షోజానికి 'కేన్సర్' వచ్చే అవకాశం వుండడం జరుగుతోందని ఆయన అన్నారు. మొత్తం మీద అతి బిగువైన 'బ్రా'లు ధరించి, గాలి చొరబడనీయకుండా వక్షోజాలను విపరీతమైన వేడిమికి గురి చెయ్యడం కంటే, వనితలు ఆ అలవాటును మానుకోవడమే మంచిదని డా॥ డగ్లస్ అభిప్రాయం!

# ఈ 8 కారణాలకోసం ...

























# భారతపు ప్రప్రథమ ప్రెషర్ కుకర్
# నేడు కూడా విరివిగా
# ఉపయోగింపబడుతున్నది



**Prestige**

**ప్రెస్టీజ్**
టి.టి. (ప్రైవేట్) లి.,
బెంగళూరు-560 016

MCA-TT-50 Tel R



పాటే సారవంతమైన ఎరువు కూడా లభిస్తుంది. ఇలా జరిగిన నాడు గ్రామసీమలు శుభ్రంగానూ వుంటాయి. వంట గ్యాసు పంట చేల ప్రజల వరకూ వ్యాపించలేదన్న కొరతా వుండదు.

పశువుల పేడలో ఇంధనంగా పనిచేసే వాయువు విరివిగా వుంది. ఈ వాయువును పేడనుంచి విడదీయడానికి గోబర్ గ్యాస్ యంత్రం ఉపయోగ పడుతుంది. ఈ యంత్రం పేడనుంచి 'మిథేన్' (Methane) వాయువును వేరు చేస్తుంది. ఆ గ్యాస్ మాత్రమే గోబార్ గ్యాస్ ప్లాంటులోని గ్యాస్ హోల్డర్ కి చేరుకుంటుంది. తక్కిన మిశ్రమంలోని

# గ్రామీణ గృహిణులకు కల్పతరువు గోబర్ గ్యాస్




**ఆ** గ్రామంలో....

అడుగు పెట్టగానే ఎటువైపు చూసినా అపరిశుభ్రమైన వాతావరణం, అనారోగ్య కారకాలైన కీటకాలు ఎదురుపడతాయి. వీధులలో పేరుకు పోయిన చెత్తా చెదారం, పిడకల వల్ల మింటి కెగిసే పొగ ఇటువంటి కలుషిత వాతావరణంలో నివసించడం వల్ల ఆ గ్రామస్థులకి రోగాలు రావడానికి కూడా ఆస్కారం వుంది.

ఇంతకీ ఆ గ్రామం పేరేదైనా కానివ్వండి. అటువంటి గ్రామాలు మన దేశంలో అనేకం వున్నాయి. అవేకాదు చిన్నచిన్న పట్టణాల పరిస్థితీ ఇంచుమించు ఈ విధంగానే వుంది.

'దేశ సౌభాగ్యానికి వెన్నెముక' వంటి ఈ గ్రామాల పరిస్థితి చక్కబరచడానికి మార్గం లేదా, అంటే వుంది. అంతేకాదు. ఈ అపరిశుభ్రమూ, అశుద్ధమూ అనుకుంటున్న వస్తువుల నుంచే మనకి కావలసిన అత్యంత ఉపయోగకరమైన ఇంధనం – 'గోబార్ గ్యాస్' తయారు చేసుకోవచ్చును. దీనితో నత్రజని, మ్రగ్గిన పదార్థం అలాగే వుంటాయి. అంచేత ఇంధనానికి ఇంధనం, ఎరువుకి ఎరువు లభిస్తాయి. ఇలా కాకుండా పేడని కేవలం

పిడకలుగా మాత్రమే చేసుకుంటే వంటకి కావలసిన ఇంధనం మాత్రమే లభిస్తుంది తప్ప పంటకి కావలసిన ఎరువు లభించదు—పిడకల బూడిద ఎరువుగా పనికిరాదు కాబట్టి.

ఇలా గ్యాస్ తయారు చేసుకునేందుకు ఆవు, గేదె మొదలైన జంతువుల పేడని ఉపయోగించడం వల్ల ఆ వాయువు నుంచి దుర్వాసన వెలువడుతుందని కొందరు అపోహపడుతూ వుంటారు. కాని అది నిజంకాదు. గోబార్ గ్యాస్ ప్లాంట్ ద్వారా తయారైన గ్యాస్ నుండి గానీ, ఎరువు నుంచిగానీ ఏ విధమైన దుర్వాసనా వెలువడదు. ఈ గ్యాస్ లేత నీలిరంగు కాంతితో మండుతుంది. మామూలు కెరోసిన్ స్టవ్‌కన్న తక్కువ వ్యవధిలో గోబార్ గ్యాస్ స్టవ్ మీద వంటపూర్తవుతుంది. ఖర్చు కూడా తక్కువ. మరో సౌలభ్యం ఏమిటంటే.... గోబార్ గ్యాస్‌లో పొగ వుండదు. కాబట్టి వంట చేసే పాత్రలు మసి బారడం అంటూ వుండదు.

వాటిని కచ్చిక వేసి అదేపనిగా తోమాల్సిన పనీ వుండదు.

గోబార్ గ్యాస్ యంత్రాన్ని ఏర్పాటు చేసుకోవడం చాలా సులభం. అట్టే శ్రమ లేకుండానే దీనిని నడపవచ్చును.

ఈ యంత్రానికి కావలసిన ముడిపదార్థం - పేడ. రోజుకి కనీసం 45 కిలోగ్రాంలకి తక్కువ కాకుండా పేడ లభించాలి. అప్పుడే గృహావసరానికి తగిన 60 ఘనపుటడుగుల గ్యాస్ ప్లాంట్ స్థాపించడానికి వీలవుతుంది. [రోజుకి ఒక ఆవు 10 కిలోలు, గేదె 14 కిలోలు; దూడ: 4 కిలోలు పేడ వేస్తాయని అంచనా] ఇలా సేకరించిన పేడను గ్యాస్ ప్లాంట్‌కి అనుబంధంగా నిర్మించిన తొట్టిలో వేసి తగినంత నీరు పోసి బాగా కలియబెట్టాలి. ఈ తొట్టె నుంచి గ్యాస్ ప్లాంట్‌కి కలిపిన గొట్టంద్వారా ఈ మిశ్రమాన్ని ప్లాంట్ లోపలికి పంపాలి.

ఈ గ్యాస్ ప్లాంట్‌లో 'డైజస్టర్' (అరుగుదల ప్రదేశం) అనబడే తొట్టి ఇటుకలు, సిమెంటు, కాంక్రీటుతో నిర్మించబడి వుంటుంది. దీనిపైన 'గ్యాస్ హోల్డర్' (గ్యాస్ నిలవవుంచే భాగం) అనబడే డ్రమ్ము పలుచటి తగరపు రేకుతోగానీ, స్టీలుతోగానీ నిర్మిస్తారు. ఈ డ్రమ్ము రేకుతో చేసినట్లయితే శుభ్రంగా పెయింట్ చెయ్యాలి. లేకపోతే తుప్పుపట్టే ప్రమాదముంది. ఇప్పుడు దీనిని పాలియస్టర్ ఫైబర్ గ్లాసుతో కూడా చేస్తున్నారు. ఇది ఖరీదెక్కువైనా తుప్పు పట్టడం, పెయింట్ చేసుకోవడం అంటూ వుండదు.

తొట్టిలోనుంచి గ్యాస్ ప్లాంట్‌లోని 'డైజస్టర్'కి చేరుకున్న మిశ్రమం బాగా పులియడం వల్ల 'మీథేన్' వాయువు ఏర్పడుతుంది. ఈ వాయువు ప్లాంట్‌లోని గ్యాస్ హోల్డర్ డ్రమ్ములోకి చేరుకుంటుంది. తక్కిన పిప్పి యధాతథంగా బయటికి వస్తుంది. ఈ పిప్పిని ఎరువు కోసం నిర్మించిన గోతిలోకి మళ్ళించి చెత్తా చెదారంతో కప్పాలి. ఇది పురుగూ పుట్రాలేని సారవంతమైన ఎరువు. గ్యాస్ ప్లాంట్‌లోని డైజస్టర్ పైన చేరే పిప్పిని తీసి వేయడానికి అప్పుడప్పుడు డ్రమ్మును తిప్పుతూ వుండాలి. అదే విధంగా డ్రమ్ము లోపల పేరుకుపోయిన పదార్థాన్ని నెలకోసారి శుభ్రం చెయ్యాలి. ఏడాదికో రెండేళ్ళకో ఒకసారి ఈ డ్రమ్ము పెయింట్ చెయ్యడం మంచిది.

ఈ యంత్రం ద్వారా ఉత్పత్తి అయిన గోబార్ గ్యాస్‌ని ఇంటి లోపలికి తీసుకు వెళ్ళేందుకు పూత పూయబడిన ఇనుప గొట్టాలుగానీ, నల్లటి పాలిథిన్ గొట్టాలుగానీ నిర్ణయింపబడిన మందం (¾") లోనివే ఉపయోగించాలి. గోబార్ గ్యాస్‌ని గ్యాస్ హోల్డర్ నుంచి ఈ పైపుల ద్వారా వంటింటి స్టవ్‌కి సరఫరా చేసుకోవచ్చును.

గోబార్ గ్యాస్‌ను ఉపయోగించదలచుకున్న వారు ఒక్క విషయం బాగా గుర్తుంచుకోవాలి. ఈ గ్యాస్‌కని ప్రత్యేకంగా తయారు చేయబడిన స్టవ్‌లని, దీపాలని, ఇంజన్‌లనే ఉపయోగించాలి. మామూలు గ్యాస్ స్టవ్‌కి ఉపయోగించే స్టవ్‌లు



**గోబార్ గ్యాస్‌ప్లాంట్-కొన్ని జాగ్రత్తలు**

1. పేడను గ్యాస్‌ప్లాంట్ తొట్టిలో వేసే ముందు గడ్డి తదితర చెత్తా చెదారం ఏమైనా వుంటే శుభ్రంగా తీసెయ్యాలి.
2. పేడకి సరిసమానమైన పాళ్ళల్లో నీటిని కలిపి తొట్టిలో సరిగ్గా కలిసిపోయేలా ముడి పదార్థాన్ని కలియబెట్టాలి.
3. తొట్టిని గ్యాస్ ప్లాంట్‌లోని డైజస్టర్‌ని కలిపే పైప్ ప్లగ్‌ని, డైజస్టర్‌లోకి ముడి పదార్థాన్ని పంపే ముందు తెరవాలి. ఆ పదార్థమంతా లోపలికి వెళ్ళిన తర్వాత ప్లగ్ మూసెయ్యాలి.
4. ముడి పదార్థం గ్యాస్ నిలవ వుండే డ్రమ్ చుట్టూ పేరుకు పోకుండా వుండడానికి డ్రమ్‌ని రోజుకొకసారి తిప్పుతూ వుండాలి.
5. డైజస్టర్‌లో ఇసుక మొదలైన పదార్థాలు వెయ్యకూడదు.
6. ముడి పదార్థాన్ని గ్యాస్ ప్లాంట్‌లోకి తీసుకు వెళ్లే గొట్టంలోగానీ, బయటకు తెచ్చే గొట్టంలోగానీ ఆ పదార్థం పేరుకుపోయి వుంటే ఒక పొడవాటి వెదురు కర్రతో శుభ్రం చెయ్యాలి.
7. రోజుకొకసారి గోబార్ గ్యాస్ ప్లాంట్‌లోని నీటిని మారుస్తూ వుండాలి.
8. గ్యాస్ ప్లాంట్ సమీపంలో పొగ త్రాగకూడదు.




1. టెలిఫోన్ కనిపెట్టిన వ్యక్తి గ్రహమ్ బెల్ అని మీకు తెలుసు. అయితే మొట్టమొదటి టెలిఫోన్ సంభాషణ ఎప్పుడు .... ఎవరి మధ్య జరిగింది? టెలిఫోన్ ఎక్స్ఛేంజి ప్రప్రథమంగా ఎక్కడ నెలకొల్పబడిందో చెప్ప గలరా?
2. అజాద్ హింద్ ప్రభుత్వాన్ని నేతాజీ సుభాష్‌చంద్రబోస్ ఏ నగరంలో స్థాపించారు?
3. మన దేశ రాజధానీ నగరం న్యూఢిల్లీ అని మీ కందరికీ తెలుసు. అయితే ఏ సంవత్సరంలో ఈ నగరం భారత రాజధానిగా ప్రారంభోత్సవం గావింప బడిందో చెప్పగలరా?
4. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ (భారత సేవా సమాజ్)ని ఎవరు స్థాపించారు?
5. యుద్ధ సమయాలలో గాయపడిన సైనికులకి, రోగగ్రస్తులకి సేవ చేయడానికి స్థాపించబడిన అంతర్జాతీయ సంస్థ— రెడ్‌క్రాస్. ఈ సంస్థని ఎవరు ఎప్పుడు స్థాపించారు?
6. మన దేశంలోని తొలి ఉపగ్రహ కేంద్రం ఏది?
7. ప్రపంచంలో కల్లా అత్యధికమైన ఎత్తున వున్న జలపాతం ఏది?
8. క్రికెట్ ప్రియులందరికీ వెస్టిండీస్ దీవుల పేరు సుపరిచితమే. మరి ఈ వెస్టిండీస్ దీవులను ఎవరు కనుగొన్నారో చెప్పగలరా?
9. యుగోస్లోవియా, బల్గేరియా, అల్బేనియా, కోస్టారికా, న్యూజిలాండ్ దేశాల రాజధానీ నగరాలు ఏవి?
10. మనిషి శరీరంలోని అనారోగ్య లక్షణాలను కనిపెట్టే అద్భుత సాధనం ఎక్స్-రే. మరి ఈ ఎక్స్-రేని కనిపెట్టిన వ్యక్తి ఎవరో చెప్పగలరా?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]

గానీ, మామూలు దీపాలుగానీ దీనికి పనికిరావు. ఇందుకోసమై ఖాదీ గ్రామోద్యోగ సంస్థ గుర్తింపుతో ప్రత్యేకమైన పరికరాలు తయారు చేయబడుతున్నాయి. ఇవి అనేక పరిశోధనల తర్వాత బాగా నాణ్యతగా పని చేసేటట్లుగా రూపొందించబడ్డాయి.

గోబార్ గ్యాస్ ప్లాంట్ అమర్చుకోవడానికి - నాలుగైదు పశువులు, గొడ్ల చావిడి పక్కన ఖాళీ స్థలం, ప్లాంట్ నుంచి బయటికి వచ్చే పిప్పి నుంచి ఎరువు తయారు చేయడానికి అనువుగా పల్లాలు, గోతులు తీసుకోవడానికి తగిన స్థలం వుండాలి. తగినంత నీటి వసతి కూడా వుండాలి. మరో ముఖ్యమైన విషయం - బావికి దగ్గరగా అంటే 15 మీటర్ల లోపున ఈ గ్యాస్ ప్లాంట్ నిర్మించ కూడదు. ఎంచేతంటే పేడ పల్లాల నీరు బావి నీటితో కలిసే ప్రమాదం వుంది కాబట్టి.

పైన పేర్కొన్న హంగులు వున్నవారు ఈ ప్లాంట్ ఏర్పాటు చేసుకోదలచుకున్నట్లయితే ఖాదీ కమిషన్‌కు రాయవచ్చును. ఆయా రాష్ట్రాలలోని ఖాదీ కమీషన్ కార్యాలయాధికారులు వారికి కావలసిన సహాయ సహకారాలు అందజేస్తారు. జాతీయం చేయబడిన బ్యాంకులు వీటికి తగిన ఋణ సహాయం చేస్తున్నాయి. ఖాదీ కమీషన్ వారు ఈ యంత్రం గురించి సాంకేతిక విషయాలు విపులంగా తెలియజేయడమే కాకుండా దీనిని అమర్చడంలోనూ, కావలసిన పరికరాలు సరఫరా చెయ్యడంలోనూ సహకరిస్తారు.

వ్యక్తులే కాకుండా పాఠశాలలు, కోళ్ళ పరిశ్రమలు, తదితర కుటీర పరిశ్రమలు కూడా విద్యుచ్ఛక్తి కోసం, ఎరువు కోసం భారీ ఎత్తున ఈ ప్లాంట్‌ను ఏర్పాటు చేసుకోవచ్చును. 30 ఘనపు టడుగుల ప్లాంట్‌కి దాదాపు రూ. 875 ఖర్చు అవుతుంది. 60 ఘనపుటడుగుల ప్లాంట్‌కి రూ. 1575 అవుతుంది. ఈ ప్లాంట్‌లను ఇంకా భారీగా కూడా నిర్వహించవచ్చును.

ఖాదీ కమిషన్ వారి అనుమతి పొందిన ప్లాంట్‌లకి వ్యవసాయ మంత్రిత్వశాఖ వద్ద నుంచి 25 శాతం గ్రాంటు మంజూరు చేయబడుతుంది. జాతీయం చేయబడిన బ్యాంకులు 75 శాతం ఋణాన్ని సమకూరుస్తాయి. ఉదాహరణకి 60 ఘనపుటడుగుల ప్లాంట్ నిర్మాణానికి అయ్యే ఖర్చు - రూ. 1575. అంటే అందులో రూ. 393 వ్యవసాయశాఖ గ్రాంటు క్రింద యిస్తే, బ్యాంకులు తక్కిన రూ. 1182 వాయిదాల పద్ధతి మీద తీర్చేటట్లుగా ఋణం కింద ఇస్తాయన్న మాట,

ఇటువంటి గోబార్ గ్యాస్ యంత్రాలు వసతి వున్న గ్రామస్థులు, సహకార సంఘాలు, తదితర సంస్థలు నిర్మించడంవల్ల తక్కువ ఖర్చుతో వంటకి, దీపాలకి, ఇంజన్లకి ఇంధనం లభించడమే కాకుండా, గ్రామసీమలు, చిన్న చిన్న పట్టణాలు అపరిశుభ్రంగా వుండడమంటూ కూడా వుండదు. అప్పుడు దోమలకి, ఈగలకి తదితర రోగపూరితమైన కీటకాలకి ఆస్కారం కూడా తగ్గుతుంది. గ్రామాలలో కట్టెలు, పిడకలపొగ మధ్య సతమతమవుతూ వంట చేసుకునే గృహిణులకు వంటకి తగ్గ కల్పతరువులాంటి గ్యాస్ లభిస్తుంది. రైతులకి కావలసినంత సారవంతమైన ఎరువూ దొరుకుతుంది.

ఈ గోబార్ గ్యాస్ ప్లాంట్ గురించి ఇంకా వివరాలు కావలసిన వారు ఈ క్రింది చిరునామాకు రాసి తెలుసుకోవచ్చును:

స్టేట్ డైరక్టర్,
ఖాదీ గ్రామోద్యోగ పరిశ్రమల కమిషన్
శ్రీనికేతన్,
తిలక్ రోడ్, హైద్రాబాదు

ఆంధ్రప్రదేశ్ ఖాదీ గ్రామోద్యోగ పరిశ్రమల బోర్డు,
2-4-1114 ఫర్హాట్ కద,
కాచిగూడా, హైద్రాబాదు

ది డైరెక్టర్,
గోబార్ గ్యాస్ స్కీమ్,
ఖాదీ అండ్ విలేజ్ ఇండస్ట్రీస్ కమిషన్,
ఇర్లా రోడ్, విలేపార్లే వెస్ట్,
బొంబాయి - 400056



సశేషనవల:

# బొమ్మా-బొరుసూ

శీలంశెట్టి రమాదేవి

జరిగిన కథ:

[హేమ అభ్యుదయ భావాలుగల యువతి. నారీ విప్లవ సమితి కార్యదర్శి. హేమ బావ సుధీర్. సుధీర్ తన స్నేహితుడు, సహ ఉద్యోగి అయిన శ్రీనివాసరావ్‌ని హేమకి పరిచయం చేస్తాడు. మొదటి చూపులోనే హేమ శ్రీనివాసరావ్‌ని ఆకర్షిస్తుంది. హేమ తండ్రి రామరాజు, తల్లి సౌభాగ్యమ్మ హేమని సుధీర్ కిచ్చి వివాహం చెయ్యాలనుకుంటారు. కాని తమవి విభిన్న అభిప్రాయాలు కావడంతో సుధీర్ హేమని వివాహం చేసుకోవడానికి ఇష్టపడడు. హేమ కూడా అతనితో ఏకీభవిస్తుంది. హేమ స్నేహితురాలు వసుంధర, ఆమె తమ్ముడు చంద్రకాంత్. చంద్రకాంత్‌కి హేమ అంటే ఆరాధన, ఆమె ఉద్యమం పట్ల ఉత్సాహం వున్నాయి. సుధీర్ ద్వారా హేమ గురించి తరచి తరచి అడిగి తెలుసుకుంటాడు శ్రీనివాసరావు. సుధీర్ ఆమెని వివాహం చేసుకోవడం లేదని తెలుసుకున్నాక శ్రీనివాసరావు తన మనస్సులోని కోరికని సుధీర్‌కి తెలియజేస్తాడు.]

"ఇప్పుడు నిన్నో ప్రశ్న అడగాలనుకుంటున్నాను! అఫ్‌కోర్స్! ఇది కేవలం నా కుతూహలం! అంతే! ఈ ప్రశ్న అడగడంవల్ల నిన్ను కించపరచడంగానీ, నేను నీకంటె ఉన్నతుడినని అనడంగానీ కాదు...."

శ్రీనివాసరావ్ నవ్వేశాడు.

"భలేవాడివేలే! ఇంతకాలం స్నేహం చేశాక కూడా నిన్ను నేను అర్థం చేసుకోలేదనుకుంటున్నావా? మొఖమాటం లేకుండా అడుగు!"

"హేమ అభిప్రాయాలను నువ్వు నిజంగా గౌరవిస్తున్నావా?"

"నీకు ఇందాకే చెప్పాను కదా! అవన్నీ కాలక్షేపం కబుర్లనీ! మరి అలాంటి కాలక్షేపం అభిప్రాయాలను ఎవరయినా గౌరవిస్తారా?"

"అంటే స్త్రీ సమానత్వం, హక్కులూ - అనే మాటల మీద నీకు ఏ మాత్రం సదభిప్రాయం లేదన్న మాట!"

"నీకు తెలీదేమో! నేను అలాంటి వాటిని అసహ్యించుకుంటాను. మరో రకంగా చెప్పాలంటే నేను ఇలాంటి విషయంలో మరీ ఛాందసుడిని! ఇంతకంటె వివరంగా చెప్పటం నాకు సాధ్యం కాదు. ఇందాక నువ్వు చెప్పావే - 'భార్యాభర్తలు ఇద్దరూ పరస్పరం ఒకరినొకరు గౌరవించుకోవాలని' - అది కూడా నాకు నచ్చదు. దేనికయినా క్రమశిక్షణ అనేది ముఖ్యం. క్రమశిక్షణ లేకపోతే ఈ ప్రపంచమే లేదు. మళ్లీ అనాగరిక కాలంలోకి వెళ్ళిపోతాము. ఎవరిష్టం వారిది. ఎవరి ఆనంధం వారిది. 'కుటుంబం' అనే పదం లేకుండా, నీతి, అవినీతి తెలీకుండా, నియమాలూ నిబంధనలూ లేకుండా - ఆనాటి అడవి తెగల్లా ఉంటుంది జీవితం. అలాంటిదెవరయినా కోరుకుంటారా? ఇంట్లో పూర్తి స్వేచ్ఛ పొందిన స్త్రీలు ఆ స్వేచ్ఛను ఎలా దుర్వినియోగం చేస్తున్నారో నాకు తెలుసు. ఎన్నో ఉదాహరణలు నేను చెప్పగలను. స్త్రీకి లభించాలని అందరూ కోరుకుంటున్న ఆ కొంత స్వేచ్ఛను కూడా నేను హర్షించను. అంటే అమె మరీ మొహెంజదారో కాలం నాటి స్త్రీగా ఉండాలని



కాదుగానీ, ఇంతవరకూ ఆమెకు లభించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు చాలునని నా ఉద్దేశ్యం. ఇంకా ఏవో హక్కులు కావాలనుకోవడం - అత్యాశకు పోవడమే! అది సాధ్యం కాని విషయం కూడా!''

నెమ్మదిగా మాట్లాడాడు శ్రీనివాసరావ్.

సుధీర్ ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు.

''మరి....మరి....ఆ రోజు నువ్వు హేమతో అలా ఎందుకుమాట్లాడావ్?'' అడిగాడు అనుమానంగా.

''ఎలా?''

''అదే....''నిజమేనండీ! మగాడు మరీ స్వార్థ పరుడిగా తయారవుతున్నాడు'' అని!''

శ్రీనివాసరావ్ నవ్వాడు.

''ఆ మాట మాట్లాడడంలో నా స్వార్థం ఉంది కనుక....''

సుధీర్ నవ్వేశాడు.

''ఏమిటది?''

''వివాహం అయేవరకయినా ఆమె అభిప్రాయా లను నేను గౌరవించకపోతే ఆమె నన్నెలా వివాహం చేసుకుంటుంది?''

''అంటే నువ్వు అంతవరకూ ఆమెతో నటిస్తావన్న మాట!''

''నువ్వెలా అనుకున్నాసరే! ఆమె నాకు కావాలి కనుక అబద్ధాలు చెప్పి అయినా ఆమెను నా దాన్ని చేసుకోవాలి. వెయ్యి అబద్ధాలు చెప్పి పెళ్ళి చేసుకోవచ్చని ఓ రూలుంది కదా!''

ఇద్దరూ నవ్వేశారు.

''ఒకవేళ ఆ తర్వాత ఆమె నీ నిజస్వరూపం తెలుసుకుంటే సమస్యలు ఎదురవ్వవూ?''

''అప్పుడింక సమస్యలేముంటాయోయ్! అదీ కొత్త దంపతుల మధ్య అభిప్రాయ భేదాలెందు కొస్తాయ్. కొత్తలో ఎలాగూ సెక్స్‌కి ప్రాముఖ్యం ఉంటుంది. ఎవరూ తమ తమ అభిప్రాయ భేదాలను గురించి చర్చించుకుంటూ కూర్చోరు గదా! ఆ తరువాత అంటే పాతబడిపోయాక ఇంక ఏ అభిప్రాయ భేదాలున్నా చేయగలిగిందేముందీ? అప్పటికే పిల్లా పీచూ — సంసారం ప్రాముఖ్యం వహిస్తుందక్కడ, ఇంకా ఆశయాలూ, అభిప్రా యాలూ ఎక్కడ మిగిలేడుస్తాయ్-అయినా ఇవన్నీ నీకు తట్టలేదంటే నాకు ఆశ్చర్యంగా ఉంది....''

సుధీర్ కొద్ది క్షణాలు మౌనంగా ఉండి తరువాత మాట్లాడాడు.

''ఏమో! నీ ఆలోచనలు సరయినవే కావచ్చు. అయితే నువ్వు ఆధునిక యువతిని సరిగ్గా అర్థం చేసుకున్నావో లేదో నాకు తెలీదు. ఏదేమయినా ఐవిష్ యూది బెస్ట్ — అంతే!''

''థాంక్యూవెరీమచ్! వస్తాను....వచ్చేవారం రెండు రోజులు మన ఆఫీసుకి శెలవులున్నాయ్ కదా! అప్పుడు వెళ్దామనుకుంటున్నాను వాళ్ళ ఊరు....''

''మళ్ళీ వచ్చాక ఏం జరిగిందీ నాకోసారి ఫోన్ చేసి చెప్తావు కదూ?''

''నీకు కాకపోతే ఎవరికి చెప్తానింకా?''

శ్రీనివాసరావ్ బయటికొచ్చేశాడు. అతని మనసంతా ఆనందంతో నిండిపోయింది. సుధీర్ చెప్పిన మాటలను బట్టి చూస్తే తనకూ హేమకూ వివాహం సాధ్యమనే నమ్మకం కలుగుతోంది. నిజంగా అలా జరిగితే తనంత అదృష్టవంతుడు ఎవరుంటారు? ప్రేమించిన అమ్మాయినే వివాహం చేసుకోవడం — ఆ అమ్మాయితోనే జీవితం గడ పడం ఒక వరం! ప్రేమించిన అమ్మాయిని ఎన్నో కారణాలవల్ల దూరం చేసుకున్న వాళ్ళెంత మంది లేరు? ఒకరినొకరు జీవితాంతం తలచు కుంటూ బాధపడుతూ జీవచ్ఛవాల్లా గడిపేవారు ఎన్ని లక్షలమంది లేరు? మరి వారితో పోల్చు కుంటే తనదెంత అదృష్టం? ఆ రోజు ఆమెను చూచిన మొదటి క్షణం నుంచీ ఆమె కోసం పడు తున్న ఆవేదనంతా ఎటో మాయమయిపోయింది. ఆతృతగా శనివారం కోసం ఎదురు చూడసాగాడు అతను. ఆ రాత్రికి బయల్దేరి హేమ వాళ్ళ వూరు చేరుకుంటాడు తను. ఆదివారం ఉదయం తన భవిష్యత్తు తేలిపోతుంది. తను ప్రపంచంలోకెల్లా అదృష్టవంతుడో, దురదృష్టవంతుడో నిర్ణయమయి పోతుంది.

*

''కంగ్రాచ్యులేషన్స్!'' చిరునవ్వుతో అన్నాడు చంద్రకాంత్.

హేమ ఆశ్చర్యపోయింది.

''ఎందుకు?''

''మీరు అంత మంచి ఆర్టికల్ రాసినందుకు!''

''అదా!'' తేలిగ్గా నవ్వేస్తూ అందామె.

''ఈ మాట నేననడం కాదు. నా అభిప్రాయం తరువాత చెప్తానులెండి! మన ఊళ్లోని ప్రముఖులు చాలామంది అది చదివి, రాసిందెవరు? ఆవిడ ఏం

చదివారు? ఎక్కడుంటారు? అని ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారనుకోండి!....''

హేమ అతని పొగడ్తకు కొంచెం సిగ్గుపడింది.

"ఎవరో ఒకర్ని పొగడాలని అలా అని ఉంటారు!'' అంది.

"అదేం కాదు లెండి! అలాగయితే మీ గురించి అన్ని వివరాలడగాల్సిన పనిలేదు....'' ఆమె అభిప్రాయాన్ని కొట్టి పారేస్తూ అన్నాడు చంద్రకాంత్.

"సరే - పోనీలె! నా ఆర్టికల్ బావుంది! అంతేనా!'' నవ్వేస్తూ అందామె.

"ఇక నా అభిప్రాయాన్ని చెప్పమంటారా?''

"ఊరికే పొగడనని మాట ఇస్తే వింటాను!''

"భలేవారే. మిమ్మల్ని పొగిడితే నాకేమిటి లాభం? ఏ మినిస్టర్నో, కోటీశ్వరుడినో పొగిడితే అర్థం ఉంది. ఆ పొగడ్త వెనుక ఏదో మోటివ్ ఉందనుకోవచ్చు. సరే - అదలా వదిలేయండి! అది చదువుతూంటే నాకేమనిపించిందో తెలుసా? ఇంత చక్కని రచనాశక్తిని ఉంచుకొని మీరు రచనా వ్యాసంగం ఎందుకు చేపట్టలేదా అనిపించింది. ఎలా గయినాసరే మిమ్మల్ని బలవంతంగానయినా పత్రికలకు కథలు స్కెచ్‌లు పంపేలా చేయాలని అనుకొన్నాను. కాని ఏమైంది? హైద్రాబాద్ వెళ్లాల్సి వచ్చింది. అయినా గాని మిమ్మల్నోపట్టాన వదలనులెండి! రోజుకో ఉత్తరం రాసి పారేస్తూనే ఉంటాను....'' నవ్వుతూ అన్నాడతను.

హేమ కూడా నవ్వేసింది.

"రాయవయ్యా! వద్దన్నదెవరు?''

చంద్రకాంత్‌కి ఆమెను చూస్తూంటే మనసులో ఏవేవో ఆలోచనలు ఉవ్వెత్తున ఎగసినాయి. ఆమెకు తన మనసుని విప్పి చెప్పాలన్న తాపత్రయం పెరిగిపోతుంది.

"హేమగారూ! మేము వెళ్ళిపోతూంటే మీకేమనిపిస్తోందో గాని నాకు మాత్రం మీతో రోజూ కాసేపయినా మాట్లాడందే ఎలా ఉండగలనా అనిపిస్తోంది....'' బెరుగ్గానే అన్నాడు అతను.

హేమ అతని ఆంతర్యాన్ని గ్రహించలేదు.

"దానికి ఏముంది? రోజుకో ఉత్తరం రాస్తానంటున్నావుగా! మాట్లాడదల్చుకున్నవన్నీ అందులోనే రాసేయి" నవ్వుతూ అన్నది.

చంద్రకాంత్ మాట్లాడలేదు. అతని హృదయమంతా బరువెక్కిపోయింది.

"ఇంక వెళ్తానండీ!'' అన్నాడు లేచి నిలబడి.

"రాత్రికి స్టేషన్ కొస్తానని వసుంధరకు చెప్పు! మీ అందరికి సెండాఫ్ ఇస్తాను.''

"అలాగే!'' తలూపి వెళ్ళిపోయాడతను.

అతను వెళ్ళిపోగానే టేబుల్ మీదున్న సావనీర్ తీసి తను రాసిన వ్యాసం మరోసారి చదువుకొందామె. చంద్రకాంత్ అన్న మాటలు ఆమె ఇంకా మర్చిపోలేదు. అతనే కాదు చాలామంది తమ నారీసమితి మెంబర్స్ కూడా తన రచనాశక్తిని మెచ్చుకొన్నారు. అందరూ అంతగా ప్రోత్సాహిస్తున్నప్పుడు తను రచనలు చేయడానికి ప్రయత్నిస్తే ఏం?

తన గదిలోకి నడచి టేబుల్‌ముందు కూర్చుని కాగితాలు ముందేసుకొందామె. ఏం కథ రాయాలా అని ఆలోచిస్తూండగా బయట నుంచి "ఏవండీ" అన్న పిలుపు వినిపించింది. చిరాగ్గా లేచి బయటకు నడిచిందామె.

గేటు దగ్గర నిలబడి ఉన్న వ్యక్తిని చూసి కొద్ది క్షణాలపాటు "అతన్నెక్కడో చూసినట్లుందే" అన్న ఆలోచనలోపడిపోయింది.

"నమస్తే!'' తను గేటు తీసి అతనిని లోపలకు ఆహ్వానిస్తూంటే చిరునవ్వుతో అన్నాడతను.

"నమస్తే...." ప్రతి నమస్కారం చేసింది ఇంకా ఆలోచిస్తూనే. ఇద్దరూ లోపలకు నడిచారు.

"కూర్చోండి!" అంది హాల్లోకొచ్చాక.

అతను కుర్చీలో కూర్చున్నాడు.

"నన్ను గుర్తుపట్టారా? నేను సుధీర్ ఫ్రెండ్‌ని!"

తక్కున గుర్తుకొచ్చింది హేమకి.

"అవునవును! మీ పేరు శ్రీనివాసరావు! కరెక్టేనా?" ఆనందంగా అడిగిందామె.

"కరెక్ట్! అయితే మీరింకా గుర్తుంచుకొన్నా రన్నమాట! బహుశా మర్చిపోయి ఉంటారేమో అని సంశయిస్తున్నాను. ఎందుకంటే కొద్దిసేపే కలసి తిరిగాము ఆ రోజు. ఆ తరువాత ఇన్ని రోజులు గడచిపోయాయిగదా!"

హేమ మందహాసం చేసింది.

"బావ బాగున్నాడా?"

"ఓ! మళ్ళీ ఓ నాటకం రిహార్సల్స్ మొదలు పెట్టాడు." నవ్వుతూ అన్నాడతను.

"మీరెప్పుడొచ్చారీవూరు?" అడిగిందామె.

"ఇంతకుముందే! బస్‌స్టాండ్ దగ్గర్లో ఉన్న హోటల్లో దిగాను."

"ఏదయినా పని మీద వచ్చారా?"

"అవును!" వెంటనే అసలు విషయం ప్రారంభించడానికి భయపడ్డాడతను.

అతన్నింక వివరాలు అడగడం బావుండదని మౌనం వహించిందామె.

"మీ నాన్నగారున్నారా?" అడిగాడతను.

"ఊహు! ఆఫీసు కెళ్లిపోయారు. ఈ మధ్య కొంచెం వర్క్ ఎక్కువగా ఉందని తొమ్మిది గంటలకే వెళ్లిపోతున్నారు...." తన తండ్రితో అతనికేం పనా అని ఆలోచిస్తూ అందామె.

"సాయింత్రం ఎన్ని గంటలకు ఇంటి కొస్తారు?" అడిగాడతను.

"ఈ మధ్య ఆరింటికిగానీ రావటం లేదుమరి."

కొద్దిసేపు ఆలోచనలోపడ్డాడతను. మరి సాయింత్రం వరకూ వేచి వుండడమా లేక ఆఫీసు కెళ్ళి మాట్లాడవచ్చా? హఠాత్తుగా ఓ ఆలోచన తట్టిందతనికి.

హేమ వంటరిగానే ఉన్నట్లుంది ఇంట్లో ముందు ఆమెతోనే మాట్లాడి అన్నీ స్పష్టంగా తెలుసుకొంటే ఎలా వుంటుంది? ఒకవేళ ఆమెక్కూడా ఏమయినా తెలుసుకోవలసిన విషయాలుంటే తననడిగి తెలుసుకోవచ్చు.

"కాఫీ తాగుతారా, టీయా?" అడిగింది హేమ.

"ఇప్పుడాశ్రమేమీ తీసుకోకండి! ఇక్కడికి బయల్దేరేముందే కాఫీ ఫలహారం అయింది!"

"అయినా సరే! అతిథి మర్యాద చేయడం మా ధర్మం కదా! లేకపోతే రేపు మా బావ దగ్గర కెళ్ళినప్పుడు "మీ మరదలు హోప్‌లెస్‌గాళ్" అంటూ సర్టిఫికెట్టిచ్చేస్తారు...." నవ్వుతూ అని లోపలికెళ్ళి అయిదు నిమిషాల్లో రెండుకప్పుల్లో కాఫీతో తిరిగి వచ్చింది.

"నేనో ముఖ్యమయిన పనిమీద వచ్చాను...." అన్నాడతను కాఫీ తాగుతూ, హేమ అతని వంక కుతూహలంగా చూసింది.

"ఏమిటది?"

శ్రీనివాసరావుకి చెమటలు పట్టేస్తున్నాయ్. ఆ విషయం ఎలా ప్రారంభించాలో తెలీడం లేదతనికి.

"అదే! వివాహం విషయం!" అన్నాడు తడబడుతూ.

"వివాహమా?"

"అవును...."

"ఎవరిది?"

"మీదే! మీకు ఎప్పుడు వివాహం చేయాలను కొంటున్నారో మీ ఫాదర్‌ని కనుక్కుందామని వచ్చాను...."

హేమ సిగ్గుపడింది. కాని అది పైకి కనిపించ కుండా ఉండడానికని త్వరత్వరగా మాట్లాడేసింది.

"నాకేం అర్థం కావడంలేదు! నా వివాహ విషయంలో మీకు శ్రద్ధ కలిగిందేమిటి?" చిరునవ్వుతో అంది.

శ్రీనివాసరావ్ ధైర్యం తెచ్చుకొన్నాడు. తనింక సబ్జెక్ట్‌లోకి వచ్చేయాలి. లేకపోతే లేనిపోని అపోహలు!

"మీరు అన్యథా భావించనంటే మీతో కూడా కొన్ని విషయాలు మాట్లాడతాను...."

ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగాడతను.

హేమ గుండెలు వేగంగా కొట్టుకున్నాయ్.

అతను తనతో మాట్లాడదల్చుకొందేమిటి?

"ఏమిటది?" అంది అతనినుంచి చూపులు మళ్ళించుకొని.

"మనిద్దరికీ పరిచయమయిన రోజు మీకు గుర్తుందికదా! ఆ రోజు నుంచే మిమ్మల్ని వివాహం చేసుకోవాలన్న కోరిక కలిగింది నాకు! అంతగా ఆకర్షింపబడ్డాను మీ అందానికి. కానీ మీరూ, సుధీర్ వివాహం చేసుకోబోతున్నారేమో నన్న ఆలోచన కలిగి నా కోరికను వెంటనే అణగదొక్కేశాను. కానీ ఈ మధ్య సుధీర్‌ని కలుసుకొన్నప్పుడు మాటల్లో మీ రిద్దరూ వివాహం చేసుకోబోవటం లేదని చెప్పాడు. నేను ఆనందంతో ఉక్కిరిబిక్కి-



బేబి శిరీష

'పిట్ట కొంచెము కూత ఘనము'న్నట్టు తన ఆరవ ఏటనే భరతనాట్యంలో విశేషమైన ప్రతిభను కనబరిచి పలువురి ప్రశంసలందుకున్నది- బేబి శిరీష. గత సంవత్సరం అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా 'బాలానందం' హైద్రాబాదులో నిర్వహించిన నాట్య పోటీలలో ప్రథమ బహుమతి పొందింది. అంతకుముందు కూడా శిరీష తన నాట్యపటిమతో పలు బహుమతులు గెలుచుకున్నది. ముఖ్యంగా గోపికా నృత్యం చేయడంలో ఈ చిన్నారిది అందె వేసిన చేయి. శిరీష ప్రస్తుతం శ్రీమతి టి. కృష్ణప్రియ వద్ద నాట్యం నేర్చుకుంటోంది.

కొంగ్రొత్త!

# కాళీ కాపర్ బాటమ్ "కుక్-ఫాస్ట్" స్టైయిన్‌లెస్ స్టీల్ పాత్రలు

వేగంగా వంట
60% వరకూ
ఇంధనపు ఖర్చు ఆదా

అసలు కిటుకు రాగి అడుగులో వుంది

☐ ఆశ్చర్యకరమైన వేగంతో పరిపక్వమైన వంట, చివరిదాకా చిన్నమంట మీదే. ఇంధనపు ఖర్చులు బాగా కలిసివస్తాయి.

☐ శుభ్రం చేయడం సులభము! ప్రత్యేక జాగ్రత్తలేవీ అవసరం లేదు. అయినా ఏళ్లకొద్దీ తళతళలాడుతూంటాయి.

☐ రకరకాల వంటలకు వంటకాలకు ఆదర్శకరంగా పూర్తి శ్రేణి. మీకు కావలసిన సైజులలో పాత్రలు.

ఇప్పుడే "సెలక్ట్" సరకులు!
మంచి విశిష్టకరమైన వంటల తయారీకి కావలసిన ప్రత్యేకంగా ఏర్చి కూర్చిన సరకు. మీకు ఇష్టమైనవి తీసుకోండి. ఎరుపు, నీలం, ఆకుపచ్చ పెట్టెలలో.
గమనించండి : అన్ని అవకాశాలకు ఆదర్శకరమైన పారితోషికాలు.




30 సంవత్సరాలకు పైనుండీ అసమానమైన స్టైయిన్‌లెస్ స్టీల్ పాత్రలు తయారు చేస్తున్నారు


సాధారణ స్టైయిన్‌లెస్ స్టీల్ (ఎవర్‌సిల్వర్)


కాళీ కాపర్ బాటమ్

స్టైయిన్‌లెస్ స్టీల్ (ఎవర్ సిల్వర్) యొక్క విశిష్టత మన్నికతలతోబాటు రాగి యొక్క అతి శక్తివంతమగు ఒకే సమమగు ఉష్ణ వాహకతనిస్తుంది.

**Made to International Standards**



ప్రసిద్ధమైన వంట పాత్రల డీలర్స్ అందరివద్ద లభిస్తాయి

అమ్మకపు ఏజెంట్లు : శ్రీవిద్యా ఏజెన్సీస్ కుంభేశ్వరర్ సన్నిధి, కుంభకోణము-612 001 (తమిళనాడు)

డీలర్ షిప్‌లకు సంప్రదించండి : మెస్సర్స్ సాము & కో పో బా. నం. 1049 యమ్. జి. రోడ్డు, ఎర్నాకులము కొచ్చిన్-682 011 ఫోను : 31139

G. KB. 6 Tel.

రయ్యాను. వెంటనే అట్టడుగున పడివున్న ఆశలు మళ్ళీ పురివిప్పినయ్. సుధీర్‌కి సంగతంతా చెప్పాను. అతను ఈ విషయాలన్నీ మీ నాన్నగారితోనే మాట్లాడమని అడ్రస్ ఇచ్చి పంపాడు. ఇదీ సంగతి....'' వణుకుతోన్న కంఠంతో అన్నాడతను.

హేమ తలెత్తి అతనివంక చూడలేకపోతోంది. తనకసలు అతని మీద ఎలాంటి అభిప్రాయమూ లేదు. అలాంటప్పుడు హఠాత్తుగా అతను వచ్చి "మిమ్మల్ని వివాహం చేసుకోవాలనుకుంటున్నాను'' అంటే ఏం మాట్లాడగలుగుతుంది?

"హేమగారూ!'' కొద్ది క్షణాల తర్వాత సౌమ్యంగా పిలిచాడతను.

"ఊ!''

"మీ అభిప్రాయం ఏమిటి?'' ఆత్రుతగా అడిగాడతను.

"ఏమో! ఇంత త్వరగా నేనేం చెప్పగలను?'' తలవంచుకొనే అందామె.

"అఫ్‌కోర్స్! అదీ నిజమేలెండి! నా ఉద్దేశ్యం ఏమిటంటే నా గురించి మీరు ఏమయినా తెలుసుకోవాలనుకొంటే అడిగెయ్యండి! మొఖమాట పడాల్సిన పనిలేదు!'' చనువుగా అన్నాడతను.

హేమ కొద్ది క్షణాలు ఆలోచించింది.

అతని గురించి తనకేం కావాలి? ఏం తెలుసుకోవాలి? ఉద్యోగమా? జీతమా? బాధ్యతలా? అవి తనెప్పుడూ పట్టించుకోదు. అవన్నీ తెలుసుకొన్నంత మాత్రాన తనకు ఒరిగేదేమిటి? అసలు తనకో పెళ్ళికొడుకుని వెతకాల్సి వస్తుందని ఎవరనుకొన్నారు?

"అవన్నీ నాన్నగారు మాట్లాడతారులెండి!'' అందామె.

"అఫ్‌కోర్స్! నిజమేననుకోండి! ఆల్‌రైట్! మరి నేను మీ నాన్నగారి ఆఫీస్ కెళ్ళవచ్చా?'' లేచి నిలబడుతూ అన్నాడతను.

"వెళ్ళండి! ఫరవాలేదు!'' అతనితోపాటు బయటివరకూ నడిచింది హేమ.

శ్రీనివాసరావ్ ఆఫీస్‌కి బయల్దేరాడు. సుధీర్ ఇచ్చిన అడ్రస్ ప్రకారం రామరాజుని వెతికి పట్టుకొనేసరికి అరగంట పట్టింది. ఆ సమయానికి కాంటీన్‌లో 'టీ' తాగుతున్నాడతను.

"నమస్కారమండీ! నా పేరు శ్రీనివాసరావ్! నేను సుధీర్ స్నేహితుడిని. హైద్రాబాద్ నుంచి వచ్చాను!'' పరిచయం చేసుకొంటూ అన్నాడు.

రామరాజు మౌనంగా ప్రతి నమస్కారం చేశాడు. సుధీర్ పేరు వినగానే అతనికి చికాకు కలిగింది.

"ఏమిటి సంగతి?'' అనడిగాడు తన చిరాకు కప్పి పుచ్చుకోడానికి ప్రయత్నిస్తూ.

"మీతో కొద్దిసేపు మాట్లాడాలి....'' నమ్రతతో అన్నాడు శ్రీనివాసరావ్.

"రండి! అలా కూర్చుందాం!'' ఖాళీగా ఉన్న ఓ టేబుల్ వేపు నడుస్తూ అన్నాడతను.

ఇద్దరూ ఎదురెదురుగ్గా కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పండి! ఏమిటి మాట్లాడాలన్నారు?'' కుతూహలంగా అడిగాడు రామరాజు.

"ఈ మధ్య మీ హేమ హైద్రాబాద్ వచ్చినప్పుడు సుధీర్ ఆమెను నాకు పరిచయం చేశాడు. ఆమెను వివాహం చేసుకోవాలన్న కోరిక కలిగింది నాకు! ఈ విషయంలో మీ అంగీకారం పొందడానికి వచ్చాను....'' చిరునవ్వుతో మాట్లాడాడతను.

రామరాజు ఆశ్చర్యపోయాడు. అంతవరకూ ఆవహించిన చిరాకంతా దూరమయిపోయింది. అతనికి కొంత గర్వంగా కూడా ఉంది. తన కూతురిని సుధీర్ వివాహం చేసుకోకపోతే అతన్ని మించిన వాళ్ళు బ్రతిమాలి చేసుకొంటారు.

"మీరేం చేస్తుంటారు?'' అడిగాడతను శ్రీనివాసరావు పరీక్షగా చూస్తూ.

"సుధీర్ డిపార్ట్‌మెంట్‌లోనే మరో విభాగంలో సీనియర్ క్లర్క్‌గా ఉన్నాను. నేను పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేశాను. త్వరలో మరో ప్రయివేట్ కంపెనీలో అసిస్టెంట్ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరుగా వెళ్ళబోతున్నాను. అఫ్‌కోర్స్ ఇంటర్వ్యూలో సెలక్టయాను లెండి! కొంచెం టైము పడుతుంది. అంతే!''

రామరాజు సంతృప్తి పడ్డాడు.

"మీ వాళ్ళంతా ఎక్కడున్నారు?'' అడిగాడతనిని.

"మా ఊళ్ళోనే! ఉయ్యూరు!''

"మీ పెద్దవాళ్ళనోసారి మా ఇంటికి పంపుతే అన్ని విషయాలూ మేము మాట్లాడుకొంటాము!''

"ఓ! తప్పకుండా పంపుతాను!'' సంతోషంతో ఉక్కిరి బిక్కిరవుతూ అన్నాడతను.

"ఒక్క నిమిషం కూర్చోండి! టీ తెస్తాను'' అంటూ లేచి కౌంటర్ దగ్గర టోకెన్ తీసుకొని టీ తీసుకొచ్చాడు రామరాజు.

"హేమ అభిప్రాయం కూడా కనుక్కొని నేను మీకు ఉత్తరం రాస్తాను. అప్పుడు మీవాళ్ళను పంపితే బావుంటుంది....''

"అలాగేనండీ!''

ఇద్దరూ టీ తాగి బయటికొచ్చారు.

"ఇంక నే వెళ్తానండీ! థాంక్యూ వెరీమచ్!'' అనేసి సెలవు తీసుకొని బయటకు నడిచాడు శ్రీనివాసరావ్.

అతనికి మబ్బుల్లో తేలిపోతున్నట్లుంది. ఇంత తేలిగ్గా ఈ వ్యవహారం సెటిలయిపోతుందనుకోలేదు తను. ఇంక తమ వివాహానికి ఎదురయే అడ్డంకు లేమీ కనిపించడం లేదు తనకి. హేమ ఎలాగూ వప్పుకొంటుంది. ఆ తరువాత అంతా రోజుల్లోనే జరిగిపోతుంది. హోటల్ చేరుకొని గది ఖాళీచేస్తి బస్‌స్టాండ్ చేరుకొన్నాడతను. ఉయ్యూరు వెళ్ళే బస్ సిద్దంగా ఉందక్కడ. బస్‌లో ఎక్కి కూర్చున్నాడు శ్రీనివాసరావ్. తన తల్లిదండ్రులతో తనకే ఇబ్బందీ లేదు. తనెలా చెప్తే అలా వింటారు. తమ వంశంలో తనలా చదువుకొన్న వారెవ్వరూ లేరు. అసలు పట్నం జీవితమే తెలీదు వారికి. అంచేత తను ఏం చేసినా మంచి కోసమే చేస్తాడన్న అవగాహన ఉంది. ఆ కారణంచేతే తమ బంధువులమ్మాయ్ నాగమణిని తనకిచ్చి వివాహం చేయాలని వారు అనుకొన్నప్పుడు తను నిరాకరిస్తే ఎలాంటి కోపతాపాలూ లేకుండా ఊరుకొన్నారందరూ. నాగమణి గుర్తుకి రాగానే నవ్వు వచ్చింది శ్రీనివాసరావ్‌కి. ఆ అమ్మాయిని తను వాళ్ళ అక్కయ్య పెళ్లిలో చూశాడు. అప్పుడే ఆమెను తనకిస్తే బావుంటుందన్న ఆలోచన కలిగింది ఆమె తల్లిదండ్రులకు. నాగమణి అందంగానే ఉంటుంది. కానీ చదువు బొత్తిగా లేదు. అదీగాక ఆమె పల్లెటూరి వాతావరణంలో పుట్టి పెరిగింది. ఇంకా ఆనాటి అలంకరణలు ఆమెని వదల్లేదు. కట్టూ బొట్టూ అంతా పల్లెటూరి తరహాయే! అలాంటి అమ్మాయిని పెళ్లి చేసుకొంటే జీవితమంతా ఆమెను ఆధునికంగా మార్చడానికే సరిపోతుంది. తను ఉద్యోగరీత్యా ఎప్పుడూ పట్నాల్లోనే ఉండక తప్పదు. మరి పట్నం వాతావరణంలో ఇమడడం ఆమెకూ కష్టంగానే ఉంటుంది. అసలు తనక్కాబోయే భార్య అలంకరణల్లో ఆధునికంగా ఉండాలని తన కోరిక. అంటే కొంతయినా చదువుండాలి మరి! తమ ఆఫీసులోనే కొంతమంది

అమ్మాయిలున్నారు. వారిని చూస్తుంటే తనకెంతో ముచ్చటగా ఉంటుంది. మగాళ్లలాగానే పాంటూ, షర్టూ వేస్తారు. వాళ్ల మాటలూ చేష్టలూ అన్నీ వింతగా ఆకర్షణీయంగా కనబడతాయి తనకి. తన భార్య కూడా మరీ అలా కాకపోయినా కనీసం కొంతవరకయినా ఆధునికంగా ఉంటే బావుండు నన్న కోరిక కలిగింది. తను కోరుకున్నవన్నీ హేమలో కనిపించాయ్ తనకి. అన్నిటికీ మించిన అందం ఆమెకుంది.

కండక్టర్ గంట కొట్టాడు. బస్ బయల్దేరింది. శ్రీనివాసరావ్ ఆలోచనల్లోంచి బయటపడ్డాడు. బస్ వేగంగా పోతుంటే చల్లనిగాలి ఆహ్లాదంగా వీస్తోంది. అటూ ఇటూ పచ్చని పొలాలు సుందరంగా కనబడుతున్నాయి. బస్ ఉయ్యూరు చేరుకొనేసరికి సాయంత్రమయిపోయింది. బస్ దిగి రోడ్డువెంబడే నడువసాగాడతను. చాలా రద్దీగా ఉందా రోడ్డు. క్రిక్కిరిసిపోయిన జనం, బస్సులు, రిక్షాలు అన్నీ అక్కడే జామ్ అయిపోయినట్లున్నాయి. హోటళ్లల్లో నుంచి బిగ్గరగా సినిమా పాటలు వినబడుతున్నాయి. ఓ రిక్షా—జనం మధ్య నుంచి నెమ్మదిగా కదులుతూంది. అందులో ఓ వ్యక్తి మరి కాసేపట్లో ఆ ఊళ్లో ప్రారంభం కాబోతున్న ఓ రాజకీయ మహాసభకు రమ్మని మైకులో ప్రాథేయపడుతున్నాడు. శ్రీనివాసరావ్‌కి నవ్వొచ్చింది. తన చిన్నప్పటి నుంచీ ఈ ఊళ్ళోనే ఉన్నాడు తను. రాజకీయ పార్టీలు, సభలు ఎక్కువవుతున్నాయి గానీ ఊరు మాత్రం అలాగే ఉంది. ఏమాత్రం సౌకర్యాలు మెరుగుపడలేదు. మురికి గుంటలు మాత్రం ఎక్కువయ్యాయి. ఇంట్లో అడుగుపెడుతున్న అతనిని చూసి తల్లిదండ్రులు ఆశ్చర్యపోయారు.

“ఆదేమీటి? ఉత్తరం ముక్కయినా లేకుండా వచ్చేశావ్?” అన్నాడు తండ్రి శివరామయ్య.

“అనుకోకుండా వచ్చేశాను నాన్నా!” బూట్లు విప్పుతూ అన్నాడు శ్రీనివాసరావు.

“నాలుగు రోజులు శెలవు పెట్టావా మరి?” అడిగింది సీతమ్మ.

“రెండు రోజులుంటా. మళ్ళీ ఎలాగూ వచ్చే నెలలో పండక్కి రావాలికదా!”

“కాఫీ తెస్తానుండు...” హడావుడిగా వంటింటి వేపు నడిచిందామె. బట్టలు మార్చుకొని పడక్కుర్చీలో కూలబడ్డాడు శ్రీనివాసరావ్. సరిగ్గా అప్పుడే లోపలికి అడుగుబెడుతున్న నాగమణిని చూసి ఆశ్చర్యపోయాడతను. నాగమణి చేతిలో పుస్తకాలున్నాయి. అతనిని చూసి సిగ్గుపడి పైట సర్దుకొని లోపలకు వడివడిగా నడిచిందామె.

శ్రీనివాసరావ్ ఇంకా ఆశ్చర్యం నుంచి తేరుకోలేదు. అతని ఆశ్చర్యం గమనించిన శివరామయ్య నాగమణి గురించి చెప్పేడు.

“మరేం లేదు. నాగమణి మెట్రిక్ పరీక్షకు కడుతోందిట. త్వరలో పరీక్షలున్నాయి. ఈలోగా ట్యుటోరియల్ కాలేజిలో కొద్దిరోజులు చదువుకొందామని ఇక్కడికొచ్చింది. ఈ రెండు మూడు నెలలూ మనింట్లోనే ఉంటుంది.”

“అదా!” ఇంకా ఆశ్చర్యంతోనే అన్నాడు శ్రీనివాసరావ్.

అతనికి నవ్వు వచ్చింది. ఇప్పుడు చదువు మొదలెడుతోందా? ఎందుకు? ఈ వయసులో చదువుకొని ఏం చేయడానికి?

“కానీ ఇప్పుడు చదువు మీద శ్రద్ధ పుట్టుకొచ్చిందేమిటి వాళ్ళకి?” నవ్వుతూ అడిగాడతను.

శివరామయ్య కూడా నవ్వాడు.

“ఏదోలే-ఆ పిల్లకి చదువుకోవాలని ఉందట!”

ఈలోగా సీతమ్మ కాఫీ తీసుకొచ్చి అందించిందతనికి.

“నాగమణిని చూశావా?” అడిగిందామె నవ్వుతూ.

“ఆ! అదే అడుగుతున్నాను నాన్నని! మెట్రిక్‌కి వెడుతోందిటకదా!”

“అవును!” అని కొద్ది క్షణాలాగి అతని దగ్గరగా జరిగి రహస్యంగా చెప్పిందామె.

“అసలు మెట్రిక్ ఎందుకు చదువుతోందో తెలుసా? చదువులేని అమ్మాయిని చేసుకోనని నువ్వు అన్నావుకదా! అందుకని కోపం వచ్చి పట్టుదలతో చదువుతానని పేచీ పెట్టిందట! పెద్ద చదువులు చదివి ఉద్యోగం చేస్తుందట! అసలు పెళ్ళే చేసుకోదట....”

శ్రీనివాసరావ్ నిర్ఘాంతపోయాడు.

తను నిరాకరించడం వల్ల ఆమెలో పట్టుదల కలిగిందన్నమాట! చాలా మొండిమనిషిలానే ఉంది చూస్తుంటే. అంతలోనే ఆమె మీద జాలి కూడా కలిగిందతనికి. తను నిరాకరించడం వల్ల ఆమె బాగా ‘హర్ట్’ అయినట్లుంది. కానీ అందులో తన తప్పు మాత్రం ఏముంది? ఆమె నొచ్చుకుంటుందని తను తనకిష్టంలేని వివాహం ఎలా చేసుకోగలడు?

“మేమే నీకు ఉత్తరం. రాద్దామనుకుంటున్నాము రమ్మని. ఈలోగా నువ్వే వచ్చావు” అన్నది సీతమ్మ.

“ఎందుకు?”

“ఇక్కడ రెండు సంబంధాలు వచ్చాయి నీకు. అమ్మాయి లిద్దరూ చదువుకున్నవారే! అన్నివిధాలా



గంటి కృష్ణవేణమ్మ

కవిత్వంలో పేరు గడించి ప్రఖ్యాతి చెందిన వనిత – శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ. పండిత వంశంలో జన్మించిన కృష్ణవేణమ్మ తాతగారు నాగపూడి కుప్పుస్వామయ్య గొప్ప పండితులు, విమర్శకులు. ఈమెకు కవితా గురువు వీరే. కృష్ణవేణమ్మ తల్లి సుబ్బలక్ష్మమ్మ కూడా కవయిత్రి కావడం విశేషం. ఆమె ‘చంద్రకళా విలాసం’ అనే కావ్యాన్ని రాశారు.

‘సరస కవయిత్రి’గా పండితుల ప్రశంసలు అందుకున్న కృష్ణవేణమ్మ రాసిన ‘సైరంధ్రి’ కావ్యం 1947లో గృహలక్ష్మి పత్రికలో వెలువడి ఆమెకు గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని తెచ్చి పెట్టింది. 1970లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సహాయంతో ‘గిరిజా కల్యాణం’ అనే కావ్యాన్ని వెలువరించారు. రాధాకృష్ణుల ప్రణయతత్వాన్ని చూపే ‘పవనదూతం’ కావ్యమూ, శ్రీ రాజరాజేశ్వరీశతకం, కామాక్షీ శతకం ఆమె రచించిన ఇతర కృతులు.

—రావినూతల రాజ్యలక్ష్మి

దొరుకున్నాయి ఈ సంబంధాలు! నువ్వు చూసి, నీకు నచ్చితే వచ్చే నెలలో ముహూర్తాలున్నాయట!..."

శ్రీనివాసరావుకి నవ్వొచ్చింది.

"ఇంక సంబంధాలు చూసే పని లేదమ్మా!" అన్నాడు నవ్వుతూ.

సీతమ్మతోపాటు శివరామయ్య కూడా అర్థం కానట్లు కొడుకువేపు చూశాడు.

"నేనే ఓ సంబంధం చూశాను. మీ ఇద్దరూ వెళ్ళి వాళ్ళతో మాట్లాడి రావాలి. ఎప్పుడు వెళ్ళాలో నేనే ఉత్తరం రాస్తాను మీకు...." అన్నాడతను వివరంగా.

"ఎవరు వాళ్ళు?" అని అడిగాడు శివరామయ్య.

"మన కులం కాదు. వాళ్ళ స్వస్థలం గుడివాడ! నాతోపాటు పని చేస్తున్న మా స్నేహితుడికి బంధువులే! అమ్మాయిని హైద్రాబాద్‌లో నేను చూశాను. మాట్లాడాను. అన్నివిధాలా నాకు నచ్చింది...."

కొద్దిక్షణాలు నిశ్శబ్దం ఆవహించింది గదిలో....

"నీకు నచ్చితే ఇక మాదేముంది?" నిర్ణయించుకున్నట్లు అన్నాడు శివరామయ్య, అక్కడి నుంచి బయటికి వెళ్ళుతూ.

శ్రీనివాసరావు ఏమీ మాట్లాడలేదు. అతను తన తల్లినే గమనిస్తున్నాడు. ఆమె లోలోపల కొంచెం బాధపడుతోందని తెలుస్తూనే ఉంది. కులం గాని పిల్ల అనేసరికి ఎవరికయినా అది సహజమే. తండ్రి తనను కాదనలేక ఆ మాట అని వెళ్ళిపోయాడని కూడా తనకు తెలుసు.

తను నెమ్మదిగా నచ్చజెప్పాలి వారిద్దరికీ. ఏ విషయంలోనయినాసరే తన అభిప్రాయం ప్రకారమే నడుచుకోవడం వాళ్ళకెలాగూ అలవాటయింది కనుక దీనికి అంగీకరింపజేయడం పెద్ద సమస్యేమీకాదు.

పొద్దు గూకుతోండగా బోసు వచ్చాడింటికి.

"ఎప్పుడు వచ్చావన్నయ్యా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఇందాకే వచ్చాను! నువ్వింత ఆలస్యంగా వస్తున్నావేమిటి స్కూలు నుంచి?"

"ఫుట్‌బాల్ ప్రాక్టీస్ చేస్తున్నామన్నాయ్! వచ్చే నెలలో ఇంటర్‌స్కూల్ గేమ్స్ ఉన్నాయి. మా స్కూలు-టీమ్‌లో నేనూ ఉన్నాను...."

"గుడ్! మరి చదువు ఎలా వుంది?"

"బాగానే ఉంది. కొంచెం మాత్స్‌లో వీక్‌గా ఉన్నాను. అందుకని ట్యూషన్‌లో చేరాను...."

"ఎన్నిగంటలకు ట్యూషన్‌కెళ్ళాలి?"

"ఇప్పుడే! భోజనం చేసి వెళ్ళిపోతాను!" హడావుడిగా లోపలకు నడుస్తూ అన్నాడతను.

మరి కాసేపట్లో భోజనం చేసి మళ్ళీ పుస్తకాలు తీసుకుని వచ్చాడు బోసు.

"నే వెళ్తున్నానన్నాయ్!" అనేసి బయటికెళ్ళిపోయాడు.

శ్రీనివాసరావ్ లేచి డాబా మీద కెక్కాడు. డాబా మీద కూర్చుని ప్రశాంతంగా గడపడం తనకు చాలా ఇష్టం! చదువుకొనే రోజుల్లో స్కూలు నుంచి రాగానే పుస్తకాలు తీసుకొని డాబా ఎక్కి, ప్రొద్దు గూకేవరకూ అక్కడే చదువుకొనేవాడు.

డాబా మీద ఓ మూలగా కూర్చుని ఉన్న నాగమణిని చూడగానే గతుక్కుమన్నాడతను. ఆమె ఏవో పుస్తకాలు చదువుతోంది. ఆమె ఎదుటపడాలంటే ఎందుకో గిల్టీగా ఉంది. కానీ ఆమె తనను గమనించనే గమనించింది. ఇప్పుడు డాబా దిగిపోవడం కూడా అంత సమంజసంగా ఉండదు. తనసలు ఆమెతో మాట్లాడ్డానికి కూడా ఇష్టపడటం లేదని నాగమణి అనుకొనే ప్రమాదం ఉంది.

"ఇక్కడున్నావా నాగమణీ?" చిరునవ్వుతో ఆమె దగ్గరకు నడిచి అడిగాడతను. ఆమె ఛటుక్కున లేచి నిలబడింది.

"అవును! చదువుకొంటున్నాను...." సిగ్గుపడుతూ అంది.

"మీ అమ్మానాన్నా అంతా బావున్నారా?"

"ఆ! బాగానే ఉన్నారండి!"

"మీ పరీక్షలెప్పుడు?"

"ఇంకా మూడు నెలలున్నాయి!"

"ట్యుటోరియల్ కాలేజిలో బాగా చెప్తున్నారా?"

"ఆ! ఫరవాలేదు! అయినా నేను ఇంటి దగ్గర అన్నీ చదివేశానెప్పుడో. పరీక్షల్లో జవాబులు రాసే విధం తెలీక ఇక్కడ చేరాను...." తల వంచుకొని అందామె.

"ఓహో...."

కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా గడచినయ్.

"నేను కిందకెళ్తాను...." అంటూ అక్కడి నుంచి నడువబోయిందామె.

"అగు నాగమణీ! నువ్వు చదువుకో! నేను వెళ్ళిపోతాను!" అన్నాడు శ్రీనివాసరావ్.

నాగమణి నిలబడిపోయింది "ఎలాగూ చీకటి పడుతోంది లెండి! కిందే చదువుకుంటాను...." అంది.

"మెట్రిక్ పాసయాక ఏం చేద్దామని? ఇంకా చదువుతావా?" అడిగాడతను.

"చదవాలనే అనుకుంటున్నాను. కానీ మరి మా అమ్మా, నాన్నా ఏమంటారో తెలీదు!" చిన్నగా నవ్వుతూ అందామె.

"నీకు ఇప్పుడు చదువు మీద శ్రద్ధ కలిగిందేమిటి?" నవ్వుతూ అడిగాడతను. నాగమణి సిగ్గుపడింది.

"ఏమో! ఇంతకాలం నేనూ అడగలేదు, మావాళ్ళూ పట్టించుకోలేదు! ఇప్పుడు కదా నాకు చదువు ఉపయోగం తెలిసింది!"

ఆ మాట తనను చిన్నబుచ్చడానికే అన్నట్లు అనిపించింది తనకి.

కొద్ది క్షణాలు నిశ్శబ్దంగానే నిలబడ్డా రిద్దరూ. అతనేమీ మాట్లాడకపోవడం గమనించి నెమ్మదిగా మెట్లు దిగి కిందకు వెళ్ళిపోయిందామె.

చాలాసేపు ఆ చీకట్లోనే నాగమణి గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు శ్రీనివాసరావ్. ఆమె మీద ఎందుకో సానుభూతి కలిగిందతనికి.

*

శ్రీనివాసరావ్ వెళ్ళిపోయాక హేమ చాలాసేపు అతని గురించే ఆలోచిస్తూ ఉండిపోయింది. హైద్రాబాద్‌లో కలసివున్న ఆ కొద్దిసేపట్లోనే అతనిని తను అంతగా ఆకర్షించిందంటే ఆశ్చర్యంగా ఉంది.

బహుశా అతని కోరికకు తండ్రి అంగీకరించవచ్చు! మరి తన సంగతేమిటి? అతని మీద తనెలాంటి అభిప్రాయమూ ఏర్పరుచుకోలేదు. కాని అతనితో మాట్లాడిన కాసేపట్లో ఓ విషయం గ్రహించింది తను. అతనికి 'స్త్రీ' మీద సానుభూతి ఉంది. సంఘంలో ఆమెకు అన్యాయం జరుగుతోందని అతనూ వప్పుకొన్నాడు. తన ఆలోచనా ధోరణికి, అతని ఆలోచనలకూ పొంతన ఉంది. కనుక అతనిని తను చేసుకొంటే మరింత దీక్షతో తను నారీసమితి కార్యక్రమాలు నిర్వహించగలదు. అతని సహకారం కూడా తనకు లభిస్తుంది.

సాయంత్రం తండ్రి ఇంటికొచ్చేలోగానే అతనిని అంగీకరించాలనే నిర్ణయానికొచ్చిందామె.

రామరాజు ఇంటికొస్తూనే సౌభాగ్యమ్మను పిలిచాడు. ఇద్దరూ చాలాసేపు శ్రీనివాసరావ్ గురించి మాట్లాడుకొని తరువాత హేమను పిలిచారు.

# వీటిలో మీ వ్యక్తిత్వాన్ని చూపించేది ఏది?




# ఆ 'పాయిజ్'ని మీకు మీరే ఎంచుకోండి

సమ్మోహింపజేసేది. అలౌకికమైనది. ఉవ్విళ్ళూరించేది. రోమాంచితమైనది. వాటిలో ఓ సువాసన మీకోసం, మీరు మనసుపడేదది!

**పాయిజ్ షాంతెల్**

తాజాగా, ఉత్తేజంగా, హిమాన్ని చుంబించిన మొగ్గలు. అడవి పూల, వెంటాడే ఆ అనుభూతి. వెంటే నిలిచి కదలాడే మీకోసం కూర్చిన ఆ సుగంధం. షాంతేల్, మరుపురాని సుగంధం. దానిని అలుముకున్న సుందరిలాగే.

**పాయిజ్ ఓ-ద-జాస్మిన్**

తాజాగా అప్పుడే విరిసిన మల్లెల చెండులా మత్తెక్కించేది, ఉత్తేజపరిచేది.

**పాయిజ్ స్ప్రే పెర్‌ఫ్యూమ్**

చౌరవైన, కల్పించే మూడు సువాసనలలో, మీ వ్యక్తిత్వాన్ని పట్టి పట్టి చూపించేది. మస్క్! మిస్టిక్! కోలోన్!

**పాయిజ్ ఓ-ద-లవాండ్**

లవండర్ చలు - మృదువుగా, సుతిమెత్తగా, తియ్యగా, కలలాగ.

**పాయిజ్ ఓ-ద-వెటివర్**

వెటివర్ యొక్క దోచేసే సుగంధం, ఉత్సాహం, ఉల్లాసం, అన్ని దీన్లో.

మీ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకండి.

# పాయిజ్

హేండ్ కర్చీఫ్ పెర్‌ఫ్యూమ్స్.

మార్కెట్ చేసేవారు: రాలీస్ ఇండియా లిమిటెడ్

ULKA-PP-3 TEL

ఈమధ్య ఓ నలభై నాలుగేళ్ళ స్త్రీయొక్క పళ్ళులేని నవ్వు డాక్టర్ నోబర్ట్ కె. అనే దంతవైద్యుడి పాలిటి తొంభై వేల రూపాయల శాపమైంది. ఆ జరీమానా చెల్లించడమేకాక మరో ముప్పైఒక్కవేల ఐదు వందల రూపాయలు నష్టపరిహారంగా కూడా అతనామెకి యివ్వాల్సి వచ్చింది.

ఇంతకీ కథేమిటీ అంటే విపరీతమైన తలనొప్పితో బాధపడుతున్న ఆ యువతి అది పంటినొప్పివల్లే వచ్చిందనుకుని ఈ డాక్టర్ దగ్గరకి వెళ్ళింది. అదీ ఆమె చేసిన తప్పు. ఆ వైద్యుడు కాస్తా ఆమె పళ్ళన్నీ పీకేశాడుట. అయితే పాపం ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఆమె బాధ పడకుండా ఓ మత్తు ఇంజెక్షన్ యిచ్చాడట.



ఆపరేషన్ పూర్తయిన తర్వాత తలనొప్పి పూర్తిగా తగ్గిపోయినట్టనిపించేసరికి హాయిగా నవ్వుతూ ఎదురుగా వున్న అద్దంలో చూసుకుందిట. అంతే. ఒక్కసారి గాభరాపడి కెవ్వుమని అరిచింది. డాక్టర్ నోబర్ట్ మీద మండిపడింది. "నిన్నెవడు పళ్ళన్నీ పీకమన్నాడు. దంతాలు శుభ్రం చేసి, దంతాల మధ్య వున్న సందులు పూడ్చమన్నాను." అందిట.

కోర్టులో జడ్జివారి ఎదుట—"నా దగ్గరకి ఆమె తలనొప్పి అని వచ్చినమాట నిజమే. అది పంటినొప్పివల్లే వస్తోంది కాబట్టి 'పీకెయ్' అంది. పీకేశాను. ఇందులో నా తప్పేంలేదు మొర్రో'' అని మొత్తుకున్నాడు.

నిజానికి అతనికి ఆ పూడ్చడమన్నది పూడ్చడం కింద వినిపించి వుండాలి. పూడ్చడం అంటే లాగివేయుట అంటే దంతభాషలో పీకివేయుట అని అనుకుని ఆ దంతవైద్యుడు పళ్ళు పీకేశాడు!

"ఏమిటి డాడీ?'' అక్కడికొచ్చి కూర్చుంటూ అంది హేమ. తల్లిదండ్రుల దగ్గర ఆ విషయం మాట్లాడాలంటే కొంచెం ఇబ్బందిగా ఉందామెకి.

"శ్రీనివాసరావ్ విషయం మాట్లాడదామని పిలిచానమ్మా! అతనిని చేసుకోవడానికి నీకేమయినా అభ్యంతరం ఉందా?''

హేమ నవ్వింది.

"నాకేమీ లేదు డాడీ!'' నవ్వుతూ అంది.

"అలాగయితే మరి అతనికి ఉత్తరం రాసేస్తాను రేపే!'' అన్నాడు అతను తేలికపడ్డ మనసుతో. సౌభాగ్యమ్మ మాత్రం ఎటూ చెప్పకుండా ఊరుకుండిపోయింది. సుధీర్ చేసుకోనన్న తరువాత ఇంకెవరయినా ఒకటేనని ఆమె ఉద్దేశ్యం. సాయంత్రం ఆరు దాటాక రిక్షాలో వసుంధర వాళ్ళింటికి చేరుకుంది హేమ. అప్పటికే బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నారు వాళ్ళు. మరి కాసేపటి తర్వాత అందరూ కలిసి రైలు స్టేషన్‌కి చేరుకున్నారు.

అక్కడ సామానుతో వేచి ఉన్న చంద్రకాంత్ వసుంధరతోపాటు వస్తూన్న హేమను చూసి సంబరపడిపోయాడు.

"మీరు రారేమో అనుకున్నాను.'' అన్నాడు ఆనందంగా.

"రాకపోతే వసుంధర ఊరుకుంటుందా?'' నవ్వుతూ అన్నది హేమ.

ముగ్గురూ సిమెంట్ బెంచీ మీద కూర్చున్నారు.

"మళ్ళీ ఎప్పటికో నిన్ను చూడడం!'' బాధగా అంది వసుంధర.

"ఎప్పటికోనా? మూడు నెలల్లో హైద్రాబాద్ రానూ?''

వసుంధరా, చంద్రకాంత్ ఆశ్చర్యంగా ఆమె వేపు చూశారు.

"హైద్రాబాద్ వస్తున్నారా?'' నమ్మలేనట్లు అడిగాడు చంద్రకాంత్.

"అవును! రావడమే కాదు! నేనూ అక్కడే ఉంటానప్పటి నుంచీ!''

"అబద్ధాలన్నీ'' అన్నది వసుంధర కొట్టి పారేస్తూ.

"నీ ఇష్టం! నువ్వెలా అనుకున్నా సరే!''

"పోనీ! అక్కడకు ఎందుకు వస్తున్నారో చెప్పకూడదూ? ఉద్యోగం దొరుకుతోందా?'' అడిగాడు చంద్రకాంత్.

"ఊహూఁ! కాదు!''

"మరి?''

"మీ ఇద్దరూ చెప్పగలరేమో ప్రయత్నించండి!'' నవ్వు బిగపట్టుకుంటూ అందామె. కొద్దిసేపు ఆలోచనలో పడ్డారిద్దరూ.

"మీకూ బదిలీ అవుతోందా?''

"ఊహూఁ! మా డాడీ ఇక్కడే రిటయిరవుతారు! కనుక బదిలీ ప్రసక్తేలేదు?''

"ఇంకేమిటి మరి?'' అడిగాడతను.

"ఆ! తెలిసింది!'' తలూపుతూ అన్నది వసుంధర.

"ఏమిటది?'' అడిగింది హేమ.

"అర్థమయిందిలే! నీ వివాహం జరుగుతుంది! నీకు కాబోయే శ్రీవారు హైద్రాబాద్‌లోనే పని చేస్తారు! కరెక్టేనా?''

హేమ నవ్వేసింది "అవును!''

"చూశావా! నేను చెప్పలే....''

ఇద్దరూ గట్టిగా నవ్వేశారు. కానీ చంద్రకాంత్ మొఖం వాడిపోయింది. అకస్మాత్తుగా హేమ చెప్పిన వార్తను తట్టుకోలేకపోతున్నాడు అతను. హేమకు ఏదో ఒక రోజు వివాహమవుతుందన్న ఆలోచనే ఇంతవరకూ రాలేదు తనకు. అకస్మాత్తుగా ఆమెకూ తనకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడి పోయినట్లు అనిపించసాగింది. గుండెలు పిండేస్తున్నట్లు బాధ! హేమను బలవంతంగా ఎవరో తనకు దూరం చేస్తున్నట్లనిపించసాగింది. మనసు విలవిలలాడిపోతోంది. కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినాయి అతనికి. అతికష్టం మీద దుఃఖం ఆపుకోడానికి ప్రయత్నించసాగాడు. [సశేషం]



మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళా సాగర్' తమిళనాడు గవర్నర్ శ్రీ ప్రభుదాస్ పట్వారి సమక్షంలో ఏర్పాటుచేసిన 'బాలోత్సవ్' కార్యక్రమంలో కరాటే విన్యాసాలు చేసి 'కళా సాగర్' వారి మెమెంటోను అందుకుంటున్న విజయవాడ విద్యార్థిని కుమారి సుమ.

ఖర్గపూర్‌లోని ప్రవాస ఆంధ్ర నవ్యకళా పరిషత్తు వారు ఘంటసాల వర్ధంతి సందర్భంగా అఖిల భారత స్థాయిలో జరిపిన పాటల పోటీలలో ప్రథమ బహుమతి అందుకుంటున్న డి. నాగమణి (ఖర్గపూర్), ద్వితీయ బహుమతి ఎల్. విజయలక్ష్మి (పర్లాకిమిడి) తృతీయ బహుమతి ఎన్. దమయంతి (ఖర్గపూర్) లకు లభించాయి.





హైదరాబాద్ గాంధీ భవన్‌లో ఇటీవల పంజగుట్ట అభ్యుదయ మహిళా సమాఖ్య వారు "సంఘంలో స్త్రీ స్థానం" అనే అంశంపై ఈ సదస్సు జరిపారు. ఈ సదస్సులో శ్రీమతి రాజ్యం సిన్హా, డా॥ రాజ్యలక్ష్మి, శ్రీమతి వి. లక్ష్మీదేవి, డా॥ రావి భారతి, డా॥ రమా మెల్‌కోటే, శ్రీమతి శారదా అశోక వర్ధన్, శ్రీమతి పుత్‌లీబాయి పాల్గొన్నారు. రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ సలహా మండలి అధ్యక్షురాలు శ్రీమతి దుర్గా భక్తవత్సల్ సభాధ్యక్షత వహించారు.

సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో

# వార్తావనిత




లయన్ లేడీస్ క్లబ్, విశాఖపట్నం (నార్తు) వారు రాణీ చంద్రమణీదేవి హాస్పిటలు దగ్గరి ఈస్టు పాయింట్ కాలనీలో ఉచిత ఆయుర్వేద క్లినిక్ ప్రారంభించిన సందర్భంగా ముఖ్య అతిథి, లయన్ లేడీస్ కో-ఆర్డినేషన్ ఛెయిర్మన్ డా॥ పద్మినీ చెంగల్ రాయ్ ప్రసంగిస్తూన్న దృశ్యం. వేదికపై లయన్సు క్లబ్ నార్తు కార్యదర్శి శ్రీ రామకృష్ణారావు, లయన్ లేడీస్ నార్తు క్లబ్బు అధ్యక్షురాలు శ్రీమతి టి. సరస్వతీదేవి ఉన్నారు. —విలేకరి

రాజమండ్రి ఇన్నర్ వీల్ క్లబ్ వారు ఇటీవల కడియం గ్రామంలోనూ, ఆ పరిసర ప్రాంతాల సోమా వేయిమందికి పైగా పేద యువతులకు, బాలలకు ఉచిత వైద్య సదుపాయాలను, మందులను అందజేశారు. క్లబ్ అధ్యక్షురాలు మృదులా కమలాకర్ అధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమంలో నలుగురు డాక్టర్లు, ముగ్గురు నర్సులు పాల్గొన్నారు. ఈ చిత్రంలో రోగులకు మందులు ఇస్తున్న డాక్టర్ కస్తూరి వెంకట్రావ్ వున్నారు.





స్త్రీ జన సంక్షేమానికై తమ మండలి కృషి చేస్తున్నదని, సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి మల్లాది వెంకట సుబ్బమ్మ చెప్పారు. శ్రీమతి వాశిరెడ్డి కాశీ రత్నం ఉపన్యాసకులను పరిచయం చేసారు.

'సమాజంలో స్త్రీ స్థానం' అనే అంశాన్ని గురించి ప్రసంగిస్తూ, డా॥ రావి భారతి, స్త్రీలు మూఢాచారాలను వదలుకోవాలనీ, వ్రతాలు, నోములపై కంటె విజ్ఞాన సముపార్జనపై దృష్టి కేంద్రీకరించాలనీ అన్నారు. స్త్రీ జనాభ్యుదయం కోసం ఒక ఆరు సూత్రాల పథకాన్ని కూడా ఆమె సూచించారు—

—మృణాళిని



ఢిల్లీ కంటోన్మెంట్ గారిసన్ మైదానంలో రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా భారత సైనిక దళాల అధిపతి జనరల్ ఒ. పి. మల్‌హెూత్రా దిగ్విజీకృతమైన సేవ చేసినందుకు గాను ముప్పైఐదుమంది సైనిక సిబ్బందికి సేనా పతకాలు, విశిష్ట సేవా పతకాలు బహూకరించారు. ఈ చిత్రంలో మిలిటరీ నర్సింగ్ సర్వీస్‌కి చెందిన మేజర్ (కుమారి) కె. టి. గురుంగ్ సైన్యాధ్యక్షుడి వద్ద నుంచి విశిష్ట సేవా పతకాన్ని అందుంటుకున్నారు. రెండవ చిత్రం – గర్హ్వాల్ రైఫిల్స్‌కి చెందిన రైఫిల్ మాన్ కీ.శే. రఘుబీర్ సింగ్ బుటోలాకి వచ్చిన సేనా పతకాన్ని సైన్యాధ్యక్షుడి వద్దనుంచి అతని భార్య అందుకుంటున్న దృశ్యం.



అవంతపురం రాయల కళా గోష్ఠి వారు ఇటీవల మహిళా సదస్సును ఏర్పాటు చేశారు. డాక్టర్ యం. కె. దేవకి అధ్యక్షత వహించిన ఈ సదస్సులో కొలకలూరి స్వరూపారాణి, ప్రమీలా జనార్ధన్ పాల్గొన్నారు.

హైదరాబాదులోని ఇందిరా ప్రియదర్శిని హాలులో వెంగళరావు కాలనీ 'ఆదర్శ మహిళా మండలి' తృతీయ వార్షికోత్సవం జరిగింది. ఈ సమావేశానికి ప్రఖ్యాత నవలా రచయిత్రి రాష్ట్ర యువజన సంక్షేమ శాఖ డిప్యూటీ డైరెక్టర్ కుమారి వాసిరెడ్డి సీతాదేవి అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ సలహా మండలి అధ్యక్షురాలు శ్రీమతి దుర్గా భక్తవత్సల్ ముఖ్య అతిథిగా కార్యక్రమంలో పాల్గొన్నారు.

మండలి ఉపాధ్యక్షురాలు శ్రీమతి సి. లలిత స్వాగతం పలికిన తరువాత, శ్రీమతి దుర్గా భక్తవత్సల్ ప్రసంగించారు.

కుమారి వాసిరెడ్డి సీతాదేవి మాట్లాడుతూ, మహిళా మండలి సభ్యులు స్త్రీలలో నిరక్షరాస్యతను నిర్మూలించేందుకు ప్రయత్నించాలన్నారు. మహిళా మండలుల సమాఖ్యలన్నీ కలసి, అనాథశరణాలయాన్ని నిర్మించాలని ఆమె సూచించారు.

కార్యదర్శి శ్రీమతి ఎం. మహాలక్ష్మి తమ నివేదికలో మండలి జరుపుతున్న వివిధ కార్యక్రమాలను వివరించారు.

అనంతరం మహిళామండలి బాల విభాగం సభ్యులు సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శించారు.

—మృణాళిని





హైదరాబాదు-ఇందిరా ప్రియదర్శిని ఆడిటోరియంలో జరిగిన బాలల నాటిక పోటీలలో గెలుపొందిన బాలలకు గవర్నరు శ్రీ కె. సి. అబ్రహాం బహుమతులను పంచిపెట్టారు. ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో స్త్రీ, శిశుసంక్షేమశాఖ మంత్రి శ్రీమతి రోడామిస్త్రీ, గవర్నరు, గవర్నర్ సతీమణి వున్నారు.

—మల్లిడి కనకరత్నం

విశాఖపట్నం రోటరీ క్లబ్ సభ్యుల భార్యల కొరకు స్థాపింపబడిన ''ఇన్నర్ వీల్'' సభ్యురాండ్రకు రోటరీ పాస్టు గవర్నరు శ్రీ జి. ఎస్. కె. ఆర్య శాకాహారపు వంటలలో కొన్ని ప్రత్యేకతల్ని ప్రయోగాత్మకంగా బోధపరుస్తూన్న దృశ్యం.

—విలేకరి



మచిలీపట్నం శ్రీ విద్యాభివర్ధని సంఘం అధ్వర్యంలో నడవబడుతున్న క్రెష్ (శిశువిహార్) వారు ఇటీవల బాలల విచిత్ర వేషధారణ పోటీలు ఏర్పాటు చేశారు.



విశాఖపట్నం (నార్తు) లయన్ లేడీస్ క్లబ్బు, విశాఖ సిటీ లయనెస్ క్లబ్బులు ఇటీవల సంయుక్తంగా స్థానిక లయన్సు కమ్యూనిటీ హాలులో ''బాలలు-చట్టమూ-సంక్షేమం'' అనే అంశంపై ''వర్కుషాప్'' (సదస్సు) ను నిర్వహించారు. నగరంలోని మేధావి వర్గానికి చెందిన అనేక పుర ప్రముఖులు పాల్గొన్న ఆనాటి సదస్సుకు విశాఖ డిస్ట్రిక్టు అండ్ సెషన్సు జడ్జి శ్రీ జి. రాధాకృష్ణారావు, ఆంధ్రా యూనివర్శిటీ ''లా'' డిపార్టుమెంటు ప్రొఫెసరు శ్రీ బి. ఎస్. మూర్తి, రిటైర్డు పేడియాట్రిక్సు ప్రొఫెసర్, డా॥ డి. గోపాలస్వామి వర్క్‌షాప్ లీడర్సుగా వ్యవహరించారు. వారితోపాటు ఫోటోలో కనపడుతున్న లయన్ డి. సిహెచ్. తిరుపతిరాజు (విశాఖ పోర్టు ట్రస్టు), లయన్ లేడీ టి. సరస్వతీదేవి (అధ్యక్షురాలు-నార్తు క్లబ్), న్యాయవాది లయనెస్ దిగుమర్తి సరస్వతీదేవి (అధ్యక్షురాలు-లయనెస్ క్లబ్బు), డా॥ జయా నాగరాజ్ (విశాఖ మెంటల్ కేర్ హాస్పిటల్ సూపరింటెండెంటు) కాక విశాఖ వాహి స్కూల్ ప్రిన్సిపాల్ శ్రీమతి డి. లక్ష్మినరసమ్మ, ఆంధ్రా యూనివర్శిటీ సోషల్ వర్క్ విభాగం ఉపన్యాసకురాలు శ్రీమతి కె. విజయలక్ష్మి, లయన్ లేడీస్ క్లబ్బుల ''కో-ఛెయిర్మన్లు'', డా. పద్మినీ చెంగల్ రాయ్, శ్రీమతి అష్మా మెహదీలు ప్రసంగించారు. చివరగా పాస్టు డిస్ట్రిక్టు గవర్నరు, (న్యాయవాది) లయన్ డి. వి. సుబ్బారావు వక్తల అభిప్రాయాలను సమీక్షించి వ్యాఖ్యాతగా వ్యవహరించి సదస్సును పరిసమాప్తి గావించారు. లయన్ లేడీ టి. సరస్వతీదేవి వందన సమర్పణ చేసారు.

—విలేకరి




ఇండియన్ వుమెన్ సైంటిస్ట్స అసోసియేషన్ (ఐ. డబ్ల్యు. ఎస్. ఎ.) హైదరాబాదులోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ భవనంలో సదస్సు జరిపారు. 'భారత దేశంలో ప్రచారంలో వున్న వైద్య విధానాలు అనే అంశంపై ఈ సదస్సు జరిగింది.

ప్రశ్నోత్తర పద్ధతిలో సాగిన ఈ సదస్సులో సంఘ సభ్యురాలు డా॥ కమలా కృష్ణస్వామి మాడరేటర్‌గా వ్యవహరించారు. యునానీ గురించి డా॥ హకీమ్ ఇక్బాల్, ఆయుర్వేదం గురించి డా॥ రామ్‌నివాస్ శర్మ, హెూమియోపతి గురించి డా॥ ఎ. నాగరాజ్, అలోపతి గురించి డా॥ బ్రహ్మాజీరావ్, ప్రకృతి వైద్యం గురించి డా॥ సరస్వతీ రావ్ అనేక విశేషాలు తెలియజేశారు.

సంఘ కార్యదర్శి శ్రీమతి భార్గవ స్వాగతోపన్యాసంలో తమ సంస్థను 1973 లో బొంబాయిలో స్థాపించారనీ, హైదరాబాదు నగర విభాగం 1978 లో ఏర్పడిందనీ అన్నారు. స్త్రీలలో శాస్త్ర విజ్ఞానం పట్ల అభిరుచినీ, అవగాహననూ పెంపొందించడం తమ సంస్థ ధ్యేయమని చెప్పారు.



# వైద్యసలహాలు

-డాక్టర్

ఎస్. సి.

నా వయసు పందొమ్మిది సంవత్సరాలు. సంవత్సరం క్రితం పెళ్లయింది. పెళ్ళికి పూర్వం నుంచే నాకు తరచు తలనొప్పి వస్తూ వుండేది. ఇప్పుడు మరీ ఎక్కువయింది. కాస్సేపు చాదివితేచాలు వెంటనే తలపోటు వచ్చేస్తుంది. డాక్టర్‌ను సంప్రదించాను. మాత్రలు, టానిక్ రాసిచ్చారు. వాడాను. అయినా బాధమాత్రం తగ్గలేదు. ఏం చెయ్యమంటారు? దయచేసి చెప్పగలరు.

రోజూ సక్రమంగా నిర్ణీతసమయంలో మలమూత్రాల విసర్జన జరుగుతోందా చూడండి. అలా కానప్పుడు ఆహారంలో ఆకుకూరలు, అరటిపళ్ళు విధిగా చేర్చుకోవాలి. బాగా నీళ్ళు తాగాలి. శరీరానికి తగినంత వ్యాయామం లేకపోయినా తలపోటు రావడానికి అవకాశం వుంది.

బి. యస్.

మా అబ్బాయికి ఐదేళ్ళు నిండాయి. యు. కె. జి. చదువుతున్నాడు. అయినా ఇంకా ఎ బి సి డి లు కూడా రావడం లేదు. ఎన్నిసార్లు చదివించినా మరచిపోతూ వుంటాడు. సరిగ్గా మాట్లాడడం కూడా చేతకాదు. ప్రతిదీ లేట్. వాడి విషయం మాకు చాలా బెంగగా వుంది. దయచేసి దీనికి ఒక దారి చూపండి డాక్టర్.

మీ బాబుకి పుట్టుకనుంచే మెదడు పని చేయడంలో లోపం వుందని తెలుస్తోంది. ప్రస్తుతం ఆడుకుంటూ మిగతా విషయాలలో మామూలు పిల్లల లాగా వుండడమే ఎంతో గొప్ప. చాలామందికి ఇది కూడా పెద్ద సమస్యగా వుంటుంది. అందువల్ల మీ అబ్బాయిని బలవంతంగా చదివించి ఇబ్బంది పెట్టకండి. ఎందుకంటే పర్యవసానాలు ప్రతికూలంగా వుండవచ్చు. అబ్బాయిని యు. కే. జి. లోనే రెండు మూడేళ్ళు వుంచడం మంచిది. వాడి మెంటల్ ఏజ్ పరిశీలించి, దానికి తగ్గట్టు ఆ తరగతిలో చేర్చడం అవసరం. ఆ తర్వాత నిదానంగా చాలా ఓర్పుతో మందలించకుండా మంచితనంగా చదివించడానికి ప్రయత్నించాలి. అన్నిటికన్నా మీ బాబుని పిల్లల వైద్య నిపుణులకు చూపించి వారి సలహా మేరకు నడచుకోడం మరీ మంచిది.

ఎల్. ఎం.

నా వయసు ఇరవైనాలుగు సంవత్సరాలు. ఇంకా పెళ్ళికాలేదు. గత జనవరిలో రక్తదానం చేశాను. మేము శాఖాహారులము. ఇప్పుడు నాకో సందేహం కల్గింది. శాఖాహారం తీసుకునే పెళ్ళి కాని స్త్రీలు రక్తదానం చెయ్యడం మంచిది కాదని విన్నాను. ఇది ఎంతవరకు నిజం? అలా కానప్పుడు ఎన్నాళ్లకో సారి రక్తం ఇవ్వవచ్చు?

ఆరోగ్యంగా వుండే స్త్రీపురుషులిద్దరూ మూడు నెలలకోసారి రక్తం ఇవ్వవచ్చు. అందుకు శాఖాహారులా? మాంసాహారులా? స్త్రీలా? పురుషులా? పెళ్లయిందా? లేదా? అని సందేహించవలసిన అవసరం లేదు.

ఏ. పి.

మా అత్తగారికి నడుం చుట్టూ బట్టకట్టుకునే చోట పొడలా వుండేది. ప్రభుత్వ ఆస్పత్రికి వెళ్ళి చూపాము. ఏదో మందు రాసి పంపారు. అయితే ఆ పొడ కాస్తా ఒళ్ళంతా వ్యాపిస్తోంది. దురదతో అవస్థపడుతున్నారు. దయచేసి దీనికి నివారణోపాయం చెప్పరూ?

ఇది చర్మ సంబంధమైన వ్యాధి. అందువల్ల మొదట మలం, మూత్రం వైద్య పరీక్ష చేసి చర్మ వ్యాధి నిపుణుని సంప్రదించి చికిత్స పొందితే నయమైపోతుంది.

ఆర్. డి.

నా మనవడికి ఎనిమిదేళ్ళు. మరీ సన్నగా వుంటున్నాడు. వాడు బొద్దుగా రావాలంటే ఏం చెయ్యాలి?

బలవర్ధకమైన ఆహారం ఇవ్వండి. శరీరం లావుగా వుండడమే ఆరోగ్యచిహ్నం కాదు. పెరిగే ప్రాయంలో లావుగా లేకపోయినా నష్టం లేదు. ఎలాంటి వ్యాధీ లేకుండా ఆరోగ్యంగా వుంటే అదే చాలు.

ఆర్. జి.

నాకు పెళ్ళయి ఎనిమిదేళ్లు అయింది. ఇంతవరకూ సంతానం కల్గలేదు. పెళ్లయిన రెండేళ్ల తర్వాత డి. అండ్‌సి చేయించుకున్నాను. అప్పుడు గర్భాశయంలో టి. బి. వుందని తెలిసింది. వెంటనే చికిత్స ప్రారంభమయింది. రెండేళ్లవరకు చికిత్స చేయించుకున్నాను. తర్వాత మరోసారి డి అండ్‌సి చేయించుకున్నప్పుడు ఆ వ్యాధి సంపూర్ణంగా నయమైనట్లు తెలిసింది. ఎక్స్‌రే తీసి చూశాక గర్భాశయనాళంలో ఏదో అడ్డు వున్నట్టు తెలిసింది. ఆపరేషన్ చేశారు. అయినా ఇంతవరకు పిల్లలు కలుగలేదు. పైగా ఇప్పుడు నేను చాలా బలహీనంగా వున్నాను. భోజనం సరిగ్గా సయించడం లేదు. నాకో మార్గం చెప్పగోర్తాను.

గర్భాశయ టి. బి. నయమైంది అంటున్నారు. అయితే గర్భాశయనాళం అడ్డును తీసివేయడానికి జరిగిన శస్త్రచికిత్స తర్వాత సక్రమంగా వుందా అని చూడాలి. అది కాకుండా Biopsy చేసి చూశాక గర్భాశయంలో టి. బి. లేదంటే చికిత్స అవసరం లేదు. శరీరం బలహీనంగా వుందంటున్నారు కాబట్టి మరోసారి డాక్టర్‌ను సంప్రదించి పూర్తిగా వైద్యపరీక్ష చేయించుకోవాలి. ముఖ్యంగా వక్షభాగం ఎక్స్‌రే తీసి చూసి, దానికి తగ్గట్టు చికిత్స పొందాలి.



# 3 నేరస్థుల కథలు

## గౌరాపంత్ శివాని

" ఈమె పేరు జానకి " అని పరిచయం చేశారు ఆ నేరస్థురాలిని.

విచిత్రం ఏమిటంటే, ఆమెకు ఒక సాధ్వి పేరు పెట్టారు ఆమె తల్లిదండ్రులు. కాని ఆమె చేసిన నేరం - భర్తను హత్య చెయ్యడంలో ప్రియునికి తోడ్పడడం!

కొందరి విషయంలో ఇది తప్పదేమో.... తమ కూతురు సుగుణాలరాశి అవుతుందని తల్లిదండ్రులు 'సుగుణ' అని పేరు పెట్టుకుంటారు. పెరిగి, పెద్దదైన తర్వాత ఆమెకు అన్నీ దుర్గుణాలే అబ్బితే, పాపం వాళ్ళేం చేస్తారు?

జానకిని కలుసుకోవడానికి ముందుగా ఆమె కేసు గురించి సూచనప్రాయంగా తెలుసుకున్నాను. కానీ, అది నాణానికి ఒకవైపు ఉన్న కథే. నాణానికి రెండవ వైపున ఏమున్నదో ఆమె అంతరంగంలో ఎన్నెన్ని భావాలు దాగి వున్నాయో. ఏ పరిస్థితులు ఆమె తప్పుదారి తొక్కడానికి దోహదం చేశాయో, తెలుసుకోవాలన్న ఉద్దేశంతోనే, ఆమెను కలుసుకుని, ఆమె గతాన్ని ప్రస్తావించాను.

సాధారణంగా నేరస్థుల ముఖం పైనే వాళ్ళు చేసిన నేరాల నీడలు దోబూచులాడుతూ వుంటాయని అంటారు. కానీ జానకిని చూస్తే అలా అనిపించదు!

ఆమె అందంగా, బలంగా వుంది. గుండ్రని ఆ ముఖానికి - ఆమె చెక్కిళ్ళు వింత అందాలను సంతరింపజేస్తున్నాయి.

ఆమె ముఖంపై ఎలాంటి ఆందోళనా కనిపించడం లేదు. నిర్వికారంగా, నిండుకుండలా వుంది!

కానీ, ఆమె తన కథ చెప్పడం ఆరంభించిన దగ్గర నుంచి ఆమె ముఖకవళికలు మారిపోసాగాయి.

ఆనందం, తన్మయత్వం, ఆవేశం, ఆందోళన, ద్వేషం, బాధ....ఇలా రకరకాల భావాలు మారుతూ వున్న రంగుల్లా కనిపించాయి!

*

జానకిది ఒక మధ్య తరగతి కుటుంబం!

పిల్లకు సరైన సంబంధం చూసి, వరుడి తరపు వారి హిరణ్యాక్ష వరాలన్నీ అంగీకరించి, పెళ్లి చేయడం కత్తిమీద సాములా భావించే అందరు మధ్యతరగతి కుటుంబీకుల్లాగే, ఈమె పెద్దలూ ఆ 'సమస్య'లో సతమతమవుతున్న సందర్భంలో, పదహారేళ్ళ జానకిని చూడడానికి పొరుగూరు నుంచి పెళ్లి పెద్దలు వచ్చారు.

మగ పెళ్లి పెద్ద—ముగ్గురు అన్నదమ్ముల్లో రెండవవాడు. అతని వయసు నాలుగు పదులు దాటినా, అతని దేహదారుఢ్యం ఆ వయసుని కనిపించనీయడం లేదు. తన అన్నకు పెళ్ళయినా, తను మాత్రం పెళ్ళి చేసుకోలేదు. జీవితాంతం బ్రహ్మచారిగానే వుంటానని, 25 ఏళ్ళ ప్రాయంలో వున్న తన తమ్ముడికి పెళ్లి చేయడం కోసం ఈ సంబంధం చూడడానికి వచ్చాడు.

తమ్ముడి కోసమనే – జానకిని చూశాడు. కానీ, ఆమెను చూడగానే, అతనికి కొత్త ఆలోచనలు వచ్చాయి.

ఆమె అందం అతన్ని అయస్కాంతంలా ఆకర్షించింది. తమ్ముడికి మరో సంబంధం చూస్తానని, ఈమెను తనే పెళ్లి చేసుకుంటానని, కట్నాలు, కానుకలు ఏవీ అవసరం లేదనీ చెప్పాడు.

ఏదో ఒక సంబంధం కుదిరితే చాలని అనుకుంటున్న జానకి తల్లిదండ్రులు అతనలా చెప్పేసరికి సంతోషంతో సంబరపడిపోతూ, కూతురి యిష్టాయిష్టాలు కూడా తెలుసుకోకుండా, పెళ్లికి వప్పుకున్నారు.

జానకి దిగ్భ్రమకు గురైంది. తన దురదృష్టాన్ని నిందించుకుంటూ, ఏడుపును దిగమింగుకుంటూ పెళ్ళి పీటల మీద కూర్చుంది.

భర్త ఒక మహావృక్షమైతే తనొక లతలా వూహించుకుంది. అతన్ని తను ప్రేమతో చూసుకోడం సాధ్యమేనా? అన్న అనుమానం ఆమెకు అప్పుడే కలిగింది!

కాపురానికి వచ్చిన తర్వాత, తనను చేసుకోవలసిన వ్యక్తి, మరదిగా కనిపించేసరికి, ఆమె హృదయం ఆవేదనతో భగ్గుమంది!

కానీ, క్రమక్రమంగా – నిస్సహాయంగా, పంజరంలో చిలకల్లా బ్రతకడానికి అలవాటుపడే సగటు వనితలందరిలాగే, ఆమె తన బాధను మరచిపోవడానికి ప్రయత్నించింది.

వయసులో వున్న తన భార్యను ఆకర్షించడానికి ఆ భర్త - ఖరీదైన చీరెలు, నగలు కొంటూ వుండేవాడు. ఏది కావాలంటే, అది వెంటనే సమకూర్చేవాడు. ఐతే, అతని కళ్లు ఆమెను ఎప్పటికప్పుడు ఏదో ఒక రకమైన అనుమానంతో చూస్తూ వుండేవి. ఎప్పుడైనా, తమ్ముడు తనను చూడడానికి యింటికి వచ్చి, జానకితో మాట్లాడితే, అతన్ని గసిరేవాడు. జానకిని గుచ్చి గుచ్చి చూస్తూ, ఇంట్లోకి పొమ్మని కేకలు పెట్టేవాడు. అలాంటి సందర్భాలలో ఆమె మనసు చివుక్కుమనేది.

కాల ప్రవాహంలో ఐదేళ్లు కలిసిపోయాయి.

జానకి ముగ్గురు పిల్లల తల్లి అయింది. తన దురదృష్టం గురించి ఆలోచించడం ఎప్పుడో మానేసింది.

ఇంటిని చక్కదిద్దుకుంటూ, పిల్లల చదువు సంధ్యలు గమనిస్తూ, జీవితాన్ని వెళ్ళబుచ్చుతూ వుంది. ఐతే, ఆమె భర్తకు మాత్రం ఎప్పుడూ ఆమెపట్ల ఏదో ఒకరకమైన అనుమానం వుంటూనే వుండేది.

ఎప్పుడైనా ఆమె ఉత్సాహంగా కనిపించి, కుటుంబంలో జరిగిన ఏదో ఒక విశేషానికి మనసు సంతోషంతో పొంగిపోతే, ఆ మరుక్షణమే భర్త అనుమానపు విషబిందువుతో ఆ ఆనందం కాస్తా హరించుకుపోయేది.

అటువంటి ఆమె సాంసారిక జీవితంలో ఒక రోజు కిశోర్ అనే కుర్రవాడు ప్రవేశించాడు. పక్కింట్లోంచి వచ్చి, తనను తాను పరిచయం చేసుకున్నాడు. కిశోర్ హైస్కూలు విద్యార్థి. "అక్కా .... నాకు ఈ ఇంగ్లీషు పాఠం అర్థం కాలేదు. కాస్త చెప్పవూ?" అని పుస్తకం పట్టుకుని వచ్చేసరికి, జానకి కాదనలేకపోయింది.

టీ వేళ కావడంతో, పాఠం చెబుతూ, 'టీ' కూడా యిచ్చింది. అప్పుడే ఆమె భర్త యింటికి వస్తూ, ఈ దృశ్యం చూశాడు. జానకిని లోపలికి పిలిచి కేకలు వేశాడు. వాణ్ణి పొమ్మని చెప్పమని గదమాయించాడు.

ఆ రోజు ఆమె లేతమనసు ఎంతగానో గాయపడింది!

*

మర్నాడు భర్త యింటికి రాగానే "ఆ వెధవ ఇవ్వాళ కూడా వచ్చాడా?" అని అరిచాడు.

ఆ రోజే కిశోర్ వచ్చి, సోదరీసోదరుల అనుబంధానికి చిహ్నంగా రాఖీ పండుగ సందర్భంగా— జానకికి 'రాఖీ' కట్టి మరీ వెళ్ళాడు.

అటువంటి వాణ్ణి – అలా అనుమానిస్తూ వుండేసరికి, అప్పుడే ఆమెకు భర్తపట్ల ద్వేషం ఆరంభమైంది.

"వచ్చాడు" అన్నది నిర్లిప్తంగా.

ఆమె చెంప ఛెళ్ళుమంది.

"ఎందుకు వాణ్ణి రానిచ్చావే...రంకులాడీ...." అని ఆమెను అసహ్యంగా తిడుతూ, గొడ్డును బాదినట్లు బాదాడు.

జానకిని ఒకరకమైన మొండితనం ఆవహించింది. అంతకాలం ఆమె తన భర్తకు అనురాగాన్నే పంచి యివ్వడానికి ప్రయత్నించింది. ముగ్గురు పిల్లలకు తల్లి కూడా అయింది. 'ఐనా తనకు భర్త హృదయంలో లభించిన స్థానం యిదా!' అని తలచుకుని కుమిలికుమిలి ఏడ్చింది. భర్తపట్ల పెళ్లయిన తొలిరోజుల్లో ఏర్పడిన ద్వేషం – తిరిగి పడగ ఎత్తింది!

మర్నాడు కిశోర్ వచ్చినప్పుడు, అతనివల్ల ప్రారంభమైన గొడవ గురించి అతనితో ఏమీ చెప్పకుండానే, స్కూలు పాఠాల విషయం అడిగింది.

భర్త అంటగట్టిన సంబంధం – ఆమె మనసును పదేపదే పొడుస్తూ వుంటే, మొట్టమొదటిసారిగా కిశోర్‌ను సోదరిగా కాకుండా 'మరోలా' పరిశీలనగా చూసింది!

*

భర్త అనుమానంతో తనపట్ల పశువులా వ్యవహరిస్తున్న కొద్దీ, ఆమె మొండితనంతో అతన్ని ఎదిరించసాగింది.

కొత్తగా భర్త తాగుడు అలవాటు చేసుకుని, ఆమెను రకరకాలుగా హింసించడం ఆరంభించాడు. ఐనా, కిశోర్‌ను రావద్దని ఆమె చెప్పలేకపోయింది.

భర్తపట్ల ఏర్పడిన ద్వేషం, అసహ్యం—ఆమె హృదయంలో మరో రూపాన్ని సంతరించుకున్నాయి. కిశోర్‌ను - 'తమ్ముడూ' అని పిలవడం మానేసింది. అతను 'అక్కా' అని పిలుస్తుంటే, అలా పిలవద్దని మందలించింది!

ఆ రోజు శనివారం.

మధ్యాహ్నం అకస్మాత్తుగా ఆఫీసు నుంచి యింటికి వచ్చాడు భర్త.

అప్పుడు జానకి - కిశోర్‌కు 'టీ' యిస్తూ కనిపించింది.

"ఒరేయ్....ఈసారి మా ఇంటికి వచ్చావంటే, నీ కాళ్ళు విరగ్గొట్టేస్తాను!" అని గట్టిగా కేకలు వేశాడు.

కిశోర్‌కు ఏమీ అర్థం కాక, వెంటనే అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. అలవాటు ప్రకారంగా, అతను తనను పశువును బాదినట్లు బాదుతుంటే, ఆ దెబ్బలన్నీ తింటూ అలాగే కూలబడిపోయింది జానకి.

ఆ రోజు రాత్రి—ఆమెకు తన భర్తపట్ల ఏర్పడిన ద్వేషం పతాకస్థాయికి చేరుకుంది. కిశోర్‌ను— ఆ రాత్రి దొడ్డి గుమ్మం ద్వారా తన ఇంట్లోకి రమ్మని 'కొంటెగా' సంజ్ఞ చేసింది. ఎందుకు అలా పిలుస్తున్నదనీ సరిగ్గా అర్థంకాకపోయినా, అతను ఆమె చెప్పిన ప్రకారం రహస్యంగా వచ్చాడు.

ఆ రాత్రి....

కిశోర్‌ను దగ్గరకు తీసుకున్నప్పుడు మొదటిసారిగా తన భర్తపై ప్రతీకారం తీర్చుకుంటున్న సంతృప్తి ఆమెకు కలిగింది!

*

ఆ రోజు ఒకటవ తేదీ!

జీతం రోజు కావడంతో అలవాటు ప్రకారంగా బాగా తాగి, పిల్లలకు బిస్కెట్లు, చాక్లెట్లు అవీ కొని, రాత్రి తొమ్మిది గంటలకు – తూగుతూ, జోగుతూ— ఇంటికి చేరుకున్నాడు జానకి భర్త. పిల్లలు నిద్రపోతున్నారు.

"ఇదిగో....మాంసం తెచ్చాను. ఇప్పుడు నాకు కూర చేసి పెట్టు" అని గదమాయించాడు.

"ఇప్పుడేమిటి మాంసం కూర...రేపు చేస్తాను. గొడవ చెయ్యకు!" అన్నది జానకి.

"చేస్తావా? చెయ్యవా?" అని జోరుగా మీదికి వచ్చి, వీపుమీద గుద్దాడు.

తిట్టుకుంటూనే మాంసం కూర చేసి, భోజనం పెట్టింది. భర్త గదికి ఎదురుగా వున్న గదిలో పిల్లల పక్కన మంచం వేసుకుని పడుకుంది. ఆమెకు నిద్రపట్టడం లేదు. దొడ్డి గుమ్మం దగ్గరున్న స్టోర్ గదిలో కిశోర్ దాక్కుని వున్నాడు. తనకోసం ఎదురుచూస్తూ వుంటాడు!

"జానకీ" అని పిలిచాడు భర్త. విసుక్కుంటూనే 'ఏమిటి' అన్నది. "దగ్గరకురా" అన్నాడు మత్తుగా. వెళ్ళింది.

విసురుగా ఆమెను మంచం మీదికి లాక్కున్నాడు. మౌనంగా అతన్ని సహించింది! కాస్సేపటికి అతను నిద్రలోకి జారుకున్నాడు.

మెల్లగా అతని చేతులను విడిపించుకుని తన గదిలోకి వచ్చి మంచం మీద పడుకుంది. ఒక్కసారిగా ఆమెకు ఏడుపు వచ్చింది. ఏడుస్తూనే మగతగా నిద్రపోయింది.

అర్ధరాత్రి వున్నట్టుండి, ఆమెకు మెలకువ వచ్చింది. అప్పుడే ఆమెకు కిశోర్ జ్ఞాపకం వచ్చాడు. కళ్ళు తెరిచి చూస్తే, తన మంచం పక్కన నిలబడి వున్నది అతనే!

"ఇదేమిటి లోపలికి వచ్చేశావు....వెళ్ళిపో

**Statement about ownership of VANITHA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS' 188, Arcot Road Vadapalani, Madras-600 026 |
| 2. | *Periodicity of Publication* | ... | MONTHLY 1st of each calendar month |
| 3. | *Printer's Name* | ... | B. V. REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Prasad Process Pvt Limited 188, Arcot Road Vadapalani, Madras-600 026 |
| 4. | *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | CHANDAMAMA PUBLICATIONS 188, Arcot Road Vadapalani, Madras-600 026 |
| 5. | *Editor's Name* | ... | B. VISWANATHA REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | 'CHANDAMAMA BUILDINGS' 188, Arcot Road Vadapalani, Madras-600 026 |
| 6. | *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND BENEFICIERIES: 1. B. V. HARISH 2. B. V. NARESH 3. B. V. L. ARATI 4. B. L. NIRUPAMA 5. B. V. SANJAY 6. B. V. SHARATH 7. B. L. SUNANDA 8. B. N. RAJESH 9. B. ARCHANA 10. B. N. V. VISHNU PRASAD 11. B. L. ARADHANA 12. B. NAGI REDDI |

All Minors—by Trustee
M. UTTAMA REDDI, 9/3, V.O.C. Street, Madras-600 024.

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March* 1980

B. VISWANATHA REDDI
*Signature of the Publisher*

తొందరగా. మా ఆయనకు మెలకువ వస్తే, కొంప మునుగుతుంది!'' అన్నది జానకి మెల్లగా కంపిస్తున్న స్వరంతో....

'' ఇంకెక్కడ లేస్తాడు....మన మధ్య ఇక వాడి అడ్డులేకుండా చేశాను .... ఎన్నాళ్ళిలా రహస్యంగా మనం కలుసుకుంటూ వుండేది? నీకుగా నువ్వు ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో చెప్పడం లేదు. అందుకని నేనే....''

జానకి కంగారుగా భర్త గదిలోకి వెళ్ళింది. అక్కడంతా రక్తపు మడుగు....కిశోర్ స్టోర్ గదిలోని గొడ్డలితో ఆమె భర్తను దారుణంగా హత్య చేశాడు!

ఆమెకు ముచ్చెమటలు పోశాయి. ఏం చెయ్యాలనీ అర్థం కాలేదు. వెక్కి-వెక్కి ఏడవడం ఆరంభించింది.

'' హుష్ .... ఏడవకు .... మనకేమీ కాదు. ఏం జరిగినా ఇద్దరం కలిసి అనుభవిద్దాం....ఒక ట్రంకు పెట్టె చూడు....ఈ శవాన్ని అందులో వేసేద్దాం. రైలుకట్ట దగ్గర ఒక గూడ్సుబండి వుంది. అందులో ఆ ట్రంకు పెట్టెను పారేద్దాం. రక్తపు మరకలు లేకుండా తొందరగా ఇల్లంతా కడిగెయ్....'' అన్నాడు - కిశోర్ తాపీగా.

ట్రంకుపెట్టె, శవం అనగానే ఆమెకు కంగారు ఎక్కువైపోయింది. ''అదంతా నేను చెయ్యలేను!'' అని ఏడుస్తూ చతికిలపడిపోయింది.

కిశోర్ అటూ ఇటూ నడుస్తూ, తీవ్రంగా ఆలోచించసాగాడు. అతను హత్య చేసేటప్పుడు తన బట్టలకు రక్తపు మరకలు అంటకుండా ముందుగానే చొక్కా, పాంటు తీసేశాడు.

రెండు నిమిషాలు ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చి, చకచకా బట్టలు వేసుకున్నాడు. ''సరే...నాకు 'టీ' చేసి పెట్టు. ఈలోగా ఈ సీలింగ్‌ఫాన్‌కు అంటుకున్న రక్తపు మరకలు తుడిచేస్తాను. 'టీ' ఇచ్చి, గబగబా ఇల్లు కడిగెయ్. నేను వెళ్ళిపోయాక తలుపులన్నీ తెరిచిపెట్టి, నువ్వు మామూలుగా నిద్రపో. అందరితోపాటే నిద్రలేచాక, జరిగినది చూసి, 'షాక్' తిన్నట్టుగా కేకలు పెట్టి, ఏడవడం ఆరంభించు. ఎవరో దుండగులు వచ్చి, హత్య చేసి వెళ్ళిపోయారని అందరూ అనుకుంటారు.'' అన్నాడు త్వరత్వరగా.

జానకి - ఇంట్లో వున్న ట్రాన్సిస్టరు, రిస్టువాచి, భర్త వేసుకునే టెర్లిన్ చొక్కాలు, పాంట్లూ, కొంత డబ్బు తీసి, అతనికి యిచ్చింది.

కిశోర్‌కు టీ యిస్తుండగా, జానకి పెద్ద కూతురుకు మెలకువ వచ్చింది.

పడుకునే, ''మమ్మీ....ఎవరమ్మా ఆయన....'' అని అడిగింది. జానకి భయాన్ని కప్పిపుచ్చుకుంటూ... '' ఎవరో కాదమ్మా... మీ అంకుల్ '' అన్నది పడుకోమని జోకొడుతూ.

'' ఛీ...ఆయన 'అంకుల్' కాదు....నువ్వు అబద్ధం చెబుతున్నావ్. మమ్మీ...నువ్వు మంచిదానివి కాదు!'' అని తిడుతూనే, ఒత్తిగిలి పడుకుంది.

కిశోర్‌ను జాగ్రత్తగా వెళ్ళిపోమని చెప్పి, ఇల్లంతా కడిగి, రక్తాన్ని తుడిచిన గుడ్డలను జాగ్రత్తగా దాచి, తన గదిలోకి వచ్చి పడుకుంది.

ప్రొద్దున్న లేచి, అనుకున్న ప్రకారంగా తన పాత్రను జాగ్రత్తగా నిర్వహించింది.

పోలీసులు వచ్చిన తర్వాత వాళ్ళకు నేరస్థులను పట్టుకోవడం సులభమే అయింది.

రక్తపు మరకలు దుండగులు-హత్య చేశాక రక్తపు మరకలు తుడిచి వెళ్ళిపోదామని అనుకోరు. అంచేత, తుడవడానికి జరిగిన ప్రయత్నం, ఇరుగు పొరుగువాళ్ళు చెప్పిన ప్రకారం భార్యాభర్తల మధ్య గొడవలకు కారణభూతుడైన కిశోర్ ప్రొద్దున్నే వూళ్ళో లేకపోవడం మొదలైన అంశాలతో జానకిని, కిశోర్‌ను పోలీసులు అనుమానించారు.

మొదట లాకప్‌లో వున్న రెండు రోజుల్లోను జానకి హంతకుడి గురించి ఏమీ చెప్పకపోయినా, మూడవ రోజున కిశోర్‌ను పోలీసులు తీసుకురావడం చూసి, భోరున ఏడ్చేసింది.

ఆ తర్వాత జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పేసింది. ఆమెకు, కిశోర్‌కు యావజ్జీవ కారాగారవాసం ప్రాప్తించింది!

*

జానకి చీరె చెంగుతో కళ్ళు తుడుచుకుని, నా ముఖం వంక నిదానంగా చూసింది.

''నువ్వు చేసిన దానికి పశ్చాత్తాపపడుతున్నావా?'' అని అడిగాను.

'' నాకెందుకు పశ్చాత్తాపం? '' అని ఆమె ఎదురు ప్రశ్న వేసింది.

'' నా భర్త మొదటి నుంచీ నాకు అన్యాయం చేస్తూనే వచ్చాడు. అతను నన్ను పెళ్ళిచేసుకోడానికి ముందు - అంతకాలం 'బ్రహ్మచారి'లా చలామణి కావడానికి కారణం ఏమిటనుకున్నారు? అతనికి అన్నగారి భార్యతో అక్రమ సంబంధం వుంది. అది కొనసాగుతూ వుండగా పెళ్ళి ఎందుకనుకున్నాడు. నన్ను చూసి, పెళ్ళి చేసుకున్నాడు. వయసు మళ్ళినవాడైనా అతన్ని ప్రేమించడానికి ప్రయత్నించాను. కానీ, అణువణువునా నన్ను చిత్రవధ చేస్తూనే వచ్చాడు. అతను చేసినదేదీ తప్పుగా కనిపించలేదు. కారణం అతను మగవాడు! అతను నన్ను బాధ పెట్టినకొద్దీ-నా హృదయం బండబారిపోయింది. ప్రతీకారం చెయ్యాలన్న వాంఛ నాలో ఎక్కువవుతూ వచ్చింది. అతనికి తగిన శాస్తి జరిగిందని అనుకుంటున్నాను. అందుకే నేను జరిగిన దానికి పశ్చాత్తాపపడడం లేదు!'' అన్నది దృఢమైన స్వరంతో.

ఆమె నేరం చేసిన మాట నిజమే. కానీ, ఆమెలో చెలరేగిన తుపాను మన సామాజిక వ్యవస్థలోని లోటుపాట్లను బహిర్గతం చెయ్యడం లేదా?

ఆలోచించండి!

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు_57' చందమామ బిల్డింగ్స్, మద్రాసు -- 600 026 చిరునామాకు మార్చి (80) 31వ తేదీ లోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1980 మే సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు - అడ్డము

1. కానుకకే మరో పేరు
2. వాడినదన్న మాట
3. జుట్టు లేకపోతే కుదరనిది
4. అలా వస్తే దూరమే!
5. చెదిరిపోయింది, వేదనకాదా!
6. పల్లకి మోసేవాడు
7. పదమూడు అడ్డంలో వాడే.
8. బట్ట (తలకి సంబంధించినది కాదు)
9. మండుటెండలో వీచేది అల్లకల్లోలంగా వుంది.
10. అలా వస్తేనే వెళ్ళడం.
11. అలా చదివితే పార్వతీదేవి పేరుతో వున్న ప్రవాహం
12. మందులు నూరేది
13. నవగ్రహాలలో ఒకడు

### ఆధారములు - నిలువు

1. చిన్న జంతువు
6. మొదటి బేరం
8. దీర్ఘం ముందుంటే జీర్ణశక్తి కలిగించే దినుసు.
14. ఏనుగులా నడిచె స్త్రీని అంటారు
15. మూతలాంటి దానికి ముందు లేదు!
16. కచ్చితంగా ఏడుపును వ్యతిరేకిస్తుంది.
17. సంతోషం!
18. ఇంతకీ 11 అర్థం ఏమిటి?
19. వాసన ఆకును 'జ్ఞాపకం పెట్టుకుంటాము'
20. అలసటగా ఉండుట
21. విలాసవంతుడు
22. పాట
23. మునికి మరో పేరు
24. విలువైనవే తారుమారైతే?

# వనిత మాటల కొలువు - 57

## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 14 | 15 | | 2 | 16 | 17 |
| | | 3 | | | | 4 | |
| 5 | 18 | | | 6 | | | |
| | 7 | | 19 | | | 24 | |
| 20 | | | | | 8 | | 21 |
| 9 | | 22 | | | 10 | | |
| | | 11 | | 23 | | | |
| 12 | | | | 13 | | | |

పేరు ..............................................................

చిరునామా ..............................................................

..............................................................

..............................................................

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | | | తమిళం | | | కన్నడం | | | మలయాళం | | | మరాఠి | | | గుజరాతి | | | ఒరియా | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| హ | ళ | క్ష | ஹ | ள | க்ஷ | ಹ | ಳ | ಕ್ಷ | ഹ | ള | ക്ഷ | ह | ळ | क्ष | હ | ળ | ક્ષ | ହ | ଳ | କ୍ଷ |
| హా | ళా | క్షా | ஹா | ளா | க்ஷா | ಹಾ | ಳಾ | ಕ್ಷಾ | ഹാ | ളാ | ക്ഷാ | हा | ळा | क्षा | હા | ળા | ક્ષા | ହା | ଳା | କ୍ଷା |
| హి | ళి | క్షి | ஹி | ளி | க்ஷி | ಹಿ | ಳಿ | ಕ್ಷಿ | ഹി | ളി | ക്ഷി | हि | ळि | क्षि | હિ | ળિ | ક્ષિ | ହି | ଳି | କ୍ଷି |
| హీ | ళీ | క్షీ | ஹீ | ளீ | க்ஷீ | ಹೀ | ಳೀ | ಕ್ಷೀ | ഹീ | ളീ | ക്ഷീ | ही | ळी | क्षी | હી | ળી | ક્ષી | ହୀ | ଳୀ | କ୍ଷୀ |
| హు | ళు | క్షు | ஹு | ளு | க்ஷு | ಹು | ಳು | ಕ್ಷು | ഹു | ളു | ക്ഷു | हु | ळु | क्षु | હુ | ળુ | ક્ષુ | ହୁ | ଳୁ | କ୍ଷୁ |
| హూ | ళూ | క్షూ | ஹூ | ளூ | க்ஷூ | ಹೂ | ಳೂ | ಕ್ಷೂ | ഹൂ | ളൂ | ക്ഷൂ | हू | ळू | क्षू | હૂ | ળૂ | ક્ષૂ | ହୂ | ଳୂ | କ୍ଷୂ |
| హృ | ళృ | క్షృ | — | — | — | ಹೃ | ಳೃ | ಕ್ಷೃ | ഹൃ | — | — | हृ | ळृ | क्षृ | હૃ | ળૃ | ક્ષૃ | ହୃ | ଳୃ | କ୍ଷୃ |
| హౄ | ళౄ | క్షౄ | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |
| హె | ళె | క్షె | ஹெ | ளெ | க்ஷெ | ಹೆ | ಳೆ | ಕ್ಷೆ | ഹെ | ളെ | ക്ഷെ | — | — | — | — | — | — | — | — | — |
| హే | ళే | క్షే | ஹே | ளே | க்ஷே | ಹೇ | ಳೇ | ಕ್ಷೇ | ഹേ | ളേ | ക്ഷേ | हे | ळे | क्षे | હે | ળે | ક્ષે | ହେ | ଳେ | କ୍ଷେ |
| హై | ళై | క్షై | ஹை | ளை | க்ஷை | ಹೈ | ಳೈ | ಕ್ಷೈ | ഹൈ | ളൈ | ക്ഷൈ | है | ळै | क्षै | હૈ | ળૈ | ક્ષૈ | ହୈ | ଳୈ | କ୍ଷୈ |
| హొ | ళొ | క్షొ | ஹொ | ளொ | க்ஷொ | ಹೊ | ಳೊ | ಕ್ಷೊ | ഹൊ | ളൊ | ക്ഷൊ | — | — | — | — | — | — | — | — | — |
| హో | ళో | క్షో | ஹோ | ளோ | க்ஷோ | ಹೋ | ಳೋ | ಕ್ಷೋ | ഹോ | ളോ | ക്ഷോ | हो | ळो | क्षो | હો | ળો | ક્ષો | ହୋ | ଳୋ | କ୍ଷୋ |
| హౌ | ళౌ | క్షౌ | ஹௌ | ளௌ | க்ஷௌ | ಹೌ | ಳೌ | ಕ್ಷೌ | ഹൗ | ളൗ | ക്ഷൗ | हौ | ळौ | क्षौ | હૌ | ળૌ | ક્ષૌ | ହୌ | ଳୌ | କ୍ଷୌ |
| హం | ళం | క్షం | — | — | — | ಹಂ | ಳಂ | ಕ್ಷಂ | ഹം | ളം | ക്ഷം | हं | ळं | क्षं | હં | ળં | ક્ષં | ହଂ | ଳଂ | କ୍ଷଂ |
| హః | ళః | క్షః | — | — | — | ಹಃ | ಳಃ | ಕ್ಷಃ | ഹഃ | ളഃ | ക്ഷഃ | हः | ळः | क्षः | હઃ | ળઃ | ક્ષઃ | ହଃ | ଳଃ | କ୍ଷଃ |

పెద్ద కథ:

# ఈ దీపం ఆరిపోదు

విన్నకోట సుశీలాదేవి

## కళ్లు తెరిచాను.

కిటికీలో నుంచి ఎర్రటి ఎండ మీద పడుతోంది. 'అమ్మయ్య! నేను బ్రతికే ఉన్నానన్నమాట.' హాయిగా నిట్టూర్చాను.

రోజూ రాత్రి పడుకోబోయే ముందు అనుకుంటాను — 'నాకు ఈ రాత్రి తెల్లవారుతుందా? మళ్ళీ ఉషోదయంలో మేల్కొని మంచు తెరల్ని చీల్చుకొస్తున్న సూర్యుడినీ, నా కిటికీ ప్రక్కనే బద్ధకంగా రేకులు విప్పుకునే చిట్టిమందారాల్ని చూడగలనా' – అని.

యధావిధిగా తెల్లవారుతుంది. సూర్యుడు లేవక ముందే లేస్తాను. వెలుగు రేకలు ఒక్కొక్కటి విచ్చుకుంటుంటే చీకటి పారిపోతూ ఉంటుంది. ఎర్రటిబింబంలోనుండి వెలువడే ప్రతి కిరణం ప్రకృతిలోని ప్రతి వస్తువుని తళతళలాడిస్తుంది. నిద్రపోతున్న చేతనాచేతనాలను తట్టి లేపుతుంది.

ఆ ఉషోదయాన్ని చూస్తూ—

ఆ చల్లటి గాలిని అనుభవిస్తూ –

ఆ ప్రకృతిలో నేనూ ఒక భాగమై పులకరించడం పరవశించడం ప్రతిరోజూ నా అలవాటు.

కాని, ఈ రోజు వీటికి విరుద్ధంగా జరిగింది. నేను లేచేసరికి, ఎర్రటి ఎండ కిటికీలో నుంచి మీద పడుతోంది.

అంటే దాదాపు ఏడయి ఉంటుంది. ఇవ్వాళ ఎందుకింత మొద్దు నిద్దరపోయాను! రాత్రి తొందరగానే పడుకున్నానే. ఆలోచిస్తూంటే హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది.

అవును, నాకు అర్ధరాత్రి ఒంటిగంటకి మెలకువ వచ్చింది. మళ్లీ మూడింటివరకూ నిద్ర పట్టలేదు.

అబ్బ! ఎంత భయంకరమైన కల. తలుచుకుంటే ఇప్పటికీ భయమేస్తోంది.

వారూ, సరోజా కలిసి పాలలో విషం కలిపారు. నాచేత బలవంతంగా తాగిస్తున్నారు. నేను ఏడుస్తున్నాను. అవును! హృదయం బ్రద్దలయేలా యేడుస్తున్నాను.

"నన్ను చంపొద్దండీ, నాకు బ్రతకాలని ఉందండీ. మీరు సరోజనే చేసుకోండి. నేనేమీ అననండి. నన్ను మాత్రం చంపొద్దండీ—"

కాని, వారు నా చేతులు విరిచి కట్టారు. బలవంతంగా నా నోరు తెరిచారు. సరోజ గ్లాసుని నా నోటిలోకి వంపుతోంది. నేనేడుస్తోంటే పగలబడి నవ్వుతోంది. నేను గింజుకుంటున్నాను. వారు నా మెడ వెనక్కి విరిచి పట్టుకున్నారు. నేను బాధతో కెవ్వుమని అరిచాను.

అంతే! మెలకువ వచ్చింది. తలచుకుంటుంటే ఇప్పటికీ నా శరీరం నిలువెల్లా వణికిపోతోంది. వీళ్లిద్దరూ కలిసి నన్నెప్పటికైనా చంపేస్తారు. నాకు తెల్సు. స్వార్థం పెచ్చు పెరిగితే మానవుడు దానవుడవుతాడట. నా అసహాయతకు నాకే కళ్ళ నుండి నీళ్ళు వచ్చాయి.

ఇంతలో బయట అడుగుల చప్పుడు విన్పించింది. కళ్ళు గట్టిగా మూసుకున్నాను.

"ఇంకా ఈవిడ లేవలేదు. మహారాణి! ఆవిడకేం ఎంత సేపయినా పడుకుంటుంది. మధ్యలో సేవలు చేయలేక నాకు చావొచ్చింది. ఈవిడగారి మాయదారి రోగం ఏమిటో గాని మమ్మల్ని చంపుతోంది" సరోజ సణుక్కుంటూ వెళ్ళిపోయింది.

దాని మాటలు వింటోంటే నా ఒళ్లు భగభగ మండింది, కోపంతో పళ్ళు కొరికాను.

"సరోజా! నువ్వు కూడా నన్ను అనేదానివేనా? నువ్వు ఏ పరిస్థితిలో ఈ యింటికి వచ్చావో మరిచిపోతున్నావు. ఎవరి దయాధర్మం మీద ఈ ఇంట్లో స్థానం పొందేవో జ్ఞాపకం లేదా! నువ్వు నా ఇంటి శనిదేవతవవుతావని ఆనాడు గ్రహించలేకపోయాను. నన్నూ, నా కుటుంబాన్ని సర్వనాశనం చేయడానికే వస్తున్నావని అనుకోలేకపోయాను. నువ్వు ఏ క్షణంలో నా ఇంట్లో అడుగు పెట్టావో ఆనాటి నుంచే ఈ ఇంట్లో సుఖం లేకుండా పోయింది." – నా మనస్సు గతంలోకి వెళ్ళింది. అప్పటికి —

సరోజ వచ్చి నెలయింది.

సరోజ నాకు ఇంటి పనిలో సాయంచేస్తూ చాలా కలుపుగోలుతనంగా ఉండేది.

సరోజ టెన్త్ క్లాస్ వరకూ చదివింది. ఎక్కడైనా, ఏదైనా ఉద్యోగం ఇప్పించి వేరే ఇల్లు చూసి సరోజను అందులో ఉంచాలని నా ఆలోచన.

వారికి చెప్పాను ఉద్యోగం చూడమని. ఆయన 'అలాగే' అన్నారు.

ఆ రోజు మధ్యాహ్నం మూడవుతుంది. నా గదిలో పడుకుని నిద్రపోతున్నాను. వారు ఆరోజు త్వరగా వచ్చినట్టున్నారు. నాకు తెలియదు. మామూలుగా నాల్గింటికి లేచి వారు వచ్చే సమయానికి ఏదైనా టిఫిను చేద్దామని వంటింట్లోకి నడిచాను.

వంటింట్లోంచి నాకు ఏవో మాటలూ నవ్వులూ విన్పించాయి. తలుపు దగ్గరగా వేసి వుంది. నేను నెమ్మదిగా వెళ్ళి కొద్దిగా తలుపునెట్టి చూశాను. ఎదుటి దృశ్యాన్ని చూచి విభ్రాంతురాలయ్యాను. సరోజ అటు తిరిగి స్టవ్ మీద టిఫిను చేస్తున్నట్టుంది. వారు వెనకాల నిలబడి సరోజ మెడ చుట్టూ చేతులువేసి ఆమె మీదికి వంగి ఏదో చెప్తున్నారు.

ఒక్క క్షణం కూడా అక్కడ నిలవలేకపోయాను. పరిగెత్తుతున్నట్లే వచ్చి నా బెడ్ మీద వాలిపోయాను.

వీళ్ళిద్దరికీ ఇంత చనువు ఎలా వచ్చింది? ఎప్పుడు వచ్చింది? ఇలా చాలా రోజుల నుంచీ జరుగుతోందా? నా వెనకే జరుగుతున్న ఈ భాగోతం నేనే గమనించలేకపోయానన్న మాట. ఆయన ఎంతకు తెగించారు. సరోజ. అవును.... సరోజ.... ఎంత నంగనాచి.

గుండెల్లోంచి దుఃఖం పొంగుకు వచ్చింది. ఆ రాత్రి భోజనం చేయలేదు. వారూ, సరోజా బ్రతిమిలాడారు. నాకు వాళ్ళ ఉనికే అసహ్యం

కలిగిస్తోంది.

"నాకు ఒంట్లో బాగాలేదు" అని చెప్పి తప్పించుకున్నాను.

ఆ రాత్రి నిద్రకు దూరమయ్యాను. ఆ మర్నాడు మొట్టమొదటిసారిగా హార్ట్ఎటాక్ వచ్చింది. డాక్టర్ మందువల్ల గుండెనొప్పి తగ్గింది. కాని మనస్సుకి తగిలిన దెబ్బ మాత్రం మానలేదు. అది రోజు రోజుకీ క్యాన్సర్‌లా శరీరాన్ని తినేస్తోంది. ఏదో ఒక రోజు ఈ కాస్త గుండెనీ తినేస్తుంది. అప్పుడు.... అప్పుడు....

'అమ్మగారూ, అమ్మగారూ....' రావులమ్మ పిలుస్తోంది.

నేను కళ్ళుతెరిచాను.



" అమ్మగారూ ! చాలా ఎండెక్కిందమ్మా ! లేచి ముఖం కడుక్కోండి " నెమ్మదిగా నన్ను లేవదీసింది రావులమ్మ.

బాత్‌రూమ్‌లోకి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చాను. రావులమ్మ టేబిల్ మీద టిఫిన్ ప్లేటు పెడుతోంది. ప్లేటులో వున్న ఇడ్లీని చూడగానే నోరూరింది. గబగబా వచ్చి మంచం మీద కూర్చు న్నాను. ప్లేటులో వున్న కారపొడిని చూడగానే సగం వుత్సాహం తగ్గిపోయింది. నాకు కొబ్బరి చట్నీ అంటే ఎంతో ఇష్టం. ఈ సంగతి సరోజకి తెలుసు. మరి కొబ్బరి చట్నీ ఎందుకు చేయలేదో ?

" చట్నీలేదా ? " అని రావులమ్మని అడిగాను " ఉల్లి చట్నీ చేశారుట. మీరు తినరుగా " అంది రావులమ్మ.

ఉల్లి చట్నీ అంటే ఆయనకీ, సరోజకీ ఇష్టం. నేనైతే రెండూ చేస్తాను. నన్ను పూర్తిగా తీసిపారే శారన్నమాట.

ఏది పెడ్తే తినదు ? తినక చస్తుందా ! అనేదే వాళ్ళ ఉద్దేశం.

ఇడ్లీ తినబుద్ధి కాలేదు. కాని ఆకలిమాటో — అలాగే తిన్నాను — కాఫీ తాగాను.

" అమ్మగారూ ! స్నానం చేయండమ్మా. ఎనిమిదింటికి డాక్టరుగారు వస్తారుగా "—ప్లేటు తీస్తూ అంది రావులమ్మ.

నేను లేచాను. రావులమ్మ చీర జాకట్టు తీసి బాత్‌రూమ్‌లో పెట్టొచ్చింది. స్నానం చేసొచ్చి జడ వేసుకుంటూ —

" సరోజ ఏది రావులమ్మా ! " అని అడిగాను.

" వంటింట్లో ఉన్నారమ్మా. "

ఈ రోజు పాయసం తాగాలని ఉంది. సరోజతో చెప్పాలి కాని సరోజ ఇష్టం ఉంటే చేస్తుంది లేకపోతే లేదు. చిత్రం ! నా ఇంట్లో నాకే స్వతంత్రం లేకుండా పోయింది. ఏ పని చెప్పాలన్నా బెరుకు.

ఇదివరకైతే సరోజ పొద్దుటే వచ్చి ఆ రోజు వంటకి ఏం చెయ్యాలో అడిగేది. అసలు ఏ చిన్న పని చెయ్యాలన్నా " అక్కయ్యా ఇలా చేయమం టావా ? " అంటూ సలహా తీసుకునేది !

" అమ్మగారూ ! డాక్టరుగారు వస్తున్నారమ్మా" నేను సర్దుకుని కూర్చున్నాను.

ఆయన డాక్టర్ మూర్తిగారితోపాటు లోపల కొచ్చారు. మిగతా సమయాల్లో రాకపోయినా డాక్టరుగారితోపాటు మాత్రం తప్పక వస్తారు ఆయన.

బహుశ మూర్తిగారి దగ్గిర చులకన అవడం ఇష్టం లేదేమో. చక్కగా డ్రెస్ చేసుకుని ఉన్నారు. ఆదివారమైనా ఈ ముస్తాబు దేనికీ ?

" ఎలా ఉందమ్మా " మూర్తిగారడిగారు.

" మీరే చెప్పాలి " నవ్వుతూ అన్నాను.

దగ్గిరికి వచ్చి పరీక్షించారు. నేను డాక్టరుగారి ముఖంలోకే చూస్తున్నాను. కాని ఆయన ముఖంలో నాకు కావాల్సిన మార్పు కన్పించలేదు.

" ఎలా ఉంది " - వారడిగారు.

నాకు మాత్రం ' ఇంకా ఎన్నాళ్ళలో చస్తుంది ' అన్నట్లనిపించింది. డాక్టరుగారు నావైపొకసారి చూసి వారితో బయటికి వెళ్ళారు. నాకు వాళ్ళ మాటలు విన్పించలేదు. కాని ఏం మాట్లాడుకుంటారో నాకు తెలుసు.

ఆవిడ ఇంకెంతోకాలం బ్రతకదు అని అంటారు. ఆయన ముఖం వెలిగి ఉంటుంది. ఈ ఆలోచన లతో నా గుండె బరువెక్కింది.

మూర్తిగారు లోపలకు వచ్చారు. వచ్చి నా పక్కనే కుర్చీలో కూర్చుంటూ "కొద్దిగా ఇంప్రూవ్ మెంట్ కనిపిస్తోందమ్మా నీకేం ఫర్వాలేదు" అన్నారు.

అవి నాకు ఓదార్పు మాటలని తెలుసు.

" ఆయన ఏరీ " అన్నాను.

" ఎవరో ఫ్రెండ్‌ని కల్సుకోవాలిట వెళ్ళారు."

ఉః ! రోగిష్టి భార్యంటే అంత వెగటయి పోయింది. మొదట్లో నాకీ రోగం వచ్చిందని ఆయన ఎంతో కంగారు పడ్డారు. బాధ పడ్డారు.

" రాజీ ! నువ్విలా పడుకుంటే నాకేం తోచడం లేదు ! " నా పక్కనే కూర్చుని అనేకసార్లు అన్నారు ఈ మాట.

ఆ మాటలు వింటూ ఆయనకి నా మీద గల ప్రేమకి ఆనందపడ్డాను. ఆ క్షణంలో నాకు ఆయన మీద వున్న కోపం పోయేది. మనసులో ఆయన్ని క్షమించేసేదాన్ని.

ఆయన ప్రేమ చూస్తుంటే ఆ రోజు నేను చూసిందంల్లా అబద్ధమయి వుంటుంది. నా కళ్ళు నన్నే మోసగించాయేమో ? సరోజ పక్క వూరికే నిలబడ్డారేమో ? నేనే అనవసరంగా ఆయన్ని అను మానించానేమో ? అని అనుకున్న క్షణాలు కూడా లేకపోలేదు ! వారు ఆఫీసు టైము తప్ప మిగతా కాలమంతా నా దగ్గిరే గడిపేవారు. పొద్దున్న నాతోనే టిఫిను చేసేవారు.

" రాజీ ! వేళకు మందులు వేసుకుంటున్నావా? రాత్రి తెచ్చిన యాపిల్స్ తిన్నావా ! ఇవ్వాళ ఏం తెమ్మంటావ్? " అంటూ ప్రశ్నలు వేసి నా ప్రాణం తీసేవారు.

వచ్చేటప్పుడు ఏవేవో తెచ్చేవారు. పక్కనే కూర్చుని అవన్నీ తినిపించేవారు.

కాని రాను రాను వారి పద్ధతే మారిపోయింది. నేనెలా వున్నానో అని కనుక్కోవటం కూడా మానుకున్నారు. ఈ మార్పుకి కారణం నాకు తెలుసు.

వారికి సుఖం కావాలి. ఆనందం కావాలి. మరి మంచంలో పడ్డ నా సంగతి ఎవరికి అక్కరలేదా! నా గుండెల మంట ఎవరు చూస్తారు ? నా మనస్సు ఎలా బాధపడుతుందో ఎవరికి కావాలి ? ప్రేమ పూర్వకమైన మాటల కోసం ఎంత తపిస్తున్నానో ఆప్యాయతకీ, అభిమానానికీ ఎలా ముఖం వాచి ఉన్నానో ఎవరికి కావాలి ?

" కొత్త మందులు వ్రాస్తున్నాను. ఎలా వేసు కోవాలో కూడా వ్రాస్తున్నాను" అంటూ కాగితం మీద రాయసాగారు డాక్టరుగారు.

నేను నిరాశగా నవ్వాను.

" ఎందుకండీ మూర్తిగారూ మీకీ శ్రమ. ఇదేం తగ్గే రోగం కాదు " అన్నాను.

డాక్టరుగారు తలెత్తి చూసి—

" నువ్వా డాక్టరువి. నేనా ? " అని సీరియస్‌గా అడిగారు.

నేను నవ్వుతూ " రోగి కూడా సగం డాక్టర్ " అన్నాను.

" కానీ, నేను డాక్టరుని. నా మాట విని తీరాలి రోగం సంగతి ఆలోచించడం మానేసి, వేళకి మందులు వేసుకుంటూ, ఎటువంటి ఆలోచనలూ లేకుండా ప్రశాంతిగా ఉండమ్మా."

నేను నవ్వుకున్నాను. ప్రశాంతి — శాంతి అనే పదార్థం ఎలా ఉంటుందో పెళ్ళయ్యాక మర్చి పోయాను !

" డాక్టరుగారూ ! ఒక్కమాటడుగుతాను. నిజం చెప్తారా."

" అడుగమ్మా " అన్నారు.

" నేనింకా ఎన్నాళ్ళు బ్రతుకుతాను ? "

ఆయన కనుబొమలు ముడిపడ్డాయి. వెంటనే నవ్వేస్తూ.

" అదేమిటమ్మా. అలా అంటావ్ నువ్వు చాలా రోజులు బ్రతుకుతావు " అని అన్నారు.

"మీరలాగే అంటారు డాక్టర్ ఈ రోగం రోజు రోజూ కాస్త కాస్త నన్ను మింగేస్తోంది. నా బ్రతుకు ఇంకా రోజుల్లో ఉంది. నాకు తెలుసు" నా కంఠం దుఃఖంతో బొంగురుపోయింది.

"అలా నిరాశగా మాట్లాడకమ్మా. ఒక్కసారి అసాధ్య విషయాలు కూడా సాధ్యమవుతాయి." అన్నాడు దృఢంగా.

"మీరేం చేయగలరు డాక్టర్! మృత్యువుని ఆపగలరా?" — సూటిగా అడిగాను.

మూర్తిగారు మాట్లాడలేదు. కొద్దిసేపయ్యాక అన్నారు.

"నీ రోగం సగం మానసికమమ్మా! నువ్వు ఇటువంటివేమీ ఆలోచించకుండా మాతో సహకరిస్తే తొందర్లోనే నీకు నయమవుతుంది. అంతా నీ చేతుల్లోనే ఉంది. డాక్టరుగా నేనేం ఓడిపోలేదు. చివరివరకూ రోగాన్ని తగ్గించడానికి కృషి చెయ్యడమే మా డ్యూటీ" అన్నారు.

ఇంతలో రావులమ్మ కాఫీ తెచ్చింది. మూర్తిగారు కాఫీ తీసుకున్నారు.

తర్వాత కాస్సేపు వాళ్ళమ్మాయికి చూసిన సంబంధాలను గూర్చి, వాళ్ళబ్బాయి చదువుల గూర్చి మాట్లాడి—

"రేపొస్తానమ్మా, నే చెప్పిన విషయాలు జ్ఞాపకం ఉంచుకో" అని వెళ్ళిపోయారు.

డాక్టరుగారు చెప్పిన మాటలే నా మనస్సు ఆలోచిస్తోంది—

ప్రశాంతంగా ఉండాలి. ఎటువంటి ఆలోచనలూ ఉండకూడదు. మానసికంగా ఆనందంగా ఉండాలి. ఎంత అసాధ్యమైన విషయాలు ఇవి.

ఈ శరీరంలో జీవుడు ఉండగా పైవేమీ సాధ్యం కాదు. అంటే మృత్యువు తప్పదన్న మాటేగదా! ఈ మనస్సు ఇలా ఆలోచిస్తూనే ఉంటుంది. కలత చెందుతూనే ఉంటుంది. రేపో, మాపో, ఈ క్షణాన్నో, మరుక్షణాన్నో మృత్యువు కబళించవచ్చు.

నవ్వు

అర్థం కాని నవ్వు.

ఏడుపు

సర్వం పోగొట్టుకున్న మహావేదనను గుండెల్లో దాచుకున్న దుఃఖం.

రెండూ ఒక్కసారిగా ముంచుకొచ్చాయి. నా వయస్సు ఇంకా ముప్పై నిండలేదు. ఇంత వరకూ నేను సరిగ్గా కళ్ళైనా తెరవలేదు. అప్పుడే చచ్చిపోతానా?

ఏమో!

ఒక్కొక్కసారి నిజంగా చచ్చిపోతాననిపిస్తుంది. అప్పుడు ఏదో భయం, దిగులు మనస్సుని ఆవరిస్తాయి.

ప్రాణం మీది తీపో

బ్రతుకు మీది ఆశో

నన్ను నిలువునా ఒణికిస్తుంది. కానీ నాకేం ఆశలు మిగిలాయి.

మామూలుగా స్త్రీ జీవితం మూడురకాలుగా వుంటుందట—

కూతురుగా, భార్యగా, తల్లిగా.

కూతురిగా నాన్నగారి ఎడల నా బాధ్యత నిర్వర్తించుకున్నాను అంతే....అదే నా జీవితానికి శాపమైంది.

భార్యగా, తల్లిగా అపజయం పొందాను. ఎవరికీ అవసరంలేక ఒంటరిగా జీవితం ఆవలి ఒడ్డుకి చేరుకుంటున్నాను.

రేపోమాపో ఈ ఆకురాలిపోతుంది. ఈ హంస ఎగిరిపోతుంది.

నేనులేనని ఎవ్వరూ విచారించరు. అందరూ మామూలుగానే వుంటారు.

ఈ చెట్లు, ఆకాశమూ ఇలాగే వుంటాయి. అన్నీ వుంటాయి. అందరూ వుంటారు. కానీ నేను మాత్రం లేకుండా పోవాలి! ఎంత అన్యాయం. నేను లేకుండా ఈ ప్రపంచం మాత్రం ఎందుకుండాలి. ఉండకూడదు!

అంతా నశించిపోవాలి. నా చావుతోపాటు ప్రళయం రావాలి. అందరూ చావాలి. నశించిపోవాలి! 'అమ్మగారూ'.

కళ్ళు తెరిచి చూశాను. మాకు రోజూ కూరలిచ్చే అమ్మి వెంకటి.

"ఏంటమ్మగారూ! ఇలాగైపోయారు ఏం! కష్టాలన్నీ మంచోరికే వస్తాయి." జాలిపడుతోంది వెంకటి.

నాకు ఒళ్ళు మండింది. నా మీద ఎవ్వరూ జాలి పడవద్దు. నేను బాగానే ఉన్నాను. నేను చచ్చిపోతానని ఏడుస్తున్నావా? నేను చావను నేను చావను.



పార్లమెంటు సభ్యురాలు

## చెన్నుపాటి విద్య

విజయవాడ పార్లమెంటరీ నియోజకవర్గం నుంచి కాంగ్రెస్ (ఐ) అభ్యర్థిగా శ్రీమతి చెన్నుపాటి విద్య ఈ మధ్య జరిగిన మధ్యంతర ఎన్నికలలో లోక్‌సభకు ఎన్నికైనారు.

శ్రీమతి విద్య 1934 లో జన్మించారు. ఆమె తండ్రి కీ. శే. గోరా (గోపరాజు రామచంద్రరావు) ప్రముఖ సంఘ సంస్కర్త; నాస్తికవాది. ఆయన ప్రభావం శ్రీమతి విద్య మీద పడడంతో ఆంధ్ర విశ్వవిద్యాలయం ద్వారా బి.ఏ పట్టం పొందిన తరువాత ఆమె కూడా రాజకీయాల్లోనూ, సాంఘిక సేవా కార్యక్రమాలలోనూ ప్రవేశించారు. ఆమె భర్త శ్రీ చెన్నుపాటి శేషగిరిరావు. వారిది కులాంతర వివాహం.

సర్వోదయ నాయకుడు కీ. శే. ప్రభాకర్‌జీ నాయకత్వంలో శ్రీమతి విద్య సేవాగ్రాంలో వుండి, పలు సేవా కార్యక్రమాలలో పాల్గొన్నారు. తుపాను పీడిత ప్రాంతాలలో పునర్నిర్మాణ కార్యక్రమాలు చేపట్టే లక్ష్యంతో స్థాపించబడిన 'ఆర్థిక సమతా మండల్'కి ఆమె ఉపాధ్యక్షురాలుగా వుంటూ కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో తుపాను బాధితులకు అనేక సేవా కార్యక్రమాలు నిర్వహించారు.

శ్రీమతి విద్య ఎన్నో సేవా సంస్థలలో వివిధ హోదాలలో పని చేశారు. స్థానిక పటమట లంక కస్తూరిబా మహిళా మండలి అధ్యక్షురాలుగానూ, కృష్ణాజిల్లా పరిషత్, కంకిపాడు పంచాయితీ సమితి, ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ సంస్థ, కృష్ణాజిల్లా మహిళా ఆర్థిక సహాయ కార్పొరేషన్ లలో సభ్యురాలుగానూ మంచి పేరు ప్రఖ్యాతులు గడించారు.

వివిధ మహిళా సేవా సంస్థలలోనూ, మండలులలోనూ స్త్రీలకు పయోజన విద్యా కేంద్రాలను స్థాపించిన శ్రీమతి విద్య "స్త్రీలలో ఆర్థిక సమానత్వం, సాంఘిక చైతన్యం రావాలంటే ప్రతి వనిత ముందు విద్యావంతురాలు కావాలి" అంటారు. —మల్లిడి కనకరత్నం


మైసూర్
శ్యాండల్
Mysore Sandal Soap
గొప్ప భారతీయ సంప్రదాయంలో విశిష్టమైన స్నానపు సబ్బు

గది బయట రావులమ్మ, వెంకటి కూర్చుని నన్ను గూర్చి మాట్లాడుకుంటున్నారు.

"అమ్మగారు ఇంట్లో తిరుగుతుంటే లక్ష్మిలా వుండేవారు. పండగొస్తే ఎన్నిరకాల పిండివంటలు చేసేవారు! నాకిన్ని పెట్టేవారు. ఒకేలా ఆ రోజు నే రాకపోతే మర్నాటి దాకా ఉంచేవారు. ఎంత మంచి అమ్మ" వెంకటి అంటోంది.

"ఏం చేస్తాం అంతా కర్మ"

"అమ్మగారూ మంచం మీంచి లేవడమే లేదా?" వెంకటి అడుగుతోంది.

"ఆ! ఏదో కొద్దిగా తిరుగుతున్నారు. ప్చ్! ఏదయినా అమ్మగారి పనంతా అయిపోయింది"— రావులమ్మ అంటోంది.

వీళ్ళిద్దరి సానుభూతి వచనాలు నా చెవులను బద్దలు కోడుతున్నాయి.

"అమ్మగారి పనంతా అయిపోయింది"— రావులమ్మ మాటే మనసులో మ్రోగుతోంది. నిజంగా నేను చేయవలసిన పని అనేదే లేదా! ఇన్నాళ్ళూ ఈ సంసారం కోసం ఎంత తాపత్రయ పడ్డాను. కాని నేను సాధించిందేమిటి?

అసలు ఈ నేను అంటే ఏమిటి? ఈ శరీరమా! ఆత్మా! ఏమో నాకు సరిగ్గా తెలీదు.

కాని

ఈ శరీరాన్ని ఆవరించుకుని ఆశ్రయించుకున్న ఈ బ్రతుకు చాలా విలువైనదిగా తోచింది.

"వెధవ బ్రతుకు ఉత్త బోర్. దీనిలో ఏమి వుంది?" అని చాలాసార్లనుకున్నాను.

కాని ఇప్పుడు అలా లేదు. ఆ చిరాకు, విసుగు లేవు. ఏ వస్తువైనా ఉన్నప్పుడు దాని విలువ తెలీదు. ఈ చివరి దశలో తెలిసింది కాని ప్రయోజనం ఏమిటి?

జీవితం జారిపోతోంది. ఈ నాటకరంగం మీద నా పాత్ర అయిపోతోంది. ఇంత జీవితం, ఇన్ని సంవత్సరాలు ఎలా గడిపేశానో, ఎంత నిర్లక్ష్యంగా వృధా చేశానో, ఇంతకాలం గడిచిందే ఇన్నాళ్ళూ ఏం చేశాను? ఏం తెలుసుకున్నాను. ఏం సాధించాను. నా బ్రతుక్కి గమ్యం ఏదైనా వుందా? నా జీవితానికి లక్ష్యం ఏదైనా ఏర్పరచుకున్నానా! దేవుడు ప్రత్యక్షమై నా జీవితం ఇస్తే ఎంత తెలివితో, ప్రతిక్షణం ఎంత అపురూపంగా బ్రతుకుతాను. ఆలోచనలతో నా మనసు అలిసిపోయింది. స్తబ్దమైపోయింది.

దూరాన ఎక్కడో చావు డప్పు వినిపిస్తోంది. రాను రాను దగ్గిరవుతోంది. భయంకరంగా వినిపిస్తోంది. చెవి ప్రక్కనే వాయిస్తున్నట్లుగా వుంది. రెండు చేతుల్తో చెవులు మూసుకున్నాను.

స్వామీ! నన్ను బతకనివ్వు! ఎప్పుడూ బతికేలా ఉండనివ్వు నా మనసు పిచ్చిగా అరుస్తోంది. కళ్ళకి మైకం కమ్ముతోంది. నేను కూడా చావను కదా! అమ్మో! ఎలా? చచ్చిపోతున్నాను.

రక్షించండి. ఎవ్వరూ నన్ను ఆదుకో లేరా?

ఆదుకో....

"అమ్మగారూ! మీ కోసం ఎవరో వచ్చారమ్మా" రావులమ్మ నన్ను కుదుపుతూ పిలుస్తోంది.

కళ్ళు తెరిచాను. కొద్దినిమిషాలకి గాని స్పృహలోకి రాలేకపోయాను.

"అమ్మగారూ! ఎవరో వచ్చారమ్మా" నా కోసమా! ఎవరొచ్చి వుంటారు?

అమ్మ కాదు కదా! ఒళ్ళంతా సంతోషంతో జలదరించినట్లయింది.

"ఎవరే" అన్నాను.

"ఏమోనమ్మా! ఎవరో అమ్మాయిగారు"

అమ్మ కానందుకు నిరుత్సాహం కలిగినా ... కోసం వచ్చిన ఆ పిల్ల ఎవరో చూడాలనే కుతూహలం కూడా కలిగింది.

"సరే రమ్మను" నెమ్మదిగా లేచి సర్దుకుని కూర్చున్నాను.

రావులమ్మ వెనకాల ఒక అమ్మాయి లోపలకి వచ్చింది. నన్ను చూసి నమస్కారం చేసింది. వయస్సు పాతికేళ్ళు ఉండవచ్చు, సన్నగా, తెల్లగా చిగురుటాకులా వుంది. చక్కటి ముఖం, సరోవరంలో చేపల్లా తళతళలాడే కళ్ళు - చూడగానే ఆ అమ్మాయి చూపరులను ఆకర్షించే విధంగా వుంది.

"కూర్చోండి" కుర్చీ చూపాను. నిండుగా కొంగు కప్పుకుంది. బిడియంగా ఒదిగి కూర్చుంది.

ఎంత ఆలోచించినా ఆ అమ్మాయి ఎవరో జ్ఞాపకం రావటం లేదు.

"మీరు........"

ఆ అమ్మాయి నావేపు చూసి నవ్వింది.

"నేను మీకు తెలీదు. కాని మీరు నాకు తెలుసు నేను మోహన్‌గారి భార్యను నా పేరు జయ" అంది.

"మోహనా....ఎవరు చెప్మా...."కనుబొమలు చిట్లించాను.

"జ్ఞాపకం రాలేదా? మీకు పద్మ తెలుసు కదా! పద్మా, మోహన్ పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారు."

ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. మోహన్ని ఒకసారి పద్మ తీసుకువచ్చి పరిచయం చేసింది. చూడగానే చక్కని జంట అనుకున్నాను. అయితే మోహన్‌కి ఇదివరకే పెళ్ళయిందా! ఇంత అందమైన భార్యనుంచుకుని అదేం బుద్ధి! ఆశ్చర్యంలో తల మున్కలయ్యాను.

"ఆశ్చర్యపోతున్నారా! బహుశ మీకు తెలిసి వుండదు. మాకు పెళ్ళయి నాలుగేళ్ళు అయింది. ఇప్పుడు చూడండి ఆయన నాకు విడాకులిస్తారుట. నేనంటే అసహ్యంట. నాతో కాపురం నరకం అట. ఇప్పుడు నేనేం చెయ్యాలో మీరే చెప్పండి" కంఠంలో ఆవేశం, బాధ మిళితమయ్యాయి.

నాకంతా అయోమయంగా వుంది. బహుశ ఈ విషయం పద్మకి తెలీదేమో, తెలిస్తే ఇంత నీచానికి ఎప్పుడూ ఒప్పుకోదు. అయినా మోహన్ ఎంత రాక్షసుడు. పెళ్ళంటే బొమ్మలాటలా వుంది. ఆరితేరిన హంతకుడు. కనిపించకుండా ప్రాణాలు తీసేలా వున్నాడు. అతని అందమైన నవ్వు వెనకాల ఇంత విషం దాగివుందా!

"నా మాటలు నిజమో, కాదో అనుకుంటున్నారా".

"ఛ! అదేం కాదు మోహన్ చేస్తున్న అఘాయిత్యం గూర్చి ఆలోచిస్తున్నాను".

"మీ గురించి ఆయన చెప్పారు. మీరు వాళ్ళ పెళ్ళికి అంగీకరించారట కదా! మీకు అసలు విషయం చెప్పి ఈ కష్టం నుండి నన్ను గట్టెక్కించమని అడగడానికి వచ్చాను".

ఆ అమ్మాయి కళ్ళు రెండూ సరస్సులయ్యాయి.

నేను ముందుకు వంగి ఆ అమ్మాయి కన్నీటిని తుడుస్తూ.

"లేదమ్మా, నాకే విషయాలేమీ తెలియవు. పద్మ చెప్పలేదు. మోహన్ చెప్పలేదు. తెలిస్తే ఇంతటి ఘోరాన్ని ప్రోత్సహిస్తానా" అన్నాను.

ఆ అమ్మాయి కళ్లు తుడుచుకుంది. నాకు అర్థం కాని విషయం ఒక్కటే.

ఇంతటి అందమైన భార్యని మోహన్‌కు ఎలా వదలబుద్ధయిందా అని? నిజం చెప్పాలంటే ఈ అమ్మాయి ముందు పద్మ తీసికట్టే!

"మీది ఇష్టం లేని పెళ్లా! అంటే మోహన్‌కి నువ్వంటే ఇష్టం లేదా!" అసలు మూలకారణం ఏమిటో తెలుసుకోవాలని అడిగాను.



# మీ రచయిత్రితో మీరు

వచ్చే నెల నుంచి ఆరంభమవుతున్న ఈ శీర్షికలో ప్రసిద్ధ రచయిత్రి కుమారి వాసిరెడ్డి సీతాదేవి, పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు. మే నెలలో

ప్రసిద్ధ రచయిత్రి

## డాక్టర్ సి. ఆనందారామం

పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము. పాఠకులు ఆమె కథల మీద గాని, నవల మీద గాని, వ్యక్తిగతంగా గాని ఇతరత్రా గాని ఎలాంటి ప్రశ్నలయినా అడగవచ్చు. ప్రశ్నలు కార్డు మీదనే రాయాలి. ఒక కార్డులో ఒక్క ప్రశ్నే వుండాలి. పైన పంపిన వారి పేరు, చిరునామా వుండాలి. ప్రశ్నలు 'మీ రచయిత్రితో మీరు' అని రాసి, 'వనిత' చిరునామాకు మార్చి 15వ తేదీలోగా చేరేలా పంపాలి. ఈ ప్రశ్నలకు సమాధానాలు మే సంచికలో వస్తాయి.

మంచి ప్రశ్నగా భావింపబడిన ప్రశ్న పంపినవారికి

పాతిక రూపాయలు బహుమానం!!

"ఆయనంటే నాకిష్టమే. కాని ఆయన మనస్సులో ఏముందో నాకు తెలీదు! పైకి మామూలుగానే ఉండేవారు."

"ఆశ్చర్యంగా ఉందే మరి అటువంటివాడు ఎలా మారాడు."

జయ నవ్వింది. "అక్కయ్యగారూ! మగాళ్లు మారడం ఎంతసేపండి. ప్రవహించే నది ఎప్పుడూ కొత్తనీటికే స్థానం ఇస్తుందిట. అలాగే వారికి కూడా రోజురోజుకీ కొత్త సుఖం కావాలి. అన్ని వస్తువుల్లాగానే కొన్నాళ్ళకి భార్య కూడా పాతదయింది." అంది జయ బాధగా.

వివాహబంధం పవిత్రమైంది అంటారు. అది శాశ్వతంగా భార్యాభర్తల్ని కలిపివుంచుతుంది. ఆ మంత్రాలకి ఆ శక్తి వుంది అంటారు. మరి జయ, మోహన్ మంత్రాలసాక్షిగా వివాహం చేసుకున్నారు. కాని అది మూన్నాళ్ళముచ్చట అయింది. ఆ మంత్రాల శక్తి ఏమయింది? వివాహబంధం విలువ ఇంతేనా?

"నువ్వు చదువుకున్నావా జయా!"—ఆ క్షణంలో జయ నాకు ఆత్మీయురాలిలా అన్పించింది. ఈ అమ్మాయి జీవితానికీ, నా జీవితానికీ ఎక్కడో పోలిక ఉన్నట్లనిపించింది. అందుకే ఏకవచనంలో సంబోధించాను.

'ఆ! బి. ఎ. ప్యాసయ్యాను" అంది జయ.

"మరింకేం? చదువుకున్నదానివి. అతడు నీకు విడాకులిస్తే ఏం! హాయిగా ఏదైనా ఉద్యోగం చేసుకుంటూ బతకొచ్చుకదా! పాతకాలపు స్త్రీలా ఇంకా భర్త నీడలోనే ఉండాలని కోరుకోవడం దేనికి?" అన్నాను.

జయ నావైపు విచారంగా చూసింది.

"అక్కయ్యా! మీ కింకా లోకంపోకడ అర్థం అయినట్లులేదు. కాలం మారింది. కాని మనుషులు మాత్రం మారలేదు. పైకి మాత్రం ఈ సంఘం మారినట్లు కన్పిస్తోంది. కాని లోపలంతా ముదుగు వాసనే, పాత భావాలు కుళ్ళి కంపుకొడుతున్నాయి. మనిషి పై ఆకారం ఆధునికంగా వేసుకుని తనలో ఎంతో మార్పు వచ్చినట్లు నటిస్తున్నాడు. కాని అతని నరనరాన పాత భావాలే. అతని రక్తంలో ఉన్నది ఎర్ర, తెల్ల కణాలు కావు. మూఢాచారాలు, ఛాందస పాత ధోరణులు."

"స్త్రీలు చదువుకోవాలి. కాని తన భార్య చదువుకున్నదై ఉండకూడదు. స్త్రీలందరూ స్వేచ్ఛగా అందరితో మాట్లాడాలి. కాని తన భార్య తనని కూడా సూటిగా చూడకూడదు. స్త్రీలు తనతో షికార్లు కొట్టాలి. కాని తన భార్య వంటింటి గడప దాటి బయటకు రాకూడదు. ఇదీ అక్కయ్యా నేటి పురుషుల మన స్తత్వం" ఆవేశంగా మాట్లాడ్డం వలన జయ కంఠం రాచుకుపోయినట్లు బొంగురుపోయింది. ముఖం ఎర్రబడింది. నా కన్నా ఎక్కువగా జయకి ఈ లోకం గురించి తెలిసినట్లుంది.

"అక్కయ్యా! మనం చూసే మార్పంతా పుస్తకాల్లోనే నిజ జీవితంలో ఆవగింజంత మార్పు కూడా కనబడడం లేదు. భర్త నీడలో వున్న స్త్రీకే గౌరవం. భర్తని వదిలితే ఆమె గతి కుక్కగతే."

జయ చెప్పే మాటలన్నీ పరమ సత్యాలు. ఇంత తెలివితేటలు గల పిల్లకి మోహన్ విడాకులిస్తాడంటే అతను పరమ మూర్ఖుడయి ఉండాలి.

"మోహన్‌కీ, నీకూ తగాదా ఏమన్నా వచ్చిందా?" అని అడిగాను.

"తగాదానా" అటువంటిదేమీ లేదు. మొదట్లో అంటే మా పెళ్లి సమయంలో కూడా మోహన్ సరదాగానే వున్నారు. కాని అక్కయ్యా! మొదటి రాత్రే మోహన్‌గారి మనస్తత్వం కొద్దిగా అర్థమైంది నాకు. ఆ రాత్రి ఆయన నన్నడిగిన మొదటి ప్రశ్న "నీకు బి. ఏ లో క్లాసు వచ్చిందా" అని.

మా రిజల్ట్సు వచ్చి అప్పటికి వారమైంది. 'ఆ! ఫస్టు క్లాసు వచ్చింది' ఉత్సాహంగా చెప్పాను. 'ఊహు' అన్నారు సాలోచనగా.

బహుశ ఎమ్మే చదివించడానికి అడిగారేమో అనుకుని సంతోషపడ్డాను.

"ఏమండీ! నేను ఎమ్. ఎ చదవనా?" అని అడిగాను.

ఆయన ముఖం చిట్లించారు.

"చదువా! చదువుకోడానికి నువ్వేమీ కన్నెపిల్లవు కావు. గృహిణివి. సంసారాన్ని బాగా నడుపుకుంటే చాలు" అంటూ చికాకు పడ్డారు.

నా మనస్సు చిన్నబోయింది. చిన్నప్పట్నించీ

ఎమ్. ఎ. చదవాలని నా కోర్కె. ఇక నాకు చదువు యోగం లేదేమో.

"ఈ వెధవ చదువులొచ్చి ఆడవాళ్ళని చెడ గొడుతున్నాయి. ఎక్కడ చూసినా చదువుకున్న ఆడపిల్లలే" విసుక్కుంటూ లైటు తీసి పడుకున్నారు.

ఆయన ధోరణికి విస్తుపోయాను. ఏవేవో భయాలు కూడా కలిగాయి. తొందరపడి నిర్ణయానికి వచ్చే స్వభావం కాదు నాది. అయినా ఒక్కరోజులోనే ఆయన స్వభావం ఏం తెలుస్తుంది? ఏది ఏమైనా ఆయనకు స్త్రీ అంటే చులకన. చదువుకున్న వాళ్ళంటే భయం ఉన్నాయని గ్రహించ గలిగాను.

రోజులు గడిచేకొద్దీ ఆయన స్వభావం అర్థం కాజొచ్చింది. ప్రతి చిన్న విషయంలోనూ ఆయన మాటే నెగ్గాలని చూస్తుండేవారు. నేను చదువుకున్నాను కాబట్టి నేనెక్కడ ఆయన మాటను ఎదిరిస్తానోనని ఆయన అన్నివిధాలా నన్నణచాలని చూస్తుండేవారు.

నాకిష్టమైన చీర కట్టుకోకూడదు. ఇష్టమైన కూర చేసుకోకూడదు. అంతా ఆయన చెప్పినట్లు చేస్తే మాత్రం ప్రేమాభిమానాలు కురిపించేవారు.

మొదట్లో ఇది బాధనిపించినా రాను రాను రొటీన్ జీవితమయింది.

వండటం, తినటం, నిద్ర. పిల్లలు ఉంటే కాస్త మార్పు ఉండేది. కాని దానికీ నేను నోచుకోలేక పోయాను.

ఏది ఏమైనా రోజులు ఏదోలా గడుస్తున్నాయి.

కాని ప్రశాంతంగా పారే నీటిలో రాయిలా, ప్రశాంత వాతావరణంలో ఉరుములా పద్మ నా జీవితంలో ప్రవేశించింది!

ఆయనో రోజు సాయంత్రం ఇంటికొచ్చి—

"జయా! రేపు మా ఆఫీసులోని నా కొలీగ్ భోజనానికి వస్తుంది. వంట బాగా చెయ్యి" అన్నారు.

ఆయన కొలీగ్స్‌తో భోజనానికి రావటం అలవాటే. వచ్చినవాళ్ళు సాయంత్రంవరకూ కూర్చుని పేకాడుకునే వారు. వాళ్ళ అరుపులతో, కేకలతో నవ్వులతో ఇల్లు అదిరిపోతూ ఉండేది. అందుకే ఆదివారం వస్తుందంటే నాకు భయం కూడా వేస్తుండేది.

నేను మారు మాట్లాడకుండా మర్నాటి భోజనానికి కావల్సిన ఏర్పాట్లు చేశాను.

[సశేషం]

## కలువరేకుల ముగ్గు



మొదట 21 చుక్కలు 7 వరుసలు పెట్టాలి. తరువాత వరుసగా 19, 17, 15, 13, 11, 9, 7 వరకు చుక్కలు పెట్టాలి. చిత్రంలో చూపిన విధంగా ముగ్గు కలుపుకుంటే కలువ రేకుల ముగ్గు ముచ్చటగా పూర్తవుతుంది.

—వై. నాగమణి, చిలకలూరిపేట



సదర్న్ కాలిఫోర్నియా విశ్వ విద్యాలయంలో చదువుకుంటూనే ఒక కంపెనీలో పార్ట్ టైం రిసెప్షనిస్ట్‌గా ఉద్యోగం చేస్తూందేది ఓ అందాల యువతి.

సాల్ట్‌లేక్ సిటీలో ఓసారి మల్లయుద్ధం పోటీలు జరిగాయి. అందులో ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన మహమ్మదాలీ కూడా పాల్గొంటున్నారు. ఆ పోటీలు చూడడానికి సహ విద్యార్థినులతోపాటు బయలు దేరిందా యువతి. పోటీలో ఎవరు గెలుపొంద గలరు అన్న విషయం మీద ఆ విద్యార్థినుల మధ్య పందెం వచ్చింది. మహమ్మదాలీ ఓడిపోతాడని పందెం కాయడమేకాదు – అదే జరగాలని మన సులో దేవుణ్ణి ప్రార్థించిందా యువతి.

ఆ తర్వాత ఆమె ఎగ్జిబిషన్ సమయంలోనే మహమ్మదాలీని తొలిసారిగా చూసింది. చూపులు కలిసాయి. ఒకరినొకరు ప్రేమించుకుని 1975 సం॥ దంపతులయ్యారు.

"బాక్సింగ్ చాలా అపాయకరమైన క్రీడ కదా" అని ఆమెను అడిగినప్పుడు. "మరి అపాయకరం కాని క్రీడ ఏది చెప్పండి? అయినా అందరూ అను కునేంత అపాయకరమైనది కాదు బాక్సింగ్, క్రికెట్, హాకీ మొదలైన క్రీడలలో తగిలే వాటి కన్నా బాక్సింగ్‌లో గాయాలు తగిలే అవకాశాలు తక్కువ. మాకు పెళ్ళయ్యాక ఇంతవరకు ఒక్క సారి కూడా ఆయనకు గాయం తగలలేదు" అందావిడ.

మహమ్మదాలీతో ప్రపంచ పర్యటన గురించి ముచ్చటిస్తూ "ఆయన ఎక్కడికి వెళ్ళినా ప్రవాహంలా ప్రజలు ఆయన్ను చుట్టుముడతారు. ప్రైవసీ అన్నది వుండదు. అయినా నాకు అది అలవాటయి పోయింది. పైగా నాకు ప్రయాణం అంటే చాలా సరదా" అన్నారు.

భారతదేశం పర్యటన గురించి చెబుతూ

టైటిల్ సాధించినప్పుడు 'నల్లజాతివాడు దానిని పొందడమా' అని శ్వేతజాతీయులందరూ అసూయ పడ్డారు. ఇవాళ కూడా శ్వేతజాతీయులు ఎవరైనా నల్లవారిని పెళ్లాడడానికి ఇష్టపడితే రకరకాల చిత్రహింసలకు గురికావలసిందే. నల్లజాతివారు ఉన్నతస్థితికి రావడం వాళ్లు చూడలేకుండా వున్నారు" అందామె తన భర్తను గురించి తమ స్థితిని గురించి వివరిస్తూ—

# వెరోనికా మహమ్మదాలీ



ఆ అందాల యువతి సుప్రసిద్ధ మల్లయుద్ధ వీరుడు మహమ్మదాలీ సతీమణి వెరోనికా।

మహమ్మదాలీ భారతదేశ పర్యటన సమయంలో వెరోనికా కూడా ఆయనతో వచ్చారు. మద్రాసులోని ఒక హోటల్లో ఆమెను కలుసుకున్నప్పుడు బెనారస్ పట్టుచీరతో, నుదుట కుంకుమ బొట్టుతో అచ్చం భారతీయ వనితలా నిండుగా కనబడింది.

కాలిఫోర్నియాలో పుట్టి పెరిగిన ఈమె పట్ట భద్రురాలు. చదువు ముగిశాక కొంతకాలం సేల్స్ వుమన్‌గా పని చేశారు. మూడుసార్లు వరల్డ్ టైటిల్ సాధించిన మహమ్మదాలీ మూడో భార్య ఈమె. ఈ విషయం ప్రస్తావించినప్పుడు— "వెరోనికాను పెళ్లాడిన తర్వాత ఆడవాళ్ళను చూడడమే మానేశాను. ఆమెతో నా వివాహం మూడవది మాత్రమే కాదు. కడపటిది కూడా" అన్నారు మహమ్మదాలీ నవ్వుతూ.

"ఆయనకు మహాత్మాగాంధి అన్నా భారతదేశం అన్నా యెనలేని గౌరవం. ఒక జాతి మరొక జాతిని పీడించే దుర్మార్గం సహించరు మహమ్మదాలీ. జాతి దురహంకారాన్ని వ్యతిరేకించడంలో మహాత్మా గాంధిని ఆదర్శంగాగలవారు ఆయన. అందువల్ల మహాత్మాగాంధి పుట్టిన భారతదేశంలో మా పర్యటనను పవిత్రయాత్రగా భావిస్తున్నాము. ఈ సం॥ డిల్లీలో రిపబ్లిక్ దినోత్సవాలూ చూశాము. ఇది మా జీవితంలో మరచిపోలేని అనుభవం. చాలా రోజులుగా చూడాలనుకున్న ఇందిరాగాంధిని కూడా ఈ సందర్భంలో కలుసుకున్నాము. అందువల్ల ఇది ఎంతో ఆనందదాయకమైన పర్యటన" అన్నారు ఆమె.

"తను నల్లజాతివాడుగా పుట్టడం వల్ల మహమ్మదాలీ పసిప్రాయం నుంచే ఎన్నో కష్టనష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది. ప్రపంచం

"అందువల్లే మా ఆయన జాతి దురహంకారాన్ని రూపుమాపడం జీవిత లక్ష్యంగా గలవారు. అంతే కాదు. ఆయనకు దేవుడి మీద అచంచలమైన భక్తి విశ్వాసాలు వున్నాయి. అంచేత కమ్యూనిజం అన్నా గిట్టదు" అన్నారామె.

మన దేశం స్త్రీల గురించి చెబుతూ "భారతీయ వనితలంత అందమైన స్త్రీలను నేను ఎక్కడా చూడ లేదు. శాంతం, ప్రేమ వారి వదనాలలో దోబూచు లాడుతూ వుంటాయి. అయితే వారి పెళ్ళి తతంగం మాత్రం అసలు అంతుబట్టడం లేదు. ముందూ వెనకా పరిచయం లేకుండానే తల్లిదండ్రులు నిర్ణయించిన ప్రకారం పెళ్ళిళ్ళు చేసుకునే యువతీ యువకుల్ని తలుచుకుంటేనే వింతగా వుంది. అయినా ఇప్పుడిప్పుడే ప్రేమ వివాహాలు కూడా ప్రాచుర్యంలోకి రావడం హర్షించదగ్గ విషయం" అన్నారు శ్రీమతి వెరోనికా. □

# సంస్కృత పాఠమాల 15

సంస్కృతమును నేర్చుకొనుటకు శబ్దముల పరిణామము తెలిసికొనక తప్పదు. సంస్కృత శబ్దములు సుబంతములని తిజంతములని రెండు విధములని అందు సుబంత శబ్దములు పుంలింగ, స్త్రీలింగ, నపుంసకలింగములని మూడు విధములని మరల వీటన్నిటికి విభక్తులున్నవని ఆ విభక్తులలో శబ్దములు వేరు వేరు రూపములు వహించునని తెలిసికొన్నాము.

మరల ప్రతి విభక్తియందు, ఏక, ద్వి, బహువచనములు.

ముందు పాఠములందు అకారాంత పుంలింగ శబ్ద పరిణామములను, ఇకారాంత పుంలింగ శబ్ద పరిణామములను, ఉకారాంత పుంలింగ శబ్ద పరిణామములను తెలుసుకొన్నాము. పుంలింగములైన యితర శబ్దములనేకములు–ఋకారాంతములు (పితృ, ధాతృ, జామాతృ, భ్రాతృ) ఓ కారాంతములు (గో, సుద్యో-న్మ్రుశ్యో) మొదలగు అజన్త (అచ్చుతో అంతమగు) పుంలింగములు మాత్రమేగాక ఆత్మన్, మహాత్మన్, బ్రహ్మన్ మొదలగు శబ్దములు 'అన్'తో అంతమగునవి. సుఖిన్, వనవాసిన్, ఏకాకిన్, పక్షిక మొదలగు శబ్దములు 'ఇన్'తో అంతమగునవి.

భగవత్, భవత్, శ్రీమత్, ధీమత్, యావత్, మొదలగు శబ్దములు 'వత్, మత్'తో అంతమగునవి. ఈ విధముగా బహుశబ్దముల స్వరూప పరిణామమును పాఠకులు 'శబ్దమంజరి' మొదలగు గ్రంథములను చూచి గ్రహించవలెను.

అథ స్త్రీలింగినః శబ్దాః **अथ स्त्रीलिगिन: शब्दा:** స్త్రీలింగ శబ్దములు.

ఆకారాన్తః స్త్రీలింగో రమాశబ్దః **अ।कारान्त: स्त्रीलिगो रमा शब्द:** ఆకారాంతము రమా శబ్దము.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము | |
|---|---|---|---|---|
| **प्रथमा** | రమా | రమే | రమాః | ప్రథమావిభక్తి |
| **द्वितीया** | రమామ్ | రమే | రమాః | ద్వితీయావిభక్తి |
| **तृतीया** | రమయా | రమాభ్యామ్ | రమాభిః | తృతీయావిభక్తి |
| **चतुर्थी** | రమాయై | రమాభ్యామ్ | రమాభ్యః | చతుర్థీవిభక్తి |
| **पञ्चमी** | రమాయాః | రమాభ్యామ్ | రమాభ్యాః | పంచమీవిభక్తి |
| **षष्ठी** | రమాయాః | రమయోః | రమాణామ్ | షష్ఠీవిభక్తి |
| **सप्तमी** | రమాయామ్ | రమయోః | రమాసు | సప్తమీవిభక్తి |
| **संबोधनम्** | హే రమే | హే రమే | హే రమాః | సంబోధనా |

ఏవం సీతా, కన్యా, భామా, పద్మా, శాలా, కౌసల్యా, భార్యా ఇత్యాదయః ఇదే విధముగా సీతా, కన్యా, భామా, పద్మా, శాలా, కౌసల్యా, భార్యా మొదలగు ఆకారాంత స్త్రీ శబ్దములు.

ఇకారాన్తః స్త్రీలింగోమతి శబ్దః ఇకారాంత మతి శబ్దము.

| | | | | |
|---|---|---|---|---|
| **प्रथमा** | మతిః | మతీ | మతయః | ప్రథమా |
| **द्वितीया** | మతిమ్ | మతీ | మతీః | ద్వితీయా |
| **तृतीया** | మత్యా | మతిభ్యామ్ | మతిభిః | తృతీయా |
| **चतुर्थी** | మత్యై (మతయే) | మతిభ్యామ్ | మతిభ్యః | చతుర్థీ |
| **पञ्चमी** | మత్యాః (మతేః) | మతిభ్యామ్ | మతిభ్యః | పంచమీ |
| **षष्ठी** | మత్యాః (మతేః) | మత్యోః | మతీనామ్ | షష్ఠీ |
| **सप्तमी** | మత్యాం (మతౌ) | మత్యోః | మతిషు | సప్తమీ |
| **संबोधनम्** | హే మతే | హే మతీ | హే మతయః | సంబోధన |

ఏవం రుచిః ధృతిః భూమిః కీర్తిః. ఇత్యాదయః ఇదే విధముగా ఇకారాంత స్త్రీలింగములైన రుచి, ధృతి, భూమి, కీర్తి, మొదలగునవి.

[సంస్కృత పాఠాల మీద సందేహాలున్నవారు–'వనిత'కు రాసి తెలుసుకోవచ్చును]

# బామ్మగారి పేజీ

జలుబు!

మామూలుగా ప్రతి వాళ్ళకీ వేళాపాళా అనేం అక్కర్లేకుండా ఛట్టున వచ్చేస్తుందర్రా ఈ జలుబు! జలుబునే కొందరు పడిశం అంటారు; కొందరు శైత్యం అంటారు.

కొందరనుకుంటూ వుంటారూ — "ఇదేమిటి, నేను తలకి ఎక్కువసేపు స్నానం చెయ్యలేదు గదా, ఛట్టున జలుబు ముంచేసిందేమిటి చెప్మా" అని. బాగా చన్నీటి తలకి స్నానం చేస్తేనే జలుబు వస్తుందని వాళ్ళ నమ్మకం. అది నిజమేగాని, జలుబు రావడానికి అదొక్కటే కారణం కాదు — ఎండలో ఎక్కువసేపు తిరిగినా కూడా జలుబు ముంచేస్తుంది! అంచేత, జలుబుకి వేడీ చెయ్య కూడదు; చలవా చెయ్యకూడదన్న మాట! ఎండలో ఎక్కువసేపు తిరిగితే శరీరానికి నజ్జు కలుగుతుంది. దాంతో పడిశం పడుతుంది. కొందరికి కొత్త నీరు - అంటే ఇంకో వూరు వెళ్ళి రెండు రోజులపాటు అక్కడ నీళ్ళు తాగితే, జలుబు చేస్తుంది. వాతావరణం మారితే జలుబు చేస్తుంది. సాధారణంగా చూడండి, చలికాలం వెళ్ళి ఎండాకాలం వస్తోందనుకోండి, అప్పుడు జలుబు చేస్తుంది; అలాగే ఎండాకాలం వెళ్ళిపోయి వర్షాకాలం వచ్చినా, ఆ తర్వాత చలికాలం వచ్చినా జలుబు చేస్తుంది. జలుబు రావడంతో వున్న ఇబ్బందిలెలాంటిదంటేనర్రా — ఎండాకాలంలో ఎండలో తిరిగితే వస్తుందా - వర్షాకాలంలో వానలో బాగా తడిస్తే వస్తుంది; అలాగే చలికాలంలో రాత్రివేళ తిరిగినా వస్తుంది. ఇవేవీ కాకపోయినా, ఇంకా మరికొన్ని కారణాలవల్ల కూడా వస్తుంది.

ఇహ—

జలుబు పట్టిందంటే ఏ పనీ తోచదర్రా. సరిగ్గా గాలి పీల్చలేం. తుమ్ములు, ముక్కు మాటిమాటికీ చీదడం! అబ్బ - చిరాగ్గానే వుంటుంది. అంచేత ఇలాంటి వాతావరణం అయితే జలుబు చేస్తుంది గనక, అలాంటి వాతావరణంలో తిరగడం బాగా తగ్గించెయ్యాలి. అయితే, ఎండాకాలంలో ఎండల్లో తిరగవలసి వస్తుంది - చాలామందికి. వాళ్ళు బుగ్గన ఊరబెట్టిన ఉసిరికాయో, పచ్చి ఉసిరికాయో పెట్టుకుంటారు. అది, బాగా నోట్లో మెత్తబడ్డాక నమిలి, మింగేస్తారు. ఎందుకని? ఉసిరికాయ దాహాన్ని కడుతుంది. పైగా జలుబు చెయ్యకుండా నిరోధిస్తుంది. ఉసిరికాయలో - ఆరు రుచుల్లో ఒక్క ఉప్పు రుచి తప్ప, తక్కిన ఐదు రుచులూ వున్నాయట! ఆయుర్వేద వైద్యులు 'చ్యవనప్రాశ లేహ్యం' చేస్తారు చూడండి. అందులో ముఖ్యంగా ఉసిరికాయలు వాడతారు. అవి ఏమిటో తెలుసునర్రా — చైత్రమాసంలో వచ్చే ఉసిరికాయలు. అవి ఇంకా శ్రేష్ఠమైనవన్న మాట. మనం ఉసిరి పచ్చడి చేసుకుని నిలవచేసి వుంచుకుంటాం చూడండి, అది చైత్రమాసంలో వచ్చే వాటితో చెయ్యడం మరీ మంచిదన్న మాట. ఉసిరికాయలు ఉప్పులో ఊరవేసుకుని కూడా తినవచ్చును.

ఉసిరి 'చెట్టు'కు కూడా కొంత ప్రాముఖ్యత వుందర్రా. మన వాళ్ళు వన సంతర్పణలు చేస్తారు - మీకు తెలుసో తెలీదో, ముఖ్యంగా కార్తీక మాసంలో ఇవి జరుగుతూ వుంటాయి. తోటల్లో ఉసిరిచెట్లుంటే, వాటికింద కూచుని భోజనం చేస్తారు. అలా భోజనం చెయ్యడం - ఆరోగ్యానికి ఎంతో మంచిదని శాస్త్రం!

సరే, సందర్భం వొచ్చిందని ఉసిరికాయ గురించి కూడా చెప్పాననుకోండి—మరి జలుబు తగ్గడానికేం చెయ్యాలీ?

జలుబుకి చాలా మందులున్నాయి. బజార్లో ఎన్నో ఇంగిలీషు మందులు దొరుకుతాయి. ఏమైనా, ఏదో మన తృప్తి కోసం వేసుకుంటాంగాని, ఈ మందులతో జలుబు వెంటనే తగ్గదు. అన్నిటి కంటే శ్రేష్ఠమైన విధానం - ఆవిరిపట్టడం. నీళ్ళు బాగా మరిగించి, దింపిన వెంటనే అందులో కాస్త పసుపు పొడి వేసి, తలనిండా కప్పుకుని, ఆ ఆవిరిని బాగా పీల్చాలి. ఇలా రోజుకి మూడుసార్లు చేస్తే, జలుబు తగ్గుతుంది. మన ఇంగిలీషు డాక్టర్లు కూడా మందులు ఇచ్చినా, ఈ విధానం కూడా పాటించమంటార్రా.

అయితే, జలుబువచ్చి ఎలాగూ నాలుగైదు రోజులుంటుంది గనక, ఇహ దానికి మందెందుకు? కూడదు. పడిశాన్ని ఉపేక్షిస్తే అది మరో వ్యాధికి దారి తీస్తుంది. కొందరికి జలుబు రావడంతోనే, దగ్గు కూడా వస్తుంది. ఊపిరితిత్తుల నిండా కఫం చేరుతుంది. జలుబు, దగ్గు రెండూ వుంటే, తల నొప్పి రావడం, వొళ్లు నొప్పులు కలగడం, తర్వాత జ్వరం రావడం - ఇలాంటివెన్నో జరుగుతాయి.

అసలు - ఈ 'దగ్గు' అన్నది వుందే, ఇది ప్రత్యేకమైన రోగం కాదర్రా. ఏదైనా ఒక రోగంతోనే ఇది కలిసి వస్తుంది. అదీ దాని గుణం. దగ్గు తగ్గడానికి లవంగం, కరక్కాయ బాగా పని చేస్తాయి. ఇవి రెండూ అలా బుగ్గన పెట్టుకున్నా మంచిదే - లేదూ రెండూ కలిపి వేయించి, పొడిచేసి (దొరికితే దుంపరాష్ట్రం కూడా అరగదీసి వెయ్యొచ్చు) తేనెలో కలుపుకుని రోజుకి రెండు పూటలు చొప్పున వేసుకుంటే అది మరీ మంచిది. లేదా మిరియాలు, బెల్లం కలిపి మెత్తగా నూరి ఉండల్లా చేసుకుని, బుగ్గన పెట్టుకుని చప్పరించినా, దగ్గులు తగ్గుతాయి. పల్లెటూళ్ళలో కొందరు వంట చేసుకున్న పొయ్యి (కుమ్ము)లో వెల్లుల్లిపాయను ఉడికించి, తింటారు. అదీ మంచిదే. ఈ మందులు కఫాన్ని కూడా హరిస్తాయి. ఇదేమిటర్రా - జలుబు సంగతి చెబుతూ వుంటే, చట్టున నాకు తుమ్ములు వస్తున్నాయి — చెప్పానుగా, కారణం లేకపోయినా జలుబు ఛట్టున వచ్చేస్తుందని! సర్లెండి సాయంకాలం లోపల తగ్గకపోతే, ఎలాగూ ఆవిరి బడతాను....ఉల్డాలర్రా బరి!....

"జలుబుకి మందు వేసుకుంటే, ఏడు రోజుల్లో తగ్గిపోతుంది; వేసుకోకపోతే వారం రోజులుంటుంది" అని మా డాక్టర్ల సామెత. మనుషులు చంద్రలోకయాత్రలు చేసేంతవరకూ విజ్ఞానశాస్త్రం పెరిగిందిగాని, జలుబుకి సరైన మందు కనిపెట్టక పోతోంది. చాలామంది డాక్టర్లు 'యాంటిబయాటిక్స్' మందులు ఇస్తారు జలుబుకి. 'వైరల్ ఇన్‌ఫెక్షన్స్'కి యాంటిబయాటిక్స్ మందులు పని చెయ్యవు. అలాగే పెన్సిలిన్ ఇవ్వడం కూడా మంచిదికాదు. కొంతమంది 'విటమిన్ సి' మాత్రలు తీసుకుంటే జలుబు తగ్గిపోతుందనుకుంటారు. ఇది నిజం కాదు. శరీరంలో 'విటమిన్ సి' బాగా తగ్గిపోయినప్పుడైతే, ఈ మాత్రలు తీసుకుంటే ఉపయోగపడతాయి గాని, మామూలుగా జలుబు చేసినప్పుడు వేసుకుంటే ఏమీ ప్రయోజనం లేదు! కొందరు నేసల్ డ్రాప్స్ (ముక్కు రంధ్రాల్లో వేసుకునే మందు చుక్కలు) వాడుతూ వుంటారు. ఇవి, నాలుగు రోజులకి మించి రోజుకు నాలుగైదుసార్ల చొప్పున వాడకూడదు! ఈ మందులో దిబ్బడ తగ్గడానికి శక్తివంతమైన పదార్థాలు వుంటాయి. ఎక్కువగా గనక, ఈ డ్రాప్స్ వేసుకుంటే, అవి ఎదురు తిరిగి 'దిబ్బడ'ను ఎక్కువ చేస్తాయి! అలాగే 'ఇన్‌హేలర్స్' కూడా ఎక్కువగా వాడకూడదు. అయితే, మరి జలుబు తగ్గడానికి మంచి విధానం ఏది?—పురాతన కాలం నుంచి వస్తున్న ఆవిరిపట్టే విధానమే!!

డాక్టర్

# చిట్టి కథ




రైలు ఔటర్ సిగ్నల్ దగ్గర ఆగిపోయింది. స్టేషన్ మరో ఫర్లాంగు దూరమే వుంది. పచ్చని పొలాల మీంచి వీచేగాలి కిటికీలోంచి దూరి శరీరానికి చల్లగా తగుల్తోంది. వాతావరణం హాయిగా వుంది. ట్రావెలింగు బాగు భుజానికి తగిలించుకుని జాగ్రత్తగా కంపార్టుమెంటు దిగి రైలు పట్టాల మీద నడుస్తున్నాను. బాలెన్సు కుదరటం లేదు. పదేళ్ళ కిందటి పాత స్మృతులు మనసులో మెదిలి గిలిగింతలు పెడుతున్నాయి. అప్పుడు నాకు పన్నెండేళ్ళుంటాయేమో. కృష్ణ నాకన్నా రెండు మూడేళ్లు పెద్ద. ఎలిమెంటరీ స్కూల్లో చదువుకునే రోజులు. ఎన్ని సాయంకాలాలు నేనూ, కృష్ణా ఈ రైలు పట్టాల మీద చెట్టాపట్టా లేసుకుని ఎంతెంత దూరం నడిచేవాళ్ళమో! ఓడిపోయిన వాళ్ళు గెలిచిన వాళ్ళకి - మర్నాటిరోజు మాబడి ముందర అమ్మే జాంపళ్ళు కొనివ్వాలి. అదీ మా పందెం. కృష్ణ నాతో సమంగా నడవలేకపోయేవాడు. పది గజాలైనా నడవక ముందే బాలెన్సు తప్పిపోయేది. చప్పట్లు చరిచి నవ్వుతూ ఎగతాళి పట్టించేదాన్ని. పట్టుకువి మొట్టికాయ లేసేవాడు. ఒకసారి గాలిలో తేలిపోతూన్నట్టు హుషారుగా పట్టాల మీద నడుస్తున్నాను. వెనకనించి వేసిన ఇంజను కూత కూడా వినిపించలేదు నాకు. సుడిగాలిలా రివ్వున దూసుకువచ్చి నన్ను పొదివి పట్టుకుని పక్కకి తప్పించాడు కృష్ణ. ఆ ఊపుకి ఇద్దరం దొర్లుకుంటూ రైలు పట్టాలమీంచి కిందపడ్డాము. ఇద్దరికీ మోకాళ్లు మాత్రం గీరుకుపోయినయ్. భయంతో కొద్ది క్షణాలపాటు కృష్ణని గట్టిగా కరచుకుని వుండిపోయాను. తెలిసీ తెలియని ఆ పసిప్రాయంలోనే అతని కౌగిట్లో నాకు కలిగిన అనిర్వచనీయమైన అనుభూతి నాకిప్పటికీ బాగా గుర్తు. ఆ తరువాత కొన్నాళ్ళకి నాన్నకి బదిలీ అయింది. నేను కృష్ణకి కొన్ని వందల మైళ్ళు దూరంగా వెళ్ళిపోవడం జరిగింది. ఎప్పుడైనా వుత్తరాలు రాసుకునేవాళ్ళం. "వయసొచ్చిన పిల్లవి. ఈ వుత్తరాలేమిటే?" అంటూ వాటిని కూడా నిషేధించింది అమ్మ.

మేం చదువుకున్న ఎలిమెంటరీ స్కూలు ఇప్పుడు హైస్కూలుగా మారింది. కృష్ణ అక్కడే తెలుగు మేష్టారుగా వుంటున్నాడని తెలిసింది. నేనిప్పుడు స్వతంత్రురాలిని. నన్ను శాసించే అధికారం ఎవ్వరికీ లేదు. కృష్ణకు చేరువ కావాలనే ఈ స్కూల్లో టీచరు వుద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్నాను. పిలుపు వచ్చింది.

కృష్ణ నన్నిప్పుడు గుర్తుపట్టగలడా? కృష్ణతో కలిసి మళ్లీ ఈ పట్టాల మీద నడవాలని కోరికగా వుంది. రైలుపట్టాల్లా కాకుండా నా జీవితం కృష్ణతో కలిసిపోవాలి. ఇకనెప్పుడూ అతనికి దూరం కాకూడదు.

రైలు కట్టకి అవతల టూరింగు టాకీసులోంచి ఆట మొదలు కావటానికి సూచనగా సినిమా పాటలు వినిపిస్తున్నాయి. రైలు ఎంతకీ కదలక పోయేసరికి జనం ఒక్కొక్కరే దిగిపోతున్నారు. అతనెవరో ఇటే నడిచి వస్తున్నాడు. అతని వెనకాలే నడిచి వచ్చే ఆవిడ 'చిన్నపిల్లలా పట్టాల మీద నడిచే ఈ పిచ్చిది ఎవరా!' అన్నట్టుగా నన్నే చూస్తోంది వింతగా.

అతను బాగా దగ్గరయ్యాడు. ఎక్కడో చూసినట్టుంది.

"కృ....ష్ణ...."

"రే....వ....తీ! నువ్వు....?"

ఆవిడ మా ఇద్దరికేసీ విస్మయంగా చూస్తోంది.

"మా ఆవిడ సీతా! ఈ అమ్మాయీ నేనూ చిన్నప్పుడు...."

సరిగ్గా అప్పుడే కదలబోయిన ఇంజను చేసిన రొదలో కృష్ణ మాటలు నాకు వినబడలేదు.

—జి. మల్లీశ్వరి




## త్యాగరాజ కీర్తనలు

### [స్వర సంపుటి]

**[శ్రీమతి ద్వారకా పార్థసారధి, ఎస్. సి. పార్థసారధి; ప్రచురణ: బాలసరస్వతీ బుక్ డిపో, 14, సుంకురామచెట్టి వీధి, మద్రాసు - 1; పేజీలు: 184; వెల: రూ. 15]**

సంగీత సాగరానికి త్యాగరాజస్వామి వెన్నెల ఇచ్చే చంద్రుడు. వాగ్గేయకారుడిగా ఆయనకున్న ప్రఖ్యాతి అనంతం. ఆయన సంగీత నిధి. సంగీత సాధకులకు త్యాగరాజే పెద్ద భిక్ష. అటువంటి త్యాగరాజ కీర్తనల్లో కొన్నింటిని తీసుకుని—మద్రాసు సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా వుంటున్న శ్రీమతి ద్వారకా పార్థసారధి, భర్తగారితో (డైరెక్టర్, మద్రాసు సంగీత కళాశాల) కలిసి, స్వరపరిచి, మొదటి భాగంగా పుస్తక రూపంలో వెలువరిచారు. ఈ పుస్తకం గురించి 'అభిప్రాయం' తెలియజేసిన గాయక సార్వభౌముడు బాలమురళీకృష్ణ—"ఈ పొత్తము జనాదరణ పొంది, విద్వాంసులు, విద్యార్థులు గ్రహించి తరింతురుగాక" అని ఆశించారు. పుస్తకం మొదట్లో సంగ్రహంగా త్యాగరాజు జీవిత చరిత్రను చెప్పడం ఔచిత్యంగా వున్నది.

రాగ లక్షణాలూ, స్వరాలూ వివరించబడ్డ పుస్తకం కనుక, సంగీత ప్రియులందరికీ ప్రియమైన గ్రంథం.

## మాధవి

### (నవల)

**[రచన: కొలిపాక రమామణి; ప్రచురణ: ఎమ్. శేషాచలం అండ్ కో; పేజీలు: 124; వెల: రూ. 3.50]**

ఇది మంచి నవల: మామూలు 'బాయ్ మీట్స్ గర్ల్' కథలా కాకుండా ఇందులో కొంత మనస్తత్వ పరిశీలన ఉంది. మామూలు జీవితంలో మనకు "రమణ" లాంటి మనుష్యులు కనబడుతూ ఉంటారు. కానీ వాళ్ళను మూర్ఖులు, మొండివాళ్ళు, దురదృష్టవంతులు అని పేరుపెట్టి పట్టించుకోము. కానీ, వారి ప్రవర్తన వెనకాల ఏదో తెలియని బాధ, చెప్పుకోలేని దుఃఖం, ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఉంటాయని అనుకోము. మాధవి లాంటి మంచి అమ్మాయి, రమణకు భార్య అయినా సర్దుకోలేక పోతుంది.

అవివాహితులైన ఆడపిల్లలుండే హాస్టల్ వాతావరణం చాలా చక్కగా చెప్పారు రచయిత్రి. మాధవి వివాహానికి ముందు ఆమె కన్న కలలు వివాహం తరవాత ఆమె జీవన విధానం రెండూ ఎంతో విభిన్నంగా ఉన్నాయి. ఎంతో నీటుగా శుభ్రంగా ఉండే రమణ గుండెనిండా ఏవో తెలియని సుడిగుండాలు. తన పోలికతో పుట్టిన కొడుకును భరించలేడు. వాడిని ఎవరైనా అంటే అసలు భరించలేడు. ఇంట్లో అద్దముంటే భరించలేడు. మేధావిగా పేరు పొందిన అతను మొండితనంతో పేరు ప్రఖ్యాతులకు దూరమౌతాడు. కేవలం తండ్రి రాసిన ఉత్తరం చదివి, తన కన్నా తమ్ముడు ఉన్నత స్థితిలో ఉన్నాడని తెలిసి భార్యాబిడ్డల్ని వదిలేసి వెళ్ళిపోతాడు. స్నేహితురాలు వేదవతి, డాక్టరుగారి కుటుంబాల సహాయంతో నిలబడగలుగుతుంది మాధవి. తండ్రి లాంటి ప్రవీణ్‌ను ప్రేమతో వేద, డాక్టర్ కుటుంబం మార్చడం చూసి, తన భర్తకు ఏది చిన్నప్పుడు పెంపకంలో దూరమయిందో గ్రహించుకుంటుంది.

ఇందులో రమణపాత్ర చాలా మంచి పాత్ర. వేదవతి పాత్రలో ఈతరం స్త్రీకి ప్రత్యేక ఆర్థికస్వతంత్రం ఆడదానికి ఎంత ఆత్మబలాన్నిస్తుందో చక్కగా చెప్పారు రచయిత్రి. ప్రతి ఆడపిల్ల కలలుకనే జీవన విధాన ప్రతినిధి నీలవేణి. అలా బ్రతకాలని ఉన్నా, అందరికీ అలా బ్రతికే అదృష్టం ఉండదు అనిపిస్తుంది.

మంచి నవలఇది.

## మాకీ భర్త వద్దు

### (నవల)

**[రచన: డా॥ ఆలూరి విజయలక్ష్మి; ప్రచురణ: నవోదయా పబ్లిషర్స్, విజయవాడ; పేజీలు: 120; వెల: రూ. 6-00]**

ఇది కథల సంపుటి-అయితే పేజీలు నింపాలని వ్రాసిన కథలు కావు.... చెప్పదలుచుకున్న విషయాన్ని చెప్పాలని ప్రయత్నించిన కథలు. ఈ సంపుటి, "నేటి సామాజికవ్యవస్థ ఇనుప పాదాలక్రింద నలిగిపోతున్న అభాగినులకు" అంకితమిచ్చారు రచయిత్రి. దీనినిబట్టే, ఈ కథలన్నీ ఆడవారి సామాజిక సమస్యలకు ప్రతిరూపాలని అర్థమౌతుంది. ఈ పుస్తకంలోని హైలైట్ శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారి "ఆశీర్వచనం" అందులో వారు, "రచన వరమో-శాపమో-అంతేకానీ మధ్యస్తంగా ఉండకూడదు. ఉంటే అది ఆత్మహత్యే........కథలు మనల్ని వేటాడాలి... వేధించాలి...తరమాలి ..." అన్నారు. ఈ కథల్లోని కథానాయికలందరికీ ఆవేశం పాలు ఎక్కువ. సర్దుబాటు అంటే బలహీనతక్రింద, లొంగుబాటుక్రింద భావించిన ఆడవారు. స్త్రీకొక నీతి, పురుషుడికి ఒక నీతి ఎందుకు అమలులో ఉండాలి? ఈ ప్రశ్నే "మాకీ భర్త ఒద్దు" కథలో 'నేనూ మీలా చేస్తే మీరు సర్దుకుపోగలరా? మరో మగవాడితో కలిసి నా ప్రేమను, నా దేహాన్ని పంచుకోగలరా?" అని సౌజన్య చేత అడిగించారు రచయిత్రి. "వలయంలో వనిత"లో టీనేజ్‌లో వచ్చే సమస్యలు ప్రధానంగా తీసుకున్నారు. కానీ, చెప్పవలసిందంతా చెప్పారా అన్నది ప్రశ్న "సంస్కారం" మరొక మంచి కథ. 'స్నేహమనేది శరీర సంబంధాలకు మించిన అనుబంధమని నమ్మగలిగిన రోజున మళ్లీ నన్ను పలకరించండి" అనే భారతి మాటలు చాలా విలువైనవి.

"చీకటిలోపల వెలుగు" కథ చాలా గొప్ప సమస్యను ఎదుర్కొంది. మనిషి ఎంత సంస్కారపు రంగులు పులుముకున్నా, ఎంత నాజూకుతనం అలవాటు చేసుకున్నా, అతన్ని అతని జీవితాన్ని, ఆ జీవితంలో సుతిమెత్తని సుకుమార భావాలైన ప్రేమలు, దాంపత్యం, సౌందర్యం, సంతానం లాంటి వాటిపై ఇంకా ఆర్థికవలయం ప్రభుత్వం చేస్తూనే ఉంది. కట్నం తీసుకుని సంసారం చేసే హక్కు సంపాదించుకోవడం, తనవల్ల కలిగే బిడ్డ పురుడు భార్య తల్లితండ్రులు భరించాలని ఆలోచించడం, తన బాధ్యతలు, తన ఆనందాలకోసరం తన లాంటి వ్యక్తే నలిగిపోవాలని కోరుకోవడం ఇవన్నీ వీటికి ప్రతీకలు.

డాక్టర్‌గా రచయిత్రి "సూడోసయిసిన్" కథలోనూ, 'చీకటిలోపల వెలుగు'లోనూ సైంటిఫిక్‌గా కొన్ని సమస్యలు విప్పారు.



# వంటలు

[ప్రత్యేక పారితోషికం రూ. 25 లు పొందిన వంటకం]

## అరటిదూట గారెలు

కావలసిన పదార్థాలు: 2 పెద్ద సైజు అరటి దూట ముక్కలు; ½ కిలో శనగపిండి; ¼ కప్పు బియ్యప్పిండి; 10 పచ్చిమిరపకాయలు; 12 పెద్ద ఉల్లిపాయలు; 1 ముక్క అల్లం (పెద్దది); 2 చెంచాలు డాల్డా; కొద్దిగా కారం; రుచికి తగినంత ఉప్పు; వేయించడానికి కావలసిన నూనె.

తయారు చేయవలసిన విధానం: మొదట అరటిదూటని చెక్కు మాదిరిగా తరగాలి. ఆ తరువాత ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు, అల్లం కూడా చెక్కులాగా తరుగుకోవాలి. అరటిదూట చెక్కుతో బాటు ఈ ఉల్లి, మిరప, అల్లం చెక్కులని కూడా శనగపిండి, బియ్యప్పిండి మిశ్రమంలో రెండు చెంచాల డాల్డా వేసి, బాగా కలపాలి. బియ్యప్పిండి కలపడం వల్ల గారెలు మరీ మెత్తబడకుండా వుంటాయి. తరువాత కారం, ఉప్పు కూడా వేసి సరిగ్గా కలిసేలా చన్నీళ్ళు పోస్తూ కలపాలి.

తర్వాత స్టవ్ మీద బాణలి వుంచి సగానికి పైగా నూనె పోసి బాగా మరగనివ్వాలి. ఈ నూనెలో కలిపి వుంచుకున్న పిండిని గారెల మాదిరిగా చేసుకుని బాణలిలో వేసి రెండువైపులా బాగా ఎర్రగా వేగనివ్వాలి. ఆ తరువాత వీటిని అట్లకాడతో పళ్ళెంలో వేసుకోవాలి. ఇవి వేడి మీద చాలా రుచిగానూ, కమ్మగానూ వుంటాయి.

—కె. లక్ష్మీకాంతం, విశాఖపట్నం

## స్పాంజ్ కేక్

కావలసిన పదార్థాలు: 100 గ్రాములు మైదా, 100 గ్రాములు వెన్న, 100 గ్రాములు చక్కెర, ½ టీస్పూన్ బేకింగ్ పౌడరు, 2 కోడిగ్రుడ్లు, 10 చుక్కలు వెనిలా ఎసెన్సు.

తయారు చేయవలసిన విధానం: ముందుగా మైదాపిండి, బేకింగ్ పౌడర్ కలిపి జల్లించి వుంచుకోవాలి. చక్కెర మెత్తగా పొడిచేసి వుంచుకోవాలి. ఒక వెడల్పాటి పాత్ర అడుగు గుండ్రంగా వుండేటట్లుగా చూసి తీసుకుని అందులో వెన్న, పొడిచేసి వుంచుకున్న చక్కెర వేసి బాగా దళసరిగా వుండే గరిటె తీసుకుని కలియబెట్టాలి. అలాగే 20, 25 నిమిషాలపాటు కలపెడుతూ వుంటే ఆ మిశ్రమము మనము ముఖానికి రాసుకునే స్నోలాగా తయారవుతుంది. తర్వాత కోడిగ్రుడ్లు కొట్టివేసి తిరిగి ఆ మిశ్రమాన్ని 10, 15 నిమిషాలు కలియ బెట్టాలి. (కలపడం తక్కువైతే కేకు గట్టిగా వుంటుంది) తర్వాత వెనిలా ఎసెన్సు వేసి బాగా మిశ్రమాన్ని కలిపి అందులోని గరిటె తీసి వెయ్యాలి. తర్వాత జల్లించి వుంచుకున్న మైదా, బేకింగ్ పౌడరు మిశ్రమాన్ని పాత్రలోని మిశ్రమంతో చేర్చి పూర్తిగా చేత్తో కాకుండా వేళ్ళతోనే బాగా కలిసేటట్లుగా కలుపుకోవాలి. కేక్ తయారు చేయాలనుకున్న పాత్రకు నాలుగు వైపులా వెన్న రాసి పైన తయారుచేసి వుంచుకున్న మిశ్రమాన్ని అందులో వేయాలి. మిశ్రమం అందులో సగానికి పైన రాకూడదు. కనుక పాత్రను దానికి తగిన సైజులో చూసి తీసుకోవాలి. తర్వాత ఆ పాత్రను ఓవన్‌పెట్టి, దించి దానికి ముందుగా కేక్ మధ్య భాగంలో గ్రుచ్చి చూడడానికి ఏదైనా కత్తి తీసుకుని గ్రుచ్చి చూస్తే వెన్న లాగా జిగటగా తగులుతే కేక్ తయారయినదని అనుకుని ఓవన్‌లో నుండి తీసెయ్యాలి.

ఓవన్ లేనినాళ్ళు ఒక బాణలిలో సగము వరకు ఇసుకపోసి అందులో కేక్ పాత్ర నుంచి దాని పైన గాలిపోకుండా వుండే పెద్ద పాత్రను బాణలికి సరిగ్గా వుండేటట్లుగా బోర్లించి స్టవ్ మీద పెట్టాలి. అరగంట అయిన తర్వాత మంట తగ్గించి ఇంకో అరగంట వుంచి దింపెయ్యాలి. దీన్ని కూడా కత్తితో గ్రుచ్చి చూసి కేక్ అయిందనుకుంటానే దింపాలి. లేకుంటే ఇంకా కొంచెంసేపు వుంచి తియ్యాలి. కేక్ చల్లారిన తర్వాత పాత్రలో నుండి తీసి మనకు కావలసిన ఆకారంలో ముక్కలు కోసుకోవాలి.

—సి. లీలామన్నార్, మద్రాసు

## మటన్ పికిల్

కావలసిన పదార్థాలు: 1 కిలో మాంసము; 30 నిమ్మకాయలు (పెద్ద సైజువైతే 25 చాలు); ½ కిలో మంచినూనె; ¼ కిలో కారపుపొడి; 100 గ్రాములు ఆవాలు; 50 గ్రా॥ ధనియాలు; 50 గ్రా॥ అల్లం; 3 పెద్ద సైజు వెల్లుల్లిపాయలు; 1 టీ స్పూను పసుపు; 4 ఎండు మిరపకాయలు; 1 టీస్పూను జీలకర్ర; తగినంత ఉప్పు.

తయారు చేయవలసిన విధానం: మార్కెట్ నుంచి మాంసం తెచ్చేటప్పుడు ఎముకలు, కొవ్వు లేకుండా చూసి తీసుకోవాలి. ఈ మాంసాన్ని కైమా కంటె కొంచెం పెద్ద సైజులో చిన్న చిన్న ముక్కలుగా కోసుకోవాలి. ఒక పాత్రలో ధనియాలు పోసి స్టవ్ మీద పెట్టి వేయించి వుంచుకోవాలి. ఆవాలు శుభ్రం చేసుకోవాలి. అల్లం, రెండు వెల్లుల్లి పాయలు వలిచి వుంచుకోవాలి. రోలు శుభ్రంగా తుడిచి ఆవాలు దంచి మెత్తగా పొడి చేసుకోవాలి. అల్లం, వెల్లుల్లి నూరి పెట్టుకోవాలి. నిమ్మకాయలని ఒక గిన్నెలో రసం పిండుకోవాలి. ఆ రసాన్ని సన్నటి బట్టతో మరో గిన్నెలోకి వడగట్టుకోవాలి.

ముక్కలుగా కోసుకున్న మాంసం శుభ్రంగా కడిగి, కారపుపొడి, పసుపు, ఉప్పు, నూరిన అల్లం, వెల్లుల్లి మసాలా అందులో వేసి బాగా కలిపి స్టవ్ మీద పెట్టాలి. అది ఉడికి పొడిపొడిగా అయిన తర్వాత అందులో ధనియాలపొడి, ఆవాలపొడి, నిమ్మరసం వేసి బాగా కలిపి మరోసారి స్టవ్ మీద పెట్టాలి. బాగా పొంగు వచ్చేవరకు ఉడికిన తర్వాత స్టవ్ మీద నుంచి దించుకోవాలి.

ఆ తర్వాత ఒక పొడి గిన్నెలో అరకిలో నూనె పోసి బాగా మరగనివ్వాలి. టీస్పూను ఆవాలు, టీస్పూను జీలకర్ర, ఒక వెల్లుల్లిపాయ వలిచి, నాలుగు ఎండు మిరపకాయలు ముక్కలు చేసి అందులో వేసి దించుకోవాలి. 15 నిముషాల తర్వాత ఉడకబెట్టి వుంచుకున్న మాంసం మిశ్రమం నూనెలో వేసి బాగా కలపాలి. ఈ మటన్ పికిల్ బాగా చల్లారిన తర్వాత జాడిలో గానీ, సీసాలో గానీ మూతపెట్టి వుంచుకుంటే రెండు మూడు నెలల వరకూ నిలవవుంటుంది. ఇది అన్నంలోకి, చపాతీల లోకి కూడా రుచిగా వుంటుంది. చేయడం కూడా సులభం.

—శ్రీమతి మొహియుద్దీన్, మంచిర్యాల

CHIFFONS AND MUSIC

TIPS
AND
TOES




When you're the alluring sophisticate, on an 'out-to-dine-and-dance date, try our 'enchanted evening' colour suggestions: *Maroon Melody, Mood Magenta, Purple Passion, Crimson Silk, Mink Magenta* and *Flaming Scarlet* Nail Lustre shades. All specially formulated to last longer without chipping or peeling.

We also have 18 other 'occasion colours' to choose from. In pearl and plain.

Also available: Lanolin-enriched Tips and Toes Nail Lustre Remover.

On view at all leading stores.

TIPS
AND
TOES
NAIL LUSTRE.

**Make-up for nails.**

everest/ro/SH/152



# రూ. 100 లు బహుమతి పొందిన ఈ నెల వంటకం

## క్యారట్ బాదుషా

కావలసిన పదార్థాలు : ¼ కిలో క్యారట్; 100 గ్రాములు మైదాపిండి, 150 గ్రాములు పంచదార; 150 గ్రాములు డాల్డా; 4, 5 ఏలకులు: 2 చుక్కలు పైనాపిల్ ఎసెన్స్.

తయారు చేయవలసిన విధానం : ముందుగా క్యారట్లను శుభ్రంగా కడిగి చిన్న చిన్న ముక్కలుగా తరిగి కొద్దిగా నీరుపోసి మెత్తగా ఉడకబెట్టాలి. తరువాత ఈ ఉడికిన క్యారట్లను మెత్తగా కాటుక వలె రుబ్బుకోవాలి. ఇలా రుబ్బుకున్న క్యారట్ ముద్దలో మైదా పిండి, ఏలకుల పొడి, 2 చెంచాల డాల్డా వేసి నీరు పొయ్యకుండా పూరీలపిండి మాదిరిగా చేతికి అంటుకోకుండా కలిపి పెట్టుకోవాలి. పిండి గట్టిగా రాకుంటే మరి కొంచెం మైదా కలుపుకోవచ్చును.

బాగా కలిపిన ఈ పిండిని చిన్న చిన్న వుండలుగాచేసి తర్వాత బాదుషా ఆకారంలో నొక్కి వుంచుకోవాలి. తరువాత ఒక గిన్నెలో పంచదార వేసి కొద్దిగా నీరుపోసి స్టవ్ మీద సన్నటి సెగపై పెట్టి ముదురు పాకం తీసుకోవాలి (నీళ్ళల్లో పాకం వేస్తే పూస వలె నిలవాలన్న మాట) అయితే పాకం మరీ ముదరనివ్వకూడదు. ఈ పాకంలో 2 చుక్కలు పైనాపిల్ ఎసెన్స్ వేసి కలియబెట్టాలి. ఎసెన్స్ లేకపోతే ఏలకులపొడి వేసుకున్నా పర్వాలేదు.

ఇప్పుడు స్టవ్ మీద బాణలిపెట్టి అందులో డాల్డా వేసి, అది కాగిన తర్వాత ముందుగా చేసి పెట్టుకున్న బాదుషాలను డాల్డాలో వేసి దోరగా వేయించుకోవాలి. మరీ ఎర్రగా వేగనివ్వకూడదు. ఈ వేయించిన బాదుషాలను పంచదార పాకంలో వేసి వెంటనే ఒక్కొక్కటిగా తీసి విడివిడిగా పళ్లెంలో పెట్టుకోవాలి. పది నిముషాలపాటు ఆరనిచ్చి ఆ తర్వాత ఆరగిస్తే రుచిగా వుంటాయి. కావలసినవారు ఈ క్యారట్ బాదుషాల మీద బజార్లో అమ్మే రంగు కొబ్బెర చల్లుకోవచ్చును. పైన చెప్పిన కొలతల ప్రకారం చేస్తే 20 వరకు ఈ క్యారట్ బాదుషాలు వస్తాయి. అరగంట లోపల తయారవుతాయి.

—ఎమ్. ఎస్. ఉమ, బెమల్‌నగర్ (కర్ణాటక)

## కొత్తరకం పూరీలు

కావలసిన పదార్థాలు : 1 కిలో పచ్చిబియ్యం; కొబ్బరికాయ; కాస్త పసుపు; 10 గ్రా॥ జీలకర్ర; 50 గ్రా॥ నువ్వులు; 2 మిరపకాయలు; 500 గ్రా॥ రేడియో ఆయిల్.

తయారుచేయవలసిన విధానం : పచ్చిబియ్యం మెత్తగా దంచుకుని జల్లించుకోవాలి. కొబ్బరిని కోరుకుని నీళ్ళు చేర్చి బాగా రుబ్బి పాలు తీసుకోవాలి. నీళ్ళు ఎక్కువగా చేర్చకూడదు. పసుపు పొడి, జీలకర్ర, మిరపకాయలు నూరుకుని కొబ్బరి పాలతో కలపాలి. పొయ్యిమీద పెట్టి కాచి దించుకుని–బియ్యం పిండిలో కొద్ది కొద్దిగా కలుపుతూ బాగా కలియబెట్టాలి. చేతికి అంటుకోకుండా పిండిని పళ్ళెంలోకి తీసుకోవాలి. వేడిగా వున్నప్పుదే నువ్వులు కలిపి తర్వాత ఉసిరి కాయ పరిమాణంలో వుండలు చేసుకుని గుండ్రంగా ఒత్తుకోవాలి. (పిండి త్వరగా ఆరిపోతూ వుంటుంది. అందువల్ల నీళ్ళు దగ్గరే వుంచుకుని అరచేతులు తడిచేసుకుంటూ వుండాలి) బాణలిలో నూనె కాగాక ఒత్తుకున్న పూరీలను చుట్టలా చుట్టి అందులో వేసి బంగారు వన్నెగా వచ్చాక పళ్ళెంలోకి తీసుకోవాలి. కరకరలాడుతూ చాలా రుచిగా వుంటాయి ఈ కొత్తరకం పూరీలు.

—విమలా షాజహాన్

మీరు ఎన్నో వంటలు తిని వుంటారు; తయారు చేసి వుంటారు. అలా ఒకరి ద్వారా నేర్చుకున్నవీ, చూసినవీ కాకుండా మీ పాక పరిజ్ఞానంతో మీరు ఏదైనా కొత్త వంటకం కనిపెట్టగలరా? అది స్వీటయినా ఘాటయినా ఫర్వాలేదు. అది కొత్తరకంగా వుండాలి; రుచికరంగా వుండాలి; మామూలుగా లభించే దినుసులతో–చెయ్యడానికి బాగా వీలుగా వుండాలి. గమనిక: అది ఆరోగ్యానికి ఉపయోగపడే వంటకం కూడా కాగలిగితే (చౌకలో ప్రోటీన్ ఫుడ్ లాంటిది) పోటీలో అది ప్రత్యేకమైన అర్హతగా పరిగణింపబడుతుంది. 'అటువంటి వంటకాన్ని అందరూ మెచ్చుకుంటారు' అని మీకు అనిపించినప్పుడు, ఆ వంటకాన్ని ఎలా తయారుచెయ్యాలి? ఏమేం పదార్థాలు అందులో వెయ్యాలి? అన్ని వివరాలతో మాకు రాసి పంపండి. మీ వంటకం విలువైనదనీ, కొత్తదనీ బాగుంటుందనీ అనిపిస్తే ఆ వంటకానికి—

## నూరు రూపాయలు బహుమతి!!

ఇక్కడ ప్రచురిస్తున్న రెండో వంటకం—మా తమిళ పత్రిక "మంగై"లో బహుమతి పొందిన వంటకం. 'వంటల పోటీ'లో రూ. 100 ల బహుమతికి ఎన్నిక అయిన తర్వాత తక్కిన వంటకాల్లో ఒక దాన్ని ఎన్నుకుని దానికి రూ. 25 లు ప్రత్యేక బహుమతిగా ఇవ్వడానికి నిర్ణయించుకున్నాము. ఈ బహుమతిని ఈ నెల నుంచి ఆరంభిస్తున్నాము తక్కిన వంట కాల్లో బాగున్న వాటిని కూడా, మామూలు "వంటలు" పేజీలో ప్రచురిస్తాము. వాటికి ఒక్కో-దానికి రూ. 10 లు పారితోషికంగా పంపుతాము.

మే నెల పోటీకి వంటకాలు పంపవలసిన ఆఖరు తేదీ: మార్చి 15

చిరునామా : వంటల పోటీ, వనిత—చందమామ బిల్డింగ్స్ మద్రాసు 600026



Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

